## సదాశివ సమారంభాం



గురు దక్షిణామూర్తి



గురు వేదవ్యాస మహర్షి



గురు శుక మహర్షి



గురు నారద మహర్షి



గురు వాల్మీకి మహర్షి



గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం



గురు దత్తాత్రేయ



గురు బాబాజీ



గురు గౌతమ బుద్ధ



గురు ఆదిశంకరాచార్య



గురు రామానుజాచార్యులు



గురు జ్ఞానేశ్వర్



గురు రవిదాస్



గురు కబీర్ దాస్



గురు చైతన్య మహా ప్రభువు



గురు నానక్



గురు రాఘవేంద్ర స్వామి



గురు వీరబ్రహ్మేంద్ర స్వామి



యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం



గురు త్రైలింగ స్వామి



గురు లాహిరి మహాశయ





గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి



గురు వివేకానంద



గురు సాయి బాబా



గురు అరవిందో



గురు రమణ మహర్షి



గురు యోగానంద



గురు భక్తివేదాంత ప్రభుపాద



గురు మళయాళస్వామి



గురు విద్యాప్రకాశానందగిరి



గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..





## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam

Author:

Year: to

Subject: Any Subject

Language: Telugu

Scanning Centre: Any Centre

Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# ధర్మఘంటి

ఈ గ్రంథము తిరుపతి తిరుమల దేవస్థానమువారి ఆర్థిక సహాకారముతో ముద్రించబడినది.



గ్రంథకర్త

హరి రామనాథ్

# కృతజ్ఞతలు.

ఈ గ్రంథముద్రణ నిమిత్తం తిరుమల తిరుపతి దేవస్థానం హిందూ ధర్మరక్షణ సంస్థ అధికారులు 4520-రూ.లు సహాయం చేశారు. వారికి పూర్వ ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు శ్రీ P. V. R. K. ప్రసాద్‌గారు I. A. S. మహోదయులకు మనసార కృతజ్ఞతలు.

1) ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజగారు ఒంగోలు.
2 శ్రీ సాయినాథ్ ప్రింటర్స్ యజమానులు -ఒంగోలు.
3) పాటిబండ్ల వెంకటేశ్వర్లుగారు -దొడ్డవరప్పాడు.
4) శ్రీ బి. ఎల్. సత్యనారాయణశాస్త్రిగారు -కాకినాడ.
5) శ్రీ సుసర్ల శ్రీనివాసరావుగారు, అడ్వొకేట్ -కాకినాడ.
6) ఆత్కూరి నాగేశ్వరరావుగారు -మల్లవరం.
7) శ్రీ కె. యస్. సత్యనారాయణగారు M. A. Ph. D. నరసాపురం.

వీరందరికి — సమస్త పాఠక బృందానికి నా హృదయ పూర్వక కృతజ్ఞతలు.

భవదీయుడు,
గ్రంథకర్త.

నామావతారులు — పూజ్యులు శ్రీరామశరణ్, శ్రీ కుందుర్తి వేంకటనరసదాస గురు పూజ్యపాదుల దివ్యాశీస్సులతో ఈ గ్రంథం ప్రకటితం.

ఓం

# ధర్మ ఘంట

## (1) అర్జునుడు—విషాదం.

అర్జునునకు మరొక పేరు నరుడు. కలియుగ మానవుల కందరికు ఆతడు ప్రతినిధి. వాస్తవంలో ఆతనికి విషాదం లేదు మోహం లేదు. అర్జునుడు విషాదగ్రస్తుడయినాడు. ఆ విషాదం యోగమయింది, ఆతడు యోగియైనాడు. అస్మదాదుల కందరికు యోగరహస్యాన్ని బోధపరచాడు.

భగవానుడు శ్రీకృష్ణుడు రథసారథిగా వున్నాడు. అయినా అర్జునుడు విషాద యుక్తుడైనాడు. జీవుడు విషాదయుక్తుడు కానంత వరకు కనులముందే వున్నప్పటికి గోపాలుడు కనబడడు.

విషాద కారణంగా అర్జునుడు సమస్త విశ్వంలో సర్వాంతర్యామిని దర్శింపగలిగాడు. భగవానుని హృదయంలో మాత్రమే, దేవాలయంలో మాత్రమే ఒక్క వ్యక్తిగా మాత్రమే దర్శించువాడెన్నటికి దుఃఖాన్నుండిముక్తుడు కాలేడు. తాను తానుగా—దేవుడు దేవు

డుగా భిన్నంగా ఎంతవరకుంటారో కామక్రోధాదులు, రాగద్వేషాలు, సుఖదుఃఖాలు పీడిస్తూనే ఉంటాయి. "నేనెలా దుఃఖిస్తున్నానో అందరూ ఇలాగే దుఃఖించేవారేగదా!" ఇట్టి దయార్ద్రహృదయం మానవుడైన ప్రతివానికి ఉండితీరాలి. అందరూ మానవులే, అందరూ కర్మాధీనులే, సుఖించాలని అందరూ తపించేవారే," మానవుడు ముందుగా సమస్త జీవుల సుఖం నిమిత్తం సాధనచేయాలి. అప్పుడు వ్యక్తిగతంగా మానవుడు సుఖించడంలో ఎట్టిసందేహం లేదు.

విషాద యుక్తమైన వృత్తి విశ్వాన్ని ఆత్మలోనికి, ఆత్మను విశ్వంలోనికి కేంద్రీకరిస్తుంది. ముందు చిత్తం సంస్కరింప బడుతుంది, ఆతరువాత విశ్వం సంస్కరింప బడుతుంది. ఈ విధంగా వృత్తి, వృత్త్యారూఢచేతన విశ్వమంతటా వ్యాపించకుంటే, హృదయం ఒక్కటే అనే జ్ఞానం లేకుంటే, విషాదం లేకుంటే ఎప్పటికీ మానవుడు యోగికాలేడు.

విశ్వమంతటా వ్యాపించి వున్నవాడే రథంముందు సారధిగా కూర్చున్నాడు. భగవంతుడు సర్వవ్యాపకంగా ఉంటే జీవుల అవిద్య, విషాదం నివృత్తి కాజాలవు. ఈకార్యం నిమిత్తమే భగవంతుడు అవతరిస్తున్నాడు. అంటే వృత్తియందు ఆరూఢ చేతన అవుతున్నాడు. ఈ అవతార సిద్ధాంతం లేకపోతే వేదాంతమే లేదు.

అంతపెద్ద భగవంతుడు చిన్నవాడు కావాలి, స్నేహితుడు కావాలి, పుత్రుడు కావాలి, భర్త కావాలి, జీవన రధానికి సారధి

కావాలి. అవుతాడు. ప్రపంచంలోని అన్ని రూపాలు ఆయనవే. మరియు ఆయన ఈ అన్నింటికీ అతీతుడు. సర్వాంతర్యామి విషాద యుక్తుడైన జీవుని రథానికి సారథి అవుతున్నాడు. ఎంత దయామయుడు!

భగవత్సంబంధాన్ని పొందితే ఏ విషాదమైన యోగం అవుతుంది. అప్పుడింక దుఃఖముండదు. భగవత్సంబంధం లేకుండా నరుడు విషయాల నిమిత్తం, విషయీ పురుషుల నిమిత్తం విలపిస్తే దుఃఖించి తీరవలసిందే.

సుఖమనేది, దుఃఖమనేది బాహ్యప్రపంచంనుండి రాదు. అవి బజారువస్తువులు కావు. ఈ విషయాలు సుఖంగావున్నాయి. ఇవి దుఃఖంగా వున్నాయి. వీరు ఇష్టులు, వీరు అయిష్టులు అని మనసు మాయవలన రాగ ద్వేషాలకు వశమవుతోంది. ఫలితంగా మానవుడు సుఖిస్తున్నాడు, దుఃఖిస్తున్నాడు. మనసు భగవత్సంబంధాన్ని పొందాలి. ఎట్లా?

భగవంతుడు అంతటావున్నాడు. కాని మనభావం సమానంగా అంతటా వ్యాపించనంతవరకు ఆయనతో సంబంధ మేర్పడజాలదు. సంబంధం లేకుంటే, ఆయనెవరో? నీవెవరో?. ఈ సంబంధాన్నే 'ప్రేమ' అంటారు.

భగవంతునకు దూరమయితే 'విషాదం'. భగవంతునకు శరణాగతి చేస్తే 'యోగం'.

మనసులోని భగవంతుడు విశ్వాసానికి ప్రతీకం. విశ్వంలోని భగవంతుడు అనుభవానికి ఆధారం.

భగవత్సంబంధాన్ని పొందినప్పుడే విషాదం విషాదయోగం, కర్మ కర్మయోగం, భక్తి భక్తియోగం, జ్ఞానం జ్ఞానయోగం. దూరంగావుండే తత్త్వాన్ని దగ్గఱకుచేర్చే ప్రక్రియను 'యోగ' మంటారు.

భగవంతుడు మనలో వున్నాడు, మన ప్రక్కనున్నాడు, మన ముందున్నాడు, మన నేత్రాలలో నేత్రజ్యోతిగా, జఠరాగ్నిగా, వాక్కుగా, చిత్తవృత్తిగా వున్నాడు. సమస్త ప్రాణులు చెప్పుండే 'నేను' భగవంతుడే. అసలు ప్రాణులలోని జీవత్వమే భగవంతుడు. "మమైవాంశో జీవలోకే జీవభూతస్సనాతనః." (భగవద్గీత. అ 15—శ్లో 7.)

సృష్టిలో ఇంతగా మాట్లాడు శక్తిగలప్రాణి మానవుడొక్కడే. ఇతర జీవాలకు ఇంతటి వాచనశక్తిలేదు. మానవుడొక్కడే భగవంతుని కత్యంత సన్నిహితుడు. భగవంతునకు దూరంగా వున్నట్లుగా భావించుచుండుటవల్లనే మానవుడు దుఃఖిస్తున్నాడు.

బాహ్యమైన ఈ వైఖరీ వాణిని నియమబద్ధం చేస్తే, సత్య వచనంవలన మధ్యమా పశ్యంతీ పరావాణియొక్క అనుభవం నరునకు సిద్ధిస్తుంది. మధ్యమా పితృదేవతల వాణి, పశ్యంతి దేవతల వాణి, పరాయోగుల వాణి, ఆ పరావాణియే ఈ సమస్తానికి ఆధారం.

ఇంద్రియాలలోని పుష్టి భగవంతుడే. ఆ భగవంతుడే ఇలా కర్మేంద్రియ-జ్ఞానేంద్రియాలకు విషయంగా, విషయసుఖంగా, సుఖాంతంలో బలంగా అనుభవైక వేద్యుడవుతున్నాడు. సమస్త మానవులు భగవంతుని అనుభవిస్తున్నారు, ఆయన నుండియే జన్మిస్తున్నారు, ఆయనలోనే జీవిస్తున్నారు. ప్రకటంగా, సాకారంగా వుండే ఆ భగవచ్ఛక్తి తిరోహితం కాగానే జీవులు భగవానుని దగ్గఱకే వెళ్ళుచున్నారు.

"యతోవా ఇమాని భూతాని జాయంతే, యేనజాతాని జీవన్తి యత్ప్రయన్త్యభి సంవిశన్తి తద్విజిజ్ఞాసస్వ, తద్బ్రహ్మేతి."

— (తైత్తిరీయోపనిషత్.)

"ఎవ్వనిచే జనించు జగమెవ్వని లోపలనుండు లీనమై, ఎవ్వని యందుడిందు పరమేశ్వరు డెవ్వడు."

— (శ్రీమదాంధ్ర మహాభాగవతం.)

"నీవు లేకపోతే నేను బ్రతుకలేనని" మానవుడు ప్రపంచంలో ప్రతి చిన్నవస్తువుకు స్త్రీకి, ధనానికి, పుత్రులకు, మిత్రులకు, చివఱకు గడియారాలకు, పాదరక్షలకు సైతం దాసుడవుతున్నాడు. ఇంత సన్నిహితుడై, జీవంలో జీవమై, శరీరంలో జవసత్త్వాలై, జీవనంలో జీవనమై వున్న సర్వాంతర్యామికి ద్రోహం చేస్తున్నాడు. ఫలితంగా దుఃఖిస్తున్నాడు, పతనమవుతున్నాడు. పరమాత్మకై విలపించాలి, స్వీయాపరాధాల్ని స్మరించుకొని విషాదయుక్తుడు కావాలి,

శరణాగతుడు కావాలి. అప్పుడు ఆ సర్వవ్యాపక తత్త్వమే కృష్ణుడుగా, సారధిగా కనులముందుకు నడిచివస్తుంది. ఎట్టి హీన కార్యమైన చేస్తుంది. ఇదే భగవానుని భక్తవాత్సల్యం! ఇదే హిందూమతంలోని మహావైభవం!!

శ్లో॥ ప్రణవోధనుః శరోహ్యాత్మా బ్రహ్మతల్లక్ష్యముచ్యతే,
అప్రమత్తేన వేధవ్యం శరవత్తన్మయోభవేత్॥

— (ముండకోపనిషత్.)

బుద్ధిలోవున్న అంతర్యామి విషాదయుక్తుడైన అర్జునుని ముందుకు సారధిగా వచ్చాడు. "సారయతి అశ్వాన్ ఇతి సారధిః" సంచాలకునిని 'సారధి' అంటారు: "శరీరం రధమేవతు." శరీరమే రధం. ఓంకార ధనుస్సునందు నరుడు స్వీయాత్మకే అస్త్ర రూపమిస్తున్నాడు. ఆత్మ బలిచేస్తున్నాడు. అప్పుడు లక్ష్యమును భేధించువాడు నరుడుకాడు. పరమాత్మయే ఆత్మయందావేశించి, అస్త్ర మందు అధిష్ఠితుడై లక్ష్యభేదం చేస్తున్నాడు.

"అంతఃప్రవిష్టః శాస్తాజనానామ్"
"మత్తఃస్మృతిర్జ్ఞాన మపోహనంచ."
"ధీయోయోనః ప్రచోదయాత్."

భగవానుడంటే విశ్వాన్ని ప్రవర్తింప చేసేవాడు, బుద్ధిని ప్రేరేపించేవాడు. ఈ సమస్త మానవులలోని బుద్ధియే భగవంతుడు.

ఆయన బుద్ధిలో వున్నాడు, బుద్ధివెనుక ఉన్నాడు. మానవులు ముందున్న మాయను మాత్రమే చూడగలరు. వెనుకవున్న వానిని ఎట్లు చూడగలరు? ఆయనను చూచునిమిత్తం నరుడు విషాద యుక్తుడు కావాలి, అప్పుడు భగవానుడే తనను తాను చూపించు కొంటాడు.

విషాద యుక్తుడైనపుడు మానవుడు ఏంచేయాలి? శరీర భావానికి అతీతుడై, ఇంద్రియాలకు— ఇంద్రియ సుఖాలకు తటస్థ మాత్రుడై, స్వస్వరూపాను సంధానం చేయాలి. జీవుడు బుద్ధి దగ్గఱకు వెళ్ళవలెనంటే విషయాలవెంట వెళ్ళరాదు. సుఖపదార్థం దశేంద్రియాలకు—మనసుకు ఆవలవుంది. అక్కడకు వెళ్ళినప్పుడు గానీ జీవుడు సుఖించడు.

"సేనయోరుభయోర్మధ్యే రథంస్థాపయమేఽచ్యుత॥"

"అచ్యుతా! రెండుసేనల మధ్యలోకి రథాన్ని తీసుకొనివెళ్ళు."

పాండవసేన-కౌరవసేనలు సద్గుణ-దుర్గుణాలకు ప్రతీకాలు. మంచి—చెడు ఈ రెండింటికీ, మంచికికూడ, పాపానికి—పుణ్యానికి రెండింటికి తటస్థుడుగా, ద్రష్టగా ఎవడుంటాడో వాడే బుద్ధిమంతుడు, సుఖవంతుడు. పాపపుణ్యాలకు ఎవడు వశుడవుతాడో, రాగద్వేషాలకు ఎవడు అధీనుడవుతాడో వాడు బుద్ధిహీనుడై, అశాంతి కారణంగా దుఃఖిస్తాడు.

# 8

జానకీ రూపాన్ని ధరించి దాక్షాయణి శ్రీరామ చంద్రుని పరీక్షించింది. ఫలితంగా అశాంతి గ్రస్థయై, పతికి దూరమై పరితపించవలసివచ్చింది, దక్షయజ్ఞంలో దేహత్యాగం చేయవలసివచ్చింది. ఆ దాక్షాయణి పార్వతిగా అవతరించి పరమశివుని పరిణయమాడింది. అప్పుడు పరమేశ్వరుడంటాడు; "చూశావా! పార్వతీ! సంశయాత్మికా బుద్ధి సకల సద్గుణాల్ని, సుఖాల్ని, సమస్త పుణ్యాల్ని నశింపచేసి తీరుతుంది. బుద్ధి ప్రసన్నంగా ఉంటేనే మానవుడు సుఖిస్తాడు. బుద్ధి చెడిందంటే ఇంక మానవునకు అభ్యుదయం లేనట్లే."

భగవద్గీత బుద్ధిని బాగుచేయటానికి, సమస్త మానవుల్ని విగతమోహులుగా చేయటానికి అవతరించింది.

భగవద్గీత వైకుంఠంలో, కైలాసంలో దేవుడున్నాడని బోధించటంలేదు. "దేవుడు బుద్ధియందే వున్నాడు. నీవు నీబుద్ధి దగ్గఱకు వెళ్ళు. అంతర్యామికి శరణాగతుడవు కా! అంతేకానీ మరే ఇతరవ్యక్తులకు శరణాగతుడవు కావలసిన అవసరం లేనేలేదు. నీ అంతర్యామియే నీకు సద్బుద్ధి ననుగ్రహించి, తన సచ్చిదానంద స్వరూపాన్ని ప్రకటం చేస్తాడు. నిన్ను నీవు తెలిసికో, 'నేను' అనే వ్యవహారాన్ని 'నీవు'గా మార్చు. నేనంటే ఎవరు? నీవంటే ఎవరు? అవిద్య అంటే ఏమిటి? ఇలా స్వస్వరూపాను సంధానం చేయి. ఇదే భక్తి."

"స్వస్వరూపాను సంధానం భక్తి రిత్యభిధీయతే."

(శ్రీ ఆదిశంకరులు.)

శ్లో॥ దూరేణ హ్యవరంకర్మ బుద్ధి యోగాద్ధనంజయ,
బుద్ధౌశరణం మన్విచ్ఛ కృపాణాః ఫలహేతవః॥
(భగవద్గీత అ 2-శ్లో 49.)

"సమరూపమైన బుద్ధియోగం ముందు సకామ కర్మలన్నీ తుచ్ఛాతి తుచ్ఛాలు. నరుడా! నీబుద్ధికి శరణాగతుడవు కా!"

ఎనిమిది రకాలయిన విఘ్నాలు బుద్ధిని స్థిరంగా ఉండనీయక చంచలం చేస్తున్నాయి;

శ్లో॥ ధ్యాయతో విషయాన్ పుంసః సంగ స్తేషూపజాయతే,
సంగాత్సంజాయతే కామః కామాత్క్రోధోఽభిజాయతే॥
క్రోధాద్భవతి సంమోహః సంమోహాత్ స్మృతివిభ్రమః,
స్మృతి భ్రంశాత్ బుద్ధినాశో బుద్ధినాశాత్ ప్రణశ్యతి॥
(భగవద్గీత అ 2-శ్లో 62-63.)

"బంధించేదాన్ని 'విషయ' మంటున్నారు. శరీరమందలి కన్ను రూపాన్ని చూస్తుంది, శ్రోత్రాలు గానం వింటాయి. వెంటనే అవి ఆరూపం దగ్గఱ, గానందగ్గఱ బంధింప బడుతాయి. జీవుని విషయం బంధించేస్తుంది. బద్ధునకు సుఖమెక్కడిది?

మానవుడు విషయాల్ని ధ్యానించటంవల్లనే, మనసు విషయాకారం కాగా బద్ధుడవుతున్నాడు. ధ్యానించకుంటే, మనసు ఆసక్తం కాకుండావుంటే, స్వాధీనంగావుండే కామక్రోధాలు మానవుని బంధించ

లేవు. కామ క్రోధాదులుండవచ్చును. కాని మానవుడు వానికి అధీనుడుగా వుండరాదు.

విషయాలు — విషయీ పురుషులు సంగమాత్రంచే కామాన్ని ఉత్పన్నం చేస్తారు. కామం భంగమైనపుడు జీవుడు క్రోధానికి వశుడవుతాడు. క్రోధం మోహానికి కారణం. మోహం యుక్తాయుక్త విచక్షణా జ్ఞానాన్ని నశింపచేస్తుంది. ఫలితంగా బుద్ధి భ్రష్టమవుతుంది. ఇంక బుద్ధిహీనుడు సర్వనాశనంకాక మరేమవుతాడు.

కామక్రోధాలు లేదా రాగద్వేషాలు ముందు తమ జన్మస్థానాన్ని సర్వనాశనం చేస్తాయి, ఆ తరువాతనే ఇతరులను నశింపచేస్తాయి.

దుష్టుడుముందు స్వజనులకే అపకారం చేస్తాడు. అగ్ని ఎక్కడపుట్టిందో ముందు ఆకట్టెనే నశింపచేస్తుంది. కాన దుష్టుని ఎట్టి పరిస్థితులలోను వృద్ధినందనీయరాదు.

రాగం మనసంతకూ తన రంగువేస్తుంది, రాగంవలన మానవుడు అంధుడవుతాడు. దారి కానరాదు. ఫలితంగా మానవుడు భ్రష్టుడవుతాడు. క్రోధం అగ్నివంటిది. అది జన్మస్థానాన్ని, ముందు క్రోధంచెందిన వ్యక్తిని సమూలంగా దగ్ధంచేస్తుంది. ఇతరుల్ని దహిస్తోందో లేదో ఆతరువాత ఆలోచించాలి.

అర్జునుడు మోహగ్రస్థుడయినాడు;

శ్లో॥ దృష్ట్వేమం స్వజనం కృష్ణయుయుత్సుం సముపస్థితమ్।

(భగవద్గీత అ 1-శ్లో 28.)

"స్వజనుల్ని చూచి మోహపరవశుడైన అర్జునుడు కృష్ణునితో అంటున్నాడు; కృష్ణా! నా సమస్తాంగాలు శిథిల మవుతున్నాయి. శరీరం కంపిస్తోంది, రోమాంచమవుతోంది."

శ్లో॥ స్వజనం హికథం హత్వాసుఖినః స్యామమాధవ॥

(భగవద్గీత అ 1-శ్లో 37.)

"ఇంతమంది స్వజనుల్ని వధించి, మాధవా! మన మెట్లు సుఖించగలం?"

వీరంతా స్వజనులు కనుక మోహగ్రస్తుడై అర్జునుడు యుద్ధం చేయనంటున్నాడు. పరాయివారయితే యుద్ధం చేసేవాడే.

పాపాత్ములను స్వజనులని వ్యామోహం చెందటం ఎంతగొప్ప పాపానికి కారణమో!

ధర్మరాజు తమ్ముడు చెప్పేమాటలు ధర్మంగా ఉంటాయి కానీ అధర్మంగా ఎట్లా ఉంటాయి?

స్వశరీరమందే మోహం ఉండకూడదని ధర్మశాస్త్రం చెప్తుంటే స్వజన వ్యామోహం, అందునా! పాపాత్ములను స్వజనులనటం నిజంగా ఎంతమానసిక దౌర్బల్యం!

ఊహాశక్తిని నశింపచేసేదాన్ని 'మోహ' మంటారు. మోహగ్రస్తునకు మంచి-చెడు, పాపం-పుణ్యం, ఇహం-పరం, దేవుడు-ధర్మం ఈశబ్దాల అర్థం ఎంతమాత్రం తెలియదు. చెప్పినా అర్థంకాదు అర్థమయినా ఆచరించలేదు. మానవుని ప్రగతిని స్తంభింపచేసేదే మోహం.



# (2) భగవానువాచ–వర్ణాశ్రమ ధర్మాలు

"ఎంతమానసిక దౌర్బల్యానికి లోనయినావయా అర్జునా! ఇంతకాలం నాసాంగత్యం చేసినా నీవింకా ఇంత దుస్థితిలో నే వున్నావా? గుర్తుంచుకో, నీవు జన్మించింది క్షత్రియవంశంలో క్షత్రియునకు యుద్ధం చేయకుంటే ఇహపరాలు రెండూ నశిస్తాయి సుమా! ఈ ప్రపంచంలో వానికి సుఖముండదు, సుయశముండదు, మనశ్శాంతికూడ ఉండదు.

అర్జునుడు విలపిస్తున్నాడు; "మాధవా! ఇంతమంది స్వజనుల్ని వధిస్తే, భూమిని రక్తసిక్తంచేస్తే దేశం ప్రజాహీన మవుతుంది, వర్ణాశ్రమ ధర్మాల్ని పోషించే వారుండరు. చచ్చినవారికి పిండోదకాలు సమర్పించేవారుకూడా ఉండరు. మాధవా! ఇటువంటి ప్రాణిహింసను నన్నెందుకు చేయమంటున్నావు?"

వర్ణాశ్రమ ధర్మాలు యౌవనంలో లేకపోతే ప్రజలు సుఖంగా వుండలేరని, వర్ణాశ్రమ ధర్మాలు సమాజ శ్రేయస్సుకు అత్యంతావశ్యకమని అర్జునుడే చెప్తున్నాడు. చచ్చినవారికి పిండోదకాల నివ్వటం అపరిహార్య కర్తవ్యమనిగూడా హెచ్చరిస్తున్నాడు.

భూలోకం కర్మభూమి. తక్కిన సమస్త లోకాలకు ఈఒక్క భూలోకమే ఆధారం. ధర్మ కర్మలే సమస్త ప్రాణుల్ని జీవింప చేస్తాయి. ఆ ధర్మ కర్మలే తమను త్యజించిన వారిని సర్వనాశనం చేస్తాయి. ఈభూలోకంలో పితృదేవతలకు కొన్ని ప్రతీకాలున్నాయి. కాకులు, ఆవులు, తిలలు, కుశలు, బ్రాహ్మణులు ఇత్యాది. ఇలాగే దేవతలకు ప్రతీకాలున్నాయి. బ్రాహ్మణులు, ఆవులు, నదులు, క్షేత్రాలు ఇత్యాది. వేదమంత్రాలతో ఈ ప్రతీకాల్ని ఉపాసించి, అన్నం నివేదించినట్లయితే ఈ మంత్రశక్తి సమస్త లోకాలలో వ్యాపిస్తుంది, దేవతలకు, పితృదేవతలకు తృప్తికరంగా అన్నం వడ్డిస్తుంది. వేదమంత్రాలంటే ఇంతగొప్పవి. ఇతరలోకాలలో ధర్మ కర్మలుచేస్తే నిష్ఫలాలవుతాయి. అందువలన వారందరు జీవించా లంటే భూలోకవాసులు సంతతం ధర్మ కర్మలందు ప్రవృత్తులై తీరాలి.

శ్రీకృష్ణుడంటున్నాడు; అర్జునా! నీవే చెప్పావుగదా! వర్ణా శ్రమ ధర్మాల్ని పోషించితీరాలి. అవి విరాట్పురుషున కవయవాలు.

శ్లో॥ బ్రాహ్మణోఽస్యముఖమాసీద్ బాహూరాజన్యః కృతః,
ఊరూతదస్య యద్వైశ్యః పద్భ్యాంశూద్రో అజాయత॥
(ఋగ్వేదం.)

"బ్రాహ్మణ ధర్మం తపస్సు విరాట్పురుషునకు ముఖం, క్షత్రియధర్మం ప్రజాసంరక్షణం విరాట్పురుషునకు బాహువులు.

వైశ్యధర్మం వ్యాపారం విరాట్పురుషునకు ఊరువులయింది. శూద్ర ధర్మం సేవ విరాట్పురుషుని పాదాలనుండి పుట్టింది."

ఇచట ఎంతమాత్రం ఆ మనుషులకు ప్రాధాన్యంలేదు, ప్రాధాన్యత వారి ధర్మాలకు మాత్రమే. ధర్మం వేరూ—విరాట్పురుషుడు వేరూకాదు. విరాట్పురుషుని నుండి ఆయా ధర్మాలు ప్రకటమైనాయి కాని మనుషులు ప్రకటంకాలేదు. విరాట్పురుషుడే సృష్టిని ప్రవర్తింప చేయడానికి వర్ణాశ్రమ ధర్మాల రూపం ధరించాడు. నాలుగు తరగతులుగా ఆ ధర్మాలు లోకంలో సుస్థిరమైనాయి. ఇలా విభజించినా, విభజించకున్నా సృష్టి సుఖవంతంగా ఉండాలంటే పై నాలుగు ధర్మాలు ఏ కాలానికయినా, ఏ దేశానికయినా అత్యంతావశ్యకాలు.

పై నాలుగు ధర్మాలలో ఎంతమాత్రం న్యూనాధిక్యాలు లేవు, న్యూనాధిక్యాలను కల్పించుకొనటం నిస్సంశయంగా అజ్ఞానం. సృష్టికి నాలుగు ధర్మాలూ సమానంగా అవసరాలు. అవి విరాట్పురుషునకు శరీరావయవాలు అనటంచే బ్రాహ్మణధర్మం జపంవలన బ్రాహ్మణుని కెంత గౌరవమో సేవాధర్మం వలన శూద్రునకుకూడ అంతే గౌరవం. వాస్తవం చెప్పాలంటే అంతకన్న ఎక్కువగౌరవం. పై మూడు వర్ణాల వారిని, అందరను తన సేవచే ఆనందింప చేయువాడు శూద్రుడు. సేవలనందుకొను వానిగన్న సేవకుడే సర్వాధికుడన్నది అమోఘ సిద్ధాంతం. శూద్రధర్మం విరాట్పురుషుని పాదాలనుండి పుట్టింది అంటే పాదాల కెంతగౌరవం ఉందో అర్థమవుతూనేవుంది.

లోకంలో ఎవరయినా నమస్కారాలు—పూజలు పాదాలకు మాత్రమే చేస్తారు. శరీరానికంతకు పాదాలే ఆధార స్తంభాలు. శూద్రులు ఇల్లు నిర్మించటం ఇత్యాది శరీర కష్టానికి చెందినపనులు చేయకపోతే లోకంలో ఎవరికయినా సుఖమనేదే లేదుగదా!

వ్యక్తిగత స్వార్థానికి సంబంధించింది ఎప్పుడూ ధర్మం కాలేదు. పదిమంది శ్రేయానికి ఏదికారణ మవుతుందో దాన్ని మాత్రమే 'ధర్మ' మనాలి.

బ్రాహ్మణులు స్నానపూజా ఉపవాసాదులతో శరీరాన్ని శుష్కింపచేస్తారు. ఇందులో వారికి సుఖమేముంది? జగత్కల్యాణార్థం వారు తమ మనోవాక్కాయాల్ని తపింప చేస్తారు.

క్షత్రియులు సమస్త సుఖాలలో వుండికూడా యుద్ధావసర మేర్పడినపుడు అన్నింటిని త్యజించి వెళ్ళవలసిందే. యుద్ధానికి వెళ్ళిన రాజులు మరల ఇంటికి వస్తారనే నమ్మకమేముంది? అర్జునా! నీవు క్షత్రియధర్మాన్ని సంరక్షించినందువలన సమస్త ప్రపంచం ధర్మయుక్తమై సుఖిస్తుంది. నీవు నీకొఱకు గాక జగత్కల్యాణార్థం ఈ యుద్ధం చేయాలి. దుర్మార్గులయిన రాజుల్ని సంహరించి, సజ్జనుల్ని పదిమందిని జీవింపచేసినా చాలును. వారివలన సమస్త ప్రపంచం సుఖిస్తుంది.

వైశ్యులు సమస్త దేశాలుతిరిగి రకరకాల వస్తువుల్ని సంగ్రహిస్తారు. వానిని విక్రయిస్తారు. ఈ సంచారంలో వారికి సుఖ

మేముంది? వారే గనుక వ్యాపారం చేయకుంటే ప్రజలు ఆహార పథార్థాల నెలా పొందగలుగుతారు?

శూద్రులు సమస్త వర్ణాల వారిని తమ శరీర కష్టంతో సుఖ వంతుల్ని చేస్తారు. ఇందులో వారికి సుఖంలేదని వేరే చెప్పాలా?

ఇలా నాలుగు వర్ణాలవారు తమ భౌతిక సుఖాల్ని త్యాగంచేసి, ధర్మ సంరక్షణం ద్వారా జగత్కళ్యాణానికి కారణమవుతున్నారు. ఇలా వారు తమ సుఖాల్ని హతం చేస్తేనేగానీ ఇతరులు సుఖింపలేరు, సృష్టి జరుగదు. అయితే పదిమందిని సుఖింప చేస్తుంటే వారు వ్యక్తిగతంగా మాత్రం ఎందుకు సుఖించరు? సుఖించితీరుతారు. ఈ చాతుర్వర్ణ్య వ్యవస్థలో ఎంత ఉదాత్త భావమున్నది!

వర్ణాశ్రమ ధర్మాలు జనత ప్రగతికి ఏదేశానికయినా అవస రాలే. భారతదేశంలోనేగాక ఇతర దేశాలుకూడ ఈ వర్ణాశ్రమ ధర్మ వ్యవస్థతోనే సుఖవంతంగా వున్నాయి. (1) తపం, (2) కర్మ, (3) సంచయం, (4) సేవ అనే ఈ నాలుగుమార్గాల వలననే ఏ దేశమయినా కలకాలం పటిష్ఠంగా వుండగలుగుతుంది.

మానవులలోనేగాక పశుపక్షి వృక్షాలలోకూడా చాతుర్వర్ణ్య వ్యవస్థఉంది. ఇది పురాణకథనం.

జ్ఞానదానంచేసే వృక్షాలు—పశువులు బ్రాహ్మణ వర్ణంలోకి వస్తాయి. శక్తిదానం చేసే వృక్షాలు–పశువులు క్షత్రియవర్ణంలోకి

వస్తాయి. వస్తుదానంచేసే వృక్షాలు—పశువులు, మామిడిచెట్లు—ఆవులు ఇత్యాది వైశ్యవర్ణంలోకి వస్తాయి. తమ జీవికద్వారా కేవలం మానవుల సాధారణావసరాలకు మాత్రమే ఉపయోగించే వృక్షాలు—పశువులు శూద్రవర్ణంలోకి వస్తాయి.

శూద్రుడు—బ్రహ్మచారి. ఈ ఇరువురిది సమానకోటి, ఇర్వు రకు సేవ పరమధర్మం. వీరు విశ్వాత్మ ప్రధానులు. వైశ్యుడు—గృహస్థు సంగ్రహ ప్రధానులు, యోజనా ప్రధానులు, తైజసులు, హిరణ్యగర్భులు. వీరిర్వురది సమానకోటి. క్షత్రియుడు—వాన ప్రస్థుడు తమ ధర్మాచరణద్వారా ప్రపంచాన్ని నియమబద్ధంగా ప్రవ ర్తింప చేస్తుంటారు. వీరిది యోగం, ప్రాజ్ఞ ప్రధానం. బ్రాహ్మ ణుడు—సంన్యాసి ఈ ఇరువురిది సమానకోటి. ఇర్వురికి జ్ఞానార్జన ప్రధానలక్ష్యం. వీరిది తురీయ ప్రధానమైన శ్రేణి.

కర్మలో విశ్వాత్మ, ఉపాసనలో తైజసం, యోగంలో ప్రాజ్ఞుడు, తత్త్వజ్ఞానంలో తురీయం అనుగాములుగా వుంటాయి. వీరులేక సృష్టి లేనేలేదు. ఒకటేమాట! కాలచక్ర పరిభ్రమణానికి ఏకైకాధారం చాతుర్వర్ణ వ్యవస్థ, వర్ణవ్యవస్థ బాగుంటే అది ధర్మ కాలంగా, నశిస్తే పాపకాలంగా పురాణాలు ఘోషిస్తున్నాయి. వర్ణా శ్రమ ధర్మవ్యవస్థ నశించినపుడే దానిని రక్షించడానికి భగవంతుడు అవతరిస్తాడు.

శ్లో॥ చాతుర్వర్ణ్యం మయాసృష్టం గుణకర్మ విభాగశః।
తస్యకర్తార మపిమాం విధ్యకర్తార మవ్యయమ్॥

(భగవద్గీత అ 4-శ్లో 13.)

"గుణాలు ఆధారంగా ఈ వర్ణాశ్రమ ధర్మాలు నాచే సృష్టించబడ్డాయి. వీనికి కర్తనునేనే. మరియు నేను కర్తనుకూడ కాను. నేను అవినాశిని."

చాతుర్వర్ణ వ్యవస్థకు భగవంతున్ని కర్తగా చెప్పుకోవటం సముచితమే. అయితే ఆయనను అకర్తగా మాట్లాడుకొంటే అంతకన్న సముచితంగా వుంటుంది. ధర్మం ఎవరి అపేక్ష లేకుండా స్వతంత్రంగానే ప్రకాశిస్తుంది.

శ్రీకృష్ణుడంటున్నాడు; "అర్జునా! యుద్ధం చేయి. ఈ యుద్ధంలో జరిగే హింస క్షత్రియుడవయిన నిన్ను స్వర్గానికి పంపిస్తుంది.

అర్జునా! ఈయుద్ధం నీకుమాత్రమే సుఖమీయదు, ప్రజలందఱకు సుఖాన్నిస్తుంది.

వీరందఱను వధించి, సింహాసనం స్వాధీనం చేసికొంటావు. అయితే ఆ రాజ్యసుఖం అనుభవించేది ఎన్నాళ్ళు? మూన్నాళ్ళు మాత్రమే. క్షత్రియుడు ఒకనాడు సమస్త రాజ్యాన్ని త్యజించి, విరక్తుడై వనాలకు వెళ్ళవలసిందే."

ఈ భౌతిక సుఖాలన్నీ అనుభవం నిమిత్తంకాదు, త్యాగం నిమిత్తం ఏర్పడ్డాయి.

శ్లో॥ ఊర్ధ్వ బాహుర్విరౌమ్యేష నచకశ్చిచ్ఛృణోతిమే,
ధర్మాదర్థశ్చ కామశ్చ సకిమర్థం నసేవతే॥

(మహాభారతం.)

19

వేదవ్యాస మహర్షి రెండుచేతులు పైకెత్తి ఘోషిస్తున్నారు; "అందరు సుఖించాలనుకొంటారు. కాని నామాట నెవరు వినరేమి? నేచెప్పే పద్ధతివలన మాత్రమే మీరు సుఖించగలుగుతారు. మీ మనసుచెప్పే పద్ధతివల్ల శాశ్వతంగా దుఃఖానికి, అశాంతికి, పతనానికి లోనవుతారు. మానవులారా! మీకు ద్రవ్యం—విషయసుఖాలు—మోక్షంకావాలా? అయితే ధర్మాన్ని సేవించితీరాలి."



## (3) ధర్మం—సుఖం

ధర్మం సమస్త భౌతిక సుఖాలనిస్తుంది. అయితే ఈ భౌతిక శరీరం శాశ్వతం కాదుగదా, రోగ మందిరంగదా, ఈశరీరం అనుభవించే సుఖం, ఈ మనసుచెప్పే సుఖం వాస్తవంలో సుఖం ఎలా అవుతుంది?

తులసీదాసు—సూరదాసు—భర్తృహరి ప్రభృతులు తమ తొలిరోజుల్ని ఎంతగా విషయ సుఖాలకు వినియోగించారు! చివరకు జీవితంలోని ఒకమలుపు వారికళ్ళను తెరిపించింది, వారిని పశ్చాత్తప్తులను చేసింది. జ్ఞానభిక్షపెట్టి, మహాత్ములుగా రూపొందించింది.

ఎందరు రాజులు తమ రాజ్యాల్ని త్యజించి, కౌపీనధారులై వనాలకు వెళ్ళలేదు. వారేమి మూర్ఖులా? "కౌపీనవంతఃఖలు భాగ్యవంతః" లోకంలో కౌపీనధారి ఒక్కడే భాగ్యవంతుడు. ఇది త్రికాల సత్యం.

శ్లో॥ నాస్తిబుద్ధి రయుక్తస్య నచాయుక్తస్య భావనా,
నచా భావయతశ్శాంతిః అశాంతస్య కుతస్సుఖమ్॥

(భగవద్గీత అ 2–శ్లో 66.)

"ఇంద్రియ నిగ్రహం లేనివాడు బుద్ధిమంతుడుగా వుండజాలడు శాస్త్రీయ సంస్కారములు—ధర్మం అచట ప్రకాశింపవు. ఇంద్రియ నిగ్రహం—స్థిరబుద్ధిలేకున్న 'భావం' ఉండజాలదు, తత్త్వదృష్టి ఉండజాలదు. భావదరిద్రునకు ప్రసాదగుణం—శాంతి లేనేలేవు, లేకున్న ఇంక సుఖమెక్కడిది?"

పురాణాలలోని దేవేంద్రుడు అమిత విషయలోలుడు. ఆట పాటలకు, విషయసుఖాలకు బానిస. భూలోకంలో ఎవడు ధర్మంతో వున్నా, ఎక్కడ తపం జరుగుతున్నా దేవేంద్రుడు ఎంత దుఃఖిస్తాడో ఎన్ని వ్యర్థ ప్రయత్నాలు చేస్తాడో చెప్పటం అసాధ్యం. కాననే శ్రీ తులసీదాసు గారన్నారు; "యువకుడు—కుక్క—దేవేంద్రుడు ముగ్గురు ఒకేకోటికి చెందినవారు." ఇచట దేవతలంటే ఇంద్రియాలు. మనసే దేవేంద్రుడు.

ఫలితంగా ఆ దేవేంద్ర ప్రభృతి దేవతలందరు శాపగ్రస్థులై, స్థానభ్రష్టులై, అనేక సమయాలలో, అనేక విధాలుగా దుఃఖిస్తుంటారు. విషయీ పురుషుడు స్వయంగా ధర్మం ఆచరించడు సరిగదా ఎదుటివ్యక్తి ఆచరిస్తుంటే చూచి ఎంతమాత్రం సహించలేడు. అట్టివాడు భ్రష్టుడు కాకుండ ఎట్లుండగలడు? విషయీ పురుషుడు అశాంతి గ్రస్తుడై, స్థానభ్రష్టుడై, సమస్త సద్గుణాలకు దూరమై శాశ్వతంగా దుఃఖించి తీరవలసిందే. ఇందుకు దేవతల ప్రభువు దేవేంద్రుడే ఆదర్శం. ఒకటేమాట! భోగైశ్వర్యాలచే అపహరింపబడిన చేతనలో

వ్యవసాయాత్మికా, లేదా నిశ్చయాత్మికాబుద్ధి ప్రకాశింపదు. సత్త్వ రజస్తమోగుణాలు మూడింటిని చిత్తవృత్తి అధిగమించాలి. అప్పుడే బుద్ధి సుఖదుఃఖాలకు, రాగద్వేషాలకు, కామక్రోధాలకు, పాపపుణ్యాలకు అతీతం కాగలుగుతుంది. అప్పుడే మానవుడు ఆత్మాభిముఖుడై సుఖించగలుగుతాడు.

ఒకరాజుగారు ఒకానొక సాయంకాలం ససైన్యంగా మృగయా వినోదార్థం నిష్క్రమించారు. అభూత పూర్వఘటన! ఒకరాయి రాజుగారి నుదుట తగిలింది, రక్తం స్రవిస్తోంది. క్రోధావిష్టుడైన రాజుగారు భటులను హెచ్చరించారు; "వెళ్ళండి, మమ్మల్ని ఇలా బాధించిన ఆనీచుని బంధించి రేపు దర్బారులో ఉపస్థితుని చేయండి."

మరునాడు రాజుగారు దర్బారు తీర్చారు. సభ చాలా కోలాహలంగావుంది. నేరస్థుడు చేతులు జోడించి, సవినయంగా విన్నవిస్తున్నాడు; "అపరాధం జరిగిపోయింది. ధర్మప్రభువులు దయ చూపాలి: దయలేకుంటే ఎట్టి శిక్షఅయినాసరే విధించండి, అనుభవించటానికి సిద్ధంగా వున్నాను. ముందు నామాటొకటి వినండి.

నేను పండునిమిత్తం రాతితో చెట్టును కొట్టాను. అది లక్ష్యం తప్పి మీకు తగిలింది. అవశ్యం దండనీయుడను, అయితే హింసింపబడి బుద్ధిలేని ఆచెట్టు మధురఫలాలనిచ్చి సేవచేస్తోంది. బుద్ధిమంతులైన మీరు ప్రమాదవశాన జరిగిన అపరాధానికి నన్ను శిక్షిస్తామంటున్నారు. ఆచెట్టుకు, మీకుగల ఈ వ్యత్యాసానికి నా నయనాలు సజలాలవుతున్నాయి."

సభికులందరు కంట తడిపెట్టారు. మహారాజు చలించి పోయాడు. నేరస్థుని ప్రేమపూర్వకంగా ఆలింగనం చేసికొని జీవితాంతం తన ఆస్థానంలో స్థానం కల్పించాడు.

బుద్ధిమంతుడు సుకృత దుష్కృతాలకు, సుఖదుఃఖాలకు అతీతంగా వుంటాడు.

అసలు సుఖమంటే ఏమిటి? దుఃఖమంటే ఏమిటి?

"నహికశ్చిత్ క్షణమపి జాతుతిష్టత్యకర్మ కృత్"

(భగవద్గీత అ 3-శ్లో 5.)

మానవుడు కర్మచేయక ఉండలేడు. ప్రకృతి అందుకు వివశుని చేస్తుంది. సూక్ష్మప్రకృతి మనసు. వాస్తవంలో ఈ ప్రపంచం మనసుకు ప్రతిబింబం. మనసంటే సత్త్వరజస్తమోగుణాల స్వరూపం. మానవుని ఉత్థానానికిగాని, పతనానికిగాని మనసే కారణం. మనసు కారణంగానే మానవుడు శరీరాన్ని, పరివారాన్ని అభిమానిస్తున్నాడు, ఆసక్తుడవుతున్నాడు. శరీరంపై ఆసక్తుడవుతున్నాడు, శరీరంలో ఉండే వానిని విస్మరిస్తున్నాడు. ప్రపంచంపై ఆసక్తుడవుతున్నాడు, ప్రపంచాన్ని ప్రవర్తింపచేసే వానిని విస్మరిస్తున్నాడు. అంతా తానే చేస్తున్నానని అహంకరిస్తున్నాడు. దీన్నే 'మాయ' అంటారు. భగవంతుని విస్మరింపచేసేది, పురుషుని అహంకరింప చేసేది ఏదో అదే మాయ. ఒకటేమాట! భగవంతుని ఎప్పుడు విస్మరిస్తాడో అప్పుడే మానవుడు దుఃఖిస్తాడు. భగవత్స్మరణలో వుంటే, శరీ

రంతో వుండకుండా జీవుడు ఆత్మసాన్నిధ్యంలోవుంటే ఎట్టి కష్ట సమయాలలోనయినా సరే మానవుడు సుఖించితీరుతాడు.

అసలు ఈ భౌతికప్రపంచంలోనిది, శరీరానికి సంబంధించింది సుఖం కానేకాదు, నిస్సంశయంగా అదిదుఃఖం. శరీరమంటే మలం–దుఃఖాలయం. దానివలన సుఖింపగలగటం అసంభవం. భగవంతుడు చర్మాన్ని విషక్రిములు—విషజంతువుల బారినుండి ఆత్మరక్షణం చేసికొనటానికి అనుగ్రహించాడు. చర్మం ఉంటేనే మానవుడు వాని వలన ఎన్నో రకాలుగా దుఃఖిస్తున్నాడు. చర్మమేలేకుంటే జీవించి వుండగానే మానవుడు పశుపక్ష్యాదుల కాహారమయేవాడు. ధన్యుడు! భగవంతుడెంత దయామయుడు!!

ఈ శరీరం సాధనం మాత్రమే. సుఖానుభవం శరీరాతీత స్థితి యందు మాత్రమే సిద్ధిస్తుంది. సుఖించాలంటే ఏకార్యానైనాసరే జీవుడు శరీరాతీతుడై, సుఖదుఃఖాలకు సాక్షిమాత్రుడై చేయాలి. దుఃఖాన్ని ధైర్యంగా ఎలా జయించాలి? అని ఆలోచించాలిగాని అధీరుడు కాకూడదు. దాన్నే 'మానవత్వ' మంటారు.

భగవంతుడు జగత్కళ్యాణార్థం, లోకసేవనిమిత్తం ఇంత ఘనమైన శరీరాన్నిచ్చి మానవుని సర్వోత్తమునిగా రూపొందించాడు. అట్టి శరీరాన్ని దుర్వినియోగంచేసి, దుర్బలంచేసి, దుఃఖిస్తున్నానని మానవుడు ఆక్రందిస్తున్నాడు. ఆరోగ్యంలేదని, ధనంలేదని, పరి

వారం అనుకూలంగాలేదని ఆక్రందిస్తున్నాడు. ఇట్టి వాతావరణం ఎందుకేర్పడింది? కర్మలోపమేగదా కారణం. భగవంతున్ని నిందించితే ఎంత మహాపాపం ఇంకా ప్రాప్తిస్తుంది? ఇట్టి వాతావరణం ఉంది గనుకనే ఇంకా అధికంగా భగవద్భాగవత సేవచేయాలి.

వృక్షాల్ని 'పాదపా' లంటారు. వానికి పాదాలే చేతుల పనులుచేస్తాయి, నోరుచేసేపని చేస్తాయి. వేరుగా వానికి నోరులేదు, చేతులులేవు. పాదాలతోనే అవి నీళ్ళు త్రాగుతాయి. తరువాత పశువులు. వీనికినోరుంది. చేతులులేవు. పదార్థాన్ని ఏకంగా భూమినుంచి నోటితోనే గ్రహిస్తాయి. మరి సృష్టిలో మానవునకు మాత్రమే ఎందుకు నోరు, చేతులు, కాళ్ళు ఉన్నాయి? ఇదే మానవజన్మకుగల మహా వైభవం.

ఇట్టి మహావైభవోపేతమయిన మానవ శరీరాన్ని ఎవరూ కూడా పురుషయత్నంతో పొందలేరు.

శ్లో॥ మనుష్యత్వం ముముక్షుత్వం మహాపురుషసంశ్రయః,
దుర్లభం త్రయమేవైతత్ దైవానుగ్రహహేతుకమ్॥

(శ్రీ ఆదిశంకరులు.)

లోకంలో మూడు అత్యంత దుర్లభ వస్తువులున్నాయి. అవి (1) మనుష్యత్వం. (2) ఆ మనుష్యత్వంలో మోక్షకాంక్ష. (3) ఆ మోక్షకాంక్షకు తోడుగా మహాపురుష సాంగత్యం. ఇవి దైవానుగ్రహం వలన లభించవలసిందేగానీ పురుష ప్రయత్నంవలన ఎంత

మాత్రం లభించవు. ఇంతగొప్ప మానవశరీరాన్నిచ్చిన ఆ భగవంతుడు ఎంత దయామయుడు!

భూమిని సాగుచేసి ఆహారోత్పత్తి చేయాలంటే కర్షకుడు శీతోష్ణ జన్య సుఖదుఃఖాల్ని సహించి తీరవలసిందే, శరీరాతీతుడు కావలసిందే. కర్మచారులు ప్రభుత్వ కార్యాలయాల్లో యంత్రాంగాన్ని సువ్యవస్థితం చేయాలంటే, భౌతిక శరీరానికి అతీతులై మానస లోకంలో విహరిస్తున్నారు. గృహిణులు పాకశాలలో వంటచేస్తుంటారు. ఆ సమయంలో శరీరంపై చీమలు ప్రాకుచుండవచ్చును. అప్పుడు శరీర భావమేగనుక వుంటే వారు రుచికరంగా వంట ఎలా సిద్ధం చేయగలుగుతారు? దేహదృష్టివుంటే భౌతిక కార్యాలే సఫలం కావటంలేదే ఇంక ఆత్మానుసంధానం ఎలా సాధ్యమవుతుంది?

జీవుడు శరీరాతీతుడై, శరీరాసక్తి రహితుడై, ఫలాపేక్షా రహితుడై కర్మయందు ప్రవృత్తుడు కావాలి. ఆ తరువాతనే అర్థమవుతుంది, శరీరాన్ని నిరోగం కావించుకొని విషయాల్ని అనుభవించటం సుఖమో, ఇంద్రియాల్ని నిగ్రహించి, ఆత్మాభిముఖుడవటం సుఖమో?

శారీరకంగా భగవంతుడు భక్తుల్ని దుఃఖింపచేస్తాడు, పాపాత్ముల్ని సుఖింపచేస్తాడు.

భక్తులు భగవానునకు స్వజనులు. ఇంటికష్టాల్ని సభ్యులందరు కలిసి అనుభవించకపోతే పరాయివారు అనుభవిస్తారా?

పాపాత్ములు భగవానునకు పరాయివారు. పాపాత్ముల సుఖానుభవం మూన్నాళ్ళముచ్చట. మున్ముందు ఘోరయాతన ఎలాగోతప్పదు. కనీసం ఈమూడు రోజులయినా పాపాత్ములు సుఖించకుంటే ఎలా? భగవానుడు ఎంత దయామయుడు!

పాపం పండాలి, అంతవరకు పాపాత్ములు సుఖించితీరుతారు. పండినపాపం తానే స్వయంగా పాపాత్ములను భక్షిస్తుంది. అంతేగానీ భగవంతుడు వారిని సంహరించడు. కాలం—కర్మం కలిసివస్తే పాపాత్ములు సహజంగానే నశిస్తారు. విష్ణు చేతిలోని చక్రం కాల చక్రం. అది ఈ విషయాన్ని సూచిస్తోంది.

శ్లో॥ కార్పణ్య దోషోపహత స్వభావః
పృచ్ఛామిత్వాం ధర్మసంమూఢచేతాః,
యచ్ఛ్రేయస్యాన్నిశ్చితం బ్రూహితన్మే
శిష్యస్తేహం శాధిమాంత్వాం ప్రపన్నమ్॥

(భగవద్గీత అ 2-శ్లో 7.)

కార్పణ్యదోషం అర్జునుని నిర్వీర్యుని చేసింది, యుక్తాయుక్త విచక్షణాజ్ఞాన రహితుని చేసింది.

ఇంతమంది స్వజనుల్ని వధించి మనం ప్రజాపాలన ఏం చేస్తాం? ఇది అర్జునుని విషాదం.

అటు రెండవ పక్షంలో దుర్యోధనుడు ఉప్పొంగుతున్నాడు నేనెంత గొప్పవాణ్ణి. నానిమిత్తం ప్రాణత్యాగం చేయటానికై ఎందరు సిద్ధంగావున్నారు!

28

అందరి ప్రాణాల్ని బలిగొని అధికారం సంపాదించటంలో దుర్యోధనుడు ఆనందమనుభవిస్తున్నాడు. దీన్నే 'బుద్ధివిలాస' మంటారు.



# (4) ధర్మం—పరోపకారం

బుద్ధి ఎట్టిదో సుఖ దుఃఖాలట్టివి. ఎవరుచేసిన కర్మ వారను భవించ వలసిందే.

ఇతరులకు ఏమిచేస్తే అదే మానవులకు తిరిగివస్తుంది. రాజు గారు దేవతామంత్రంతో మంత్రించి అస్త్రప్రయోగం చేస్తారు. అది శత్రుసంహారంచేసి స్వయంగా అంబులపొదికి చేరుతుంది. మానవుడు ఇతరులను సుఖింపచేస్తే సుఖిస్తాడు, దుఃఖింపచేస్తే దుఃఖిస్తాడు. ఇది త్రికాలసత్యం.

భారత యుద్ధానంతరం కాసారంకడ కురు రాజ సార్వ భౌముడు అశ్రువర్షం కురిపిస్తున్నాడు, సమస్త భూమాతను, మనో వాక్కాయలను క్షాళనం చేస్తున్నాడు.

భీమసేనుడు ఊరువులను భిన్నంచేశాడు, కుక్కలు-గ్రద్దలు బ్రతికియుండగానే దుర్యోధనుని రక్తం త్రాగుతున్నాయి, మాంసం ఆరగిస్తున్నాయి.

దుర్యోధనుని కన్నీటికి అంతంలేదు. ఆసమయంలో ఈ విధంగా దుర్యోధనుడు ఘోరమయిన తపస్సుచేశారు. మహాభారత

సారమంతా ఇక్కడకు కేంద్రీకరింప బడింది. "భగవంతుడు నాకు విధించిన శిక్ష చాలస్వల్పం. ఏంచేశాను! ఏంచేశాను!! లక్కఇల్లు తగులబెట్టించాను, భీమసేనునిచే విషాన్నం తినిపించాను, సోదరుల్ని భిక్షుకులుగాచూచి ఆనందమమభవించాను, ద్రౌపదీ మానభంగం చేయించటానికి ప్రయత్నించాను, మాయాజూదంలో సర్వస్వం హరించి, సోదరుల్ని వనాలకు పంపించాను, సింహాసనంపై కూర్చొనే అధికారంగల సోదరులకు అయిదూళ్ళు ఇవ్వటానికి నిరాకరించాను. అబ్బా! ఎంత దుర్మార్గుడను! ఇంత ఘన ఘోర సంగ్రామానికి కారకుడనై ఇంతమంది ప్రాణం తీయించాను. భగవంతుడు దయాళుడు గనుక చాలా స్వల్పంగా మాత్రమే నన్ను దండించాడు.

దుర్యోధనుని పాత్ర అత్యున్నతం, ఆతడు కేవలం దుర్మార్గానికి మాత్రమే అంకితమయినవాడు కాడు.

ఇంటింటా దుర్యోధనులున్నారు, ధర్మరాజులున్నారు. భారత కథ ప్రతి ఒక్కరికథ. మరువరాదు, ఇతరులకు ఏమిచేస్తే అదే తిరిగి వస్తుంది.

అర్జునుడు మోహగ్రస్తుడు. ఒకటేమాట! మోహాక్రాంతునకు ధర్మం బోధపడదు. వాడు ధర్మాన్ని అధర్మమంటాడు, అధర్మాన్ని ధర్మమంటాడు. ఇదే మోహస్వరూపం. క్షుద్ర మానవబుద్ధికి బోధపడేటట్లయితే ధర్మంకూడా క్షుద్రమవుతుంది, దివ్యం ఎలాఅవుతుంది?

శాస్త్రం— శాస్త్రజ్ఞులు చెప్పినట్లు చేయాలి. అంతే! అదే ధర్మం. ఈనాడు ఏకాదశి అంటే, అంతే, విశ్వసించితీరాలి.

వేదశాస్త్రాలలో చెప్పింది ధర్మం, శాస్త్రజ్ఞులు చెప్పిందే ధర్మం, వంశపరంపరా గతంగా వస్తున్న సదాచారం ధర్మం, ఆత్మ సమ్మతమయినది ధర్మం.

ధర్మం పై మూడింటవుంటే ఆత్మసమ్మతమయి తీరుతుంది. ఒకప్పుడు శాస్త్రం చెప్పలేని విషయం దైవజ్ఞులు చెప్తారు. అందు వలననే వారిని దైవజ్ఞులన్నారు. శాస్త్రం—దైవజ్ఞులు పరాజితు లయిన సందర్భంలో వంశపరంపరాగతమైన సదాచారాన్ని అనుష్ఠిం చాలి. ఈ మూడింటికి సంకటమేర్పడిన సమయంలో మాత్రమే ఆత్మ సంతోషం ప్రకారం ప్రవర్తించాలి. ఇది మనుస్మృతి వచనం.

చేయలేని ధర్మాన్నిచెప్పి, అసమర్థునిచేసి మానవుని నరకా నికి పంపించటానికి ధర్మశాస్త్రం అవతరించలేదు. ఆపత్సమయాలలో అనుష్ఠించటానికి ప్రత్యేక ధర్మాలున్నాయి, సౌకర్యాలున్నాయి.

స్నానం ఎలా చేయాలి? భోజనం ఎలాచేయాలి? ఎలా ఏదిశగా శయనించాలి? ఎలా మాట్లాడాలి? ఎప్పుడు నిద్రలేవాలి? ఇల్లు ఎలాకట్టాలి? ఔషధం ఎలా స్వీకరించాలి? ఇలా ప్రతిచిన్న విషయం శాస్త్రం చెప్తోంది, ఆపద్ధర్మాల్నికూడ చెప్తోంది. ఒకటే మాట! సుఖించాలంటే మానవుడు శాస్త్రం చెప్పినట్లు చేసితీరాలి.

శాస్త్రం క్షత్రియునకు యుద్ధం ధర్మమంటోంది. మోహాక్రాంతుడయిన అర్జునుడు దాన్ని అధర్మమంటున్నాడు. ఫలితంగా తనబుద్ధి దగ్గఱకువెళ్ళి, శరణాగతుడవుతున్నాడు. అప్పుడా బుద్ధియే ఉపదేశకుని రూపంలో, స్నేహితుని రూపంలో, సారధిరూపంలో ప్రకటమవుతోంది.

మానవుడా! ముందు బుద్ధికి శరణాగతుడవుకా! అప్పుడే ఆబుద్ధి నిన్నుద్ధరిస్తుంది. బుద్ధిఇచ్చే శిక్ష–ఆనందం ఈ ప్రపంచంలో మరెవరు ఈయలేరు.

ముందు ప్రపంచంలోకి వెళ్ళావా, జాగ్రత్త! మోసగింపబడి తీరుతావు.

ప్రతినిమిషం ప్రపంచంనుండి మనసుకు శక్తి అందుతుంటుంది. ఇలాగే బుద్ధినుండి ప్రతినిమిషం ప్రపంచానికి శక్తి అందుతుంటుంది. ప్రపంచాన్ని నిరోధించావా బుద్ధి బాగుపడుతుంది. బుద్ధి ప్రపంచమయమయిందా, తాను స్వయంగా నశిస్తుంది, నిన్ను, నీ చుట్టూవున్న సమస్త లోకాల్నికూడా నాశనం చేసేస్తుంది.

రాక్షసులు భూలోకంలో ఘోరమైన తపం చేశారు. దేవతలు దేవలోకాలు కంపించాయి.

ధర్మాత్ములు తమ ఆచరణతో దేవతల్ని మెప్పించారు. ఏకంగా వారు భూలోకంలోనే కాపురంపెట్టారు.

దేవతలు రావణాది రాక్షసులకుకూడ దాస్యం చేశారు. సత్త్వ గుణం—ఘోరతమోగుణం రెండు దేవతల్ని స్వాధీనం చేస్తాయి. అయితే సత్త్వగుణంలో ఆనంద ముంటుంది, తమోగుణంలో పతన భయముంటుంది.

అంతర్యామిని ఎంత చిన్నవానిగా చేసికొంటే మానవుడంతగా ఆనందిస్తాడు. సర్వాంతర్యామికి మానవుడెంతగా శరణాగతుడవుతాడో అంతగా ఆయన హీనాతి హీనమైన కార్యంకూడ చేస్తాడు.

మానవునిలోని సేవాభావమే, శరణభావమే ఆ ఆకారం లేని బుద్ధికి ఆకారం కల్పిస్తోంది, అజన్మునకు జన్మ ననుగ్రహిస్తోంది.

వాస్తవంలో భగవానుడు నిర్గుణ నిరాకారుడు. ఇలాగే జీవుడు కూడ నిర్గుణ నిరాకారుడు. ఇది తథ్యం. జీవుడు సగుణ—సాకారు డయినాడు. అయితే ఈశ్వరుడుకూడ సగుణ సాకారుడయితీరుతాడు.

జీవునకువలె ఈశ్వరునకు సుఖదుఃఖాలు, కామక్రోధాలు ఉండవు. కాననే ఆయన ఈశ్వరుడు.

ఈశ్వరునిలో గుణదోషాలు లేవు. అయినా ఈశ్వరమాయ యందు గుణదోషాలు భాసిస్తున్నాయి. జీవునిలో అవిద్యవలన గుణ దోషాలు భాసిస్తున్నాయి. ఈ అవిద్యను, ఆ మాయను తొలగించితే జీవేశ్వరులు సమాన ధర్మయుక్తులే.

"ద్వా సుపర్ణా సయుజా సఖాయానమానం వృక్షం పరిషస్వజాతే."

(శ్రుతి.)

జీవేశ్వరులు సమాన ధర్మాలుగల చెలికాండ్రు. శ్రుతి వారికి పక్షిరూపమిచ్చింది. శరీర వృక్షంపై ఆరెండు పక్షులు విహరిస్తుంటాయి.

భగవంతుడంటే సద్బుద్ధి. బుద్ధిమంతుడే భగవంతుడు.

"శిష్యస్తేహం శాధిమాంత్వాం ప్రపన్నమ్."

అర్జునుడు అంతర్యామికి శిష్యుడయినాడు. అంటే తనను శాసించమంటున్నాడు. అర్జునుడు ప్రపన్నుడయినాడు. అంటే మర్కట కిశోర న్యాయాన్ని అనుసరించాడు. ప్రపత్తి అంటే మర్కట కిశోరన్యాయం. జీవుడు స్వశక్తితో భగవంతుని పట్టుకోవాలి. మార్జాల కిశోరన్యాయం శరణాగతిలో వుంటుంది. అటిస్థితిలో భగభంతుడే జీవుని సర్వవిధాల రక్షిస్తాడు.



# (5) ధర్మం—సేవ

ఎంత వేదాంతం చెప్పినా, విన్నా దానివలన స్వల్ప ప్రయోజనం మాత్రమే ఉంటుంది. మనసు మార్పు చెందనిదే, ఆచరణలో మార్పురానిదే ఏ వేదాంతమయినా మానవుని ఏం ఉద్ధరించగలదు? ఆచరణలో మార్పుతీసికొని రావాలంటే అందుకు అనుభవజ్ఞుడయిన ఆచార్యుడొక్కడే సమర్థుడు. ఉపదేశాలు అవసరం లేకుండా మౌన వ్యాఖ్యతో శిష్యుని సంశయాల్ని సమూలంగా నశింపచేసి సాన్నిధ్య మాత్రం వలననే సమర్థుడయిన ఆచార్యుడు శిష్యుని తనకన్న గొప్ప వానిగా రూపొందించగలడు.

శ్లో॥ తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా,
ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః॥
(భగవద్గీత అ 4—శ్లో 34.)

వేదాంతం గురుముఖతః వినాలి, సేవచే గురు మహారాజును మెప్పించి వినాలి. అప్పుడే ఆ వేదాంతం ఫలదాయక మవుతుంది.

పూర్వం నాలుగు వర్ణాలవారు కొంత వయసురాగానే ఇంటిని వదలి, ఆశ్రమాలలో గురుసేవలో పవిత్రజీవనం గడిపేవారు. జీవి

తంలో వారికి కనీస సౌకర్యాలుకూడ కల్పింపబడేవికావు. శీతోష్ణాల్ని సహిస్తూ, ఈ శరీరాన్ని ధర్మ సంరక్షణకు సాధనమాత్రంగా విని యోగించుకొనేవారు గానీ ఎంత మాత్రం భోగసాధనంగా భావించే వారు కారు. కామక్రోధాల్ని, రాగ ద్వేషాల్ని మహా పురుష యత్నంతో నియమించేవారు. సత్యం—అహింస—బ్రహ్మచర్యం—భూతదయ ఇత్యాది విషయాలలో ప్రాణత్యాగం చేయటమంటే వారికి ఎంత ఆనందమో చెప్పటానికి మాటలుచాలవు. ఎంత ధనికుడైన, ఎంత రాజాధిరాజు కుమారుడయినా భిక్షాన్నంతో జీవింపవలసిందే గానీ మృష్టాన్న భోజనాన్ని బ్రహ్మయత్నం చేసినా పొందలేడు. గురువచనాన్ని అప్రమత్తతతో, నిష్కాపట్యంతో ఎల్లవేళలా చిత్త శుద్ధితో పాలింపవలసిందేగానీ మారుపలుకుటకు వీలుకాదు. ఆశ్రమ జీవనం ముగించుకొని వివాహం నిమిత్తం ఇంటికి వెళ్ళబోయే బ్రహ్మచారికి ఆచార్యుడిలా ఉపదేశం చేస్తాడు:—

"మాతృ దేవోభవ! పితృదేవోభవ!! ఆచార్య దేవోభవ!!! అతిధి దేవోభవ!!!!"

"తల్లియే దైవముగా గలవాడవగుము. తండ్రియే దైవముగా గలవాడవగుము. ఆచార్యుడే దైవముగా గలవాడవగుము. అతిధియే దైవముగా గలవాడవగుము."

నేను చెప్పినట్లు చరించుటయే నీవు నాకీయవలసిన గురుదక్షిణ.

ఈ హితోపదేశాన్ని ఆచరించటంలో ప్రాణాల్ని త్యజించ టానికయినా ఎవడు వెనుకాడడో వాడే సజ్జనుడు, వాడే సచ్ఛిష్యుడు, వాని జీవనమే ధన్యం.

అలా కఠోర నియమాలకు జీవితాన్ని అంకితం చేసినవారు కూడ గృహస్థాశ్రమంలో ప్రవేశించి అప్పుడప్పుడు ధర్మ పథాన్నుండి చలిస్తుండేవారు. ఇట్టి స్థితిలో చర్మాన్ని దైవంగా భావించి, జీవితాన్ని విలాసాలకు అంకితం చేస్తున్న ఆధునికులు బాగుపడాలంటే ఎలా బాగుపడగలరు? ఎలా దుఃఖాన్నుండి ముక్తులు కాగలరు? ఎంత తపంచేయాలి! ఎంతత్యాగం చేయాలి!! ఎంతయినా అప్రమత్తతతో చేయాలి.

ముందు శిరసువంచి పెద్దలకు నమస్కరించటం నేర్చుకోవాలి. ఫల పుష్ప భారంతో కూడిన వృక్షం ఎప్పుడూ శిరసు వంచుకొనే వుంటుంది. ఎవనిలో సద్గుణాలుంటాయో వాడు ఎప్పుడూ నమ్రుడుగానే వుంటాడు. అట్టివాని జీవితం మాత్రమే మూడు పూవులు—ఆరుకాయలుగా పుష్పిస్తుంది, ఫలిస్తుంది. మొగ్గ వికసిస్తుంది. అట్లే గుణగణాలతో నిండిన హృదయం వికసించి, విరజాజుల పరిమళాన్ని విశ్వమంతా విరజిమ్ముతుంది. ఆతరువాత ఫలిస్తుంది. అందువలన ప్రయోజనం లోకానికేగానీ ఆఫలానికి ఏమీలేదు. పక్వంకాగానే ఫలం తానంతటతానుగా చెట్టునుండి పతనమవుతుంది. అలాగే చిత్తవృత్తి పక్వం కాగానే శరీర వృక్షంనుండి వేరవుతుంది. రాగద్వేషాలకు, సుఖదుఃఖాలకు అతీతమవుతుంది. ఆ అతీత స్థితిలో స్రవించే భక్తిరసాన్ని తానాస్వాదింపక సమస్త ప్రపంచంచే తృప్తితీర త్రాగిస్తుంది. మానవుడు పూవువలె వికసించాలి. ఆ తరువాత పండువలె పండాలి. జీవితం సేవాధర్మంలో పండాలి. అప్పుడే జీవుడు

సేవలో సేవా రూపమై, సేవతో రససాగరమవుతాడు. ఫలం ఎప్పుడూ సబీజంగా అంతరించదు. బీజం శేషించి తీరుతుంది. దాని నుండి మరల ఎన్నో ఫలాలు రూపుదాలుస్తాయి. పరంపర అక్షుణ్ణంగా వుంటుంది. ఇలాగే సేవకునకు ఎన్నటికి అంతముండదు. ఆతడు అమరుడవుతాడు. నిరంతరం ఈ సేవాధర్మంలోని మర్మాన్ని ఘోషిస్తుంటాడు, కాలచక్రాన్ని అపూర్వ రసానుభూతిలో పరిభ్రమింప చేస్తుంటాడు.

'మమ' అంటే ఇది నాది, 'నమమ' అంటే నాదికాదు. నమస్కరించట మంటే ఈ శరీరం నాదికాదని తెలియచెప్పటమే. నాది కాదన్నంత మాత్రాన శరీరం ఎలా నీదికాకుండా పోతుంది? దేహభావాన్ని చంపుకొని జీవుడు ఆత్మాభిముఖుడు కావటానికి, భావ మాధుర్యానికి నమస్కారం అసమాన మయినది. భావ పవిత్రత— వైరాగ్యం లేకుంటే ఎవడూ ఏ సత్కార్యంకూడ చేయలేడు. "ఈ శరీరం అశాశ్వతం, దుఃఖాలయం. ఇది ఎందుకు పనికిరాని హీనాతి హీనమయిన చర్మం. ధర్మ కార్యాలవలన మాత్రమే ఇది గొప్పదవుతుంది. చర్మాన్ని మోహించి, చర్మంలోపల ఉన్నవానిని అవమానించ కూడదు."

ఈభావకిరణాలే సుందర సుప్రభాతానికి సుస్వాగతం చెప్తాయి.

అర్జునుడు శ్రీకృష్ణుని చెలికాడు. అందువలన మోహగ్రస్తుడయినా ఆమోహం తాత్కాలికం మాత్రమే అయింది. సజ్జనులు కలకాలం మోహగ్రస్థులుగా వుండరు.

అర్జునుడు ఋజుమార్గగామి. సమాన వాయుస్వరూపుడు, సమానవాయువు శరీరమంతటా వ్యాపించి వుంటుంది. ఆ వాయువును నడిపించేశక్తి కుండలిని. అదే గాండీవం. ధర్మరాజు వ్యానవాయువు. భీమసేనుడు ఉదానవాయువు. నకుల సహదేవులు ప్రాణాపాన వాయువులు. ఎల్లప్పుడూ దేవునితో చరించే వాడెవడో వాడే సహ దేవుడు.

ద్రౌపది అంటే సుషుమ్నానాడి. ద్రౌపది అయోనిజ. ద్రుపదుడు యజ్ఞంచేయగా దృష్టద్యుమ్నునితోకూడి అగ్నినుండి ఆవిర్భవించింది. మహా పతివ్రత. సుషుమ్నానాడికూడా అగ్ని స్వరూపమే. మానవుని సమస్త జ్ఞానానికి—శరీరధారణకు సుషుమ్నా నాడి అత్యంతావశ్యకం. పంచప్రాణాలు శరీరంలో అమృత స్వరూపాలు కావాలంటే ద్రౌపది అనే సుషుమ్నానాడి అత్యంతావశ్యకం. సమస్త మహాభారతానికి ఏకైకాధారం ద్రౌపది.

దుర్యోధనుడు మనసుకు ప్రతీకం. ఆ మనసు ద్రౌపదియనే సుషుమ్నానాడిని, జ్ఞానాన్ని అవమానిస్తుంది. ఫలితంగా క్షత్ర విక్షతమయి తపిస్తుంది. అంతలో పంతంతో అనంతుని సాన్నిధ్యానికే పయనిస్తుంది.

అర్జునుని మోహంకన్న దుర్యోధనుని మోహం చాల బలీయమయింది. దుర్జనుల మోహం నశించటం అత్యంత కష్టసాధ్యం. ధనానికి—ధరణికి—దారకు దుర్యోధనుడు తన సమస్త జీవితాన్ని

నాశనం చేశాడు. స్వయంగా శ్రీకృష్ణపరమాత్మ రాయబారిగావచ్చి చెప్పినా మార్పుచెందలేదు. ఆబుద్ధి అతనిని సర్వనాశనం చేసింది. సర్వనాశనమయిన తరువాతనే దుర్యోధనుడు పశ్చాత్తప్తుడయినాడు. ఆ మనసు ఇహంనుండి పరానికి ప్రయాణించ గలిగింది. ఒకటేమాట! ఇహసుఖాలందు ఆసక్తంగావుండే మనసు పరాన్నిగురించి ఆలోచించ డానికికూడ ఎంతమాత్రం పనికిరాదు.

(గీత అ 2-శ్లో 29.)

మరొకమాట! సద్బుద్ధివలన మానవుడు సుఖిస్తాడు, దుర్బుద్ధి వలన దుఃఖిస్తాడు.

అతి ప్రబలమయిన వ్యామోహంతో బంధుద్రోహం, భగవద్ద్రోహం, ఆత్మద్రోహంచేసే ఈ కలికాల దుర్యోధనులకు చివఱకు నా అన్నవారెవరు శేషించరు, మంచినీరిచ్చేవారుండరు, పిండోదకాలిచ్చే వారుండరు, కనీసం కనీళ్ళుతుడిచే వారుకూడఉండరు.

ఒకటేమాట! చర్మాన్ని ప్రేమించేవారు ఆ చర్మంవలన ఈ విధంగా ఏడ్చి, ఏడ్చి అత్యంత దయనీయ స్థితిలో చస్తారు. చర్మం వారిని ఏడిపించకుండా ఎప్పటికి విడువదు.



# (6) ధర్మం—బుద్ధి

అది ద్వారకానగరం. వాసుదేవుడు సత్యాసహితుడై ఊయల లూగుతూ ఆమెతో సరస సల్లాపాలు చేస్తున్నాడు. మాటలమధ్యలో సత్యభామ తన స్వామిని ప్రశ్నించింది:

"స్వామీ! అయిదుగురు భర్తలతో అరణ్యంలో ద్రౌపది బాధపడుతోందని నేనను కొనటంలేదు. అంతటి భర్తల సహకారం వుండగా ఆమెకు దుఃఖించవలసిన కర్మఏమిటి? నాకర్మ కాలింది కనుక షోడశస్త్రీలోలురు మీరు నాధులయారు స్వామితో మనసారా మాటలాడే అవకాశంకూడలేక మనో వేదన అనుభవిస్తున్నాను. స్వామీ! నా దురదృష్టం అందరికి ఎందుకుంటుంది?"

అంతర్యామి పరమాత్మ ప్రేయసి ఇచ్చిన తాంబూలాన్ని అందుకొన్నాడు. తనువుతట్టి, ముఖంమీద ముద్దులు కురిపిస్తూ అంటున్నాడు;

"సత్యా! ఈప్రశ్నకు సమాధానం నేను చెప్పలేను. సమయం వచ్చినప్పుడు నీవే గ్రహిస్తావు. ఆఁ! పాండవుల్నిచూచి చాలా కాల

మయింది. ఎట్లున్నారో ఏమో? రేపే బయలుదేరి వారిని చూచివద్దాం సిద్ధంగావుండు."

అందమయిన అరణ్యం. సమయం సాయంత్రం ఆరున్నర గంటలు. చందనం బొమ్మ మన శ్యామసుందరుడు చంచల నయనాలతో కనుచూపుదూరంలో ఇటు అటు పచార్లు చేస్తున్నాడు. అభ్యాగతమండలి తృప్తిగా ద్రౌపదీ హస్తభోజనంచేసి లేచింది. అక్షయపాత్ర వైభవాన్ని, ద్రౌపదీ హస్త ప్రాశస్త్యాన్ని పరిపరి విధాల ముచ్చటించుకొంటోంది. ఎటుచూచినా జయజయ ధ్వానాలే. ఆ మాధుర్యంలో దిశలు పరవశిస్తున్నాయి.

"అన్నదాతా సుఖీభవ! అన్నదాతా సుఖీభవ!!" సర్వత్ర బ్రహ్మానందం సాకారమై నాట్యం చేస్తోంది. ఆ సుందర సంధ్యా సమయంలో ఇరువురు మాత్రం కంటతడి పెడుతున్నారు. ఇరువురు ఒకరినొకరు గాఢంగా పెనవేసుకొన్నారు. సృష్టిలో మధురమయింది అనురాగం ఒక్కటేగదా! ఏ జీవియైనగాని, అనురాగాన్ని పొందిందా అనురాగ రాగంలో అవశ్యం ఈ జగాన్ని అతిక్రమించి తీరుతుంది.

ఇంటికి తిరిగివెళ్తూ—వెళ్తూ సూర్యనారాయణుడు సంభ్రమంతో ఒక్కసారి వెనుదిరిగాడు. ఏవోమాటలు వినిపిస్తున్నాయి. చాల ఆర్ద్రంగా వున్నాయి. పరీక్షగా చూచాడు. 'ఎవరువారు?' సత్యభామ–ద్రౌపది. నిజంగా ఇది అపూర్వ సమ్మేళనమే. ఏమిటి సమాచారం?

"సాక్షాత్తు ధర్మావతారుడయిన యుధిష్ఠిరుడు, బాహుబలంలో అసమానుడయిన భీమసేనుడు, దేవేంద్రుని అర్ధసింహాసనం అధిష్ఠించిన అర్జునుడు ఎవతెకు జీవితేశ్వరులో, సంరక్షకులో అట్టియామె వంచిననడుము ఎత్తకుండా సాయంత్రం ఆరుగంటల వరకు అన్నం వడ్డిస్తోంది, ఆరున్నర గంటలకు భోజనం చేస్తోంది."

సత్యభామ వామనయనం నీరుకారుస్తోంది; 'ఇదేమి ధర్మం? దక్షిణనయనం నీరుకారుస్తోంది; 'ఇదేమి జీవితం?'

* * *

ధర్మమూర్తి యుధిష్ఠిరుని సమక్షంలో ధర్మఖిన్నా ద్రౌపది. ఈనాడు ఆమె ముఖారవిందం క్రోధ కారణంగా చాలా ఎఱ్ఱగావుంది. ఆవేశంతో ద్రౌపది నేడు తనస్వామిని ధిక్కరించి మాట్లాడుతోంది;

"ఇదేమి ధర్మం? ఇదేమి జీవితం? స్వామీ! ఆ దుష్ట దుర్యోధనునకు భయపడుతూ ఎన్నాళ్ళు ఇలా మనం వనవాసం చేయాలి? నిరంతరం "ధర్మం-ధర్మం" అని నినాదాలుచేసే మీ కెందుకీ కష్టాలు? ఆ దుర్యోధనునకెందుకు అష్టఐశ్వర్యాలు? ఇట్టి ధర్మంకొఱకు ఎందుకు ఇంకా మీరింతగా జీవితాన్ని నాశనం చేసికొంటున్నారు? ఎందుకు మాఅందరి జీవితాల్నికూడ నాశనం చేస్తున్నారు? ద్రుపదమహారాజు పుత్రికనే, మీ అర్ధాంగినే, మీతో అర్ధసింహాసనాన్ని అలంకరించి, ఆనందించవలసినదాననే, ఎంత కాలం ఇలా వనాలలో నిద్రాహారాలులేక కాలక్షేపం చేస్తాను? ఆ

దేవున్ని, ధర్మాన్ని నేలరాచి ఇప్పటికయినా హస్తినాపుర సింహాస నం స్వాధీనమయే మార్గమేమయినా వుంటే చూడండి, స్వామీ! మార్గమేమయినావుంటే చూడండి."

కదలివస్తున్న క్రోధాన్ని నిగ్రహిస్తూ శాంతమూర్తి ధర్మ రాజు ద్రౌపది మాటల్ని మధ్యలోనే త్రుంచేశాడు, కాస్త పరుషంగా పండ్లుబిగించి ఆమెను హెచ్చరిస్తున్నాడు;

"చాలు, ద్రౌపదీ! చాలు. నీబుద్ధి ఇట్టిదని ఇంతవరకు నాకు తెలియనే తెలియదు. దైవాన్ని, ధర్మాన్ని నిందించేనీవు నాకు అర్ధాంగివయినావు కనుకనే మనమిలా వనవాసక్లేశాల ననుభవింప వలసి వస్తోంది.

బుద్ధి భ్రష్టుడొక్కడు మాత్రమే ఈసృష్టిలో ఆ జీవనం దుఃఖి స్తాడు. ధర్మాత్మునకు, భగవద్భక్తునకు, అదృష్టవంతునకు ఎప్ప టికీ దుఃఖమన్నది ఉండనేఉండదు. అదృష్టాన్ని విశ్వసించు అదే దైవం. అదెప్పుడూ మనిషివెనుక అదృశ్యంగా అడుగులు వేస్తూనే వుంటుంది. మానవుడు బుద్ధిభ్రష్టుడుకాక, బుద్ధిమంతుడై అడుగులు ముందుకువేయాలి. అట్టివానిని మాత్రమే 'మానవు'డనాలి. అందరూ అట్టి మానవునిలోనే దైవాన్ని, ధర్మాన్ని చూస్తారు. ఆ దైవం— ధర్మం మానవుని ఎప్పుడూ దుఃఖింపచేయవు. అవి ఇంత చక్కని మానవ శరీరాన్నిచ్చాయి, మనలో మనరూపుచెంది, మనల్ని రక్షి స్తున్నాయి. అయినా మానవుడు తనకీయబడిన శరీరాన్ని సద్విని

యోగం చేసికొనటంలో దుర్బలుడయిన కారణంగా, కామక్రోధాలకు, రాగద్వేషాలకు వశమయిన కారణంగా జీవితాంతం దుఃఖిస్తున్నాడు. ద్రౌపదీ! దుఃఖం బయటనుండివచ్చే వస్తువుగాదు, అది మనసుకు మాత్రం దుఃఖంగా అనుభవానికి వస్తుంది. మనసును జయించిన ధీరునకు సుఖదుఃఖాలనేవి లేనేలేవు.

ద్రౌపదీ! నీబుద్ధి చెడింది. ఏమైనా అంటావు. ఇంక నా ముందు మాట్లాడకు, వెళ్ళు.

అర్జున విషాదయోగం సమాప్తమ్.

# ధర్మ ఘంట

## (7) భగవద్గీతావతరణం

శ్లో॥ అశోచ్యానన్వశోచ స్త్వం ప్రజ్ఞావాదాంశ్చభాషసే,
గతా సూనగతా సూంశ్చనాను శోచ న్తిపండితాః॥

(భగవద్గీత అ. 2–శ్లో. 11.)

శ్రీకృష్ణుడు అర్జునుని నిందిస్తున్నాడు; "చాలా ప్రజ్ఞతో మాట్లాడుతున్నావయా అర్జునా! అసలు ఎందుకు నీవింతగా అధైర్యానికి లోనయినావు? ఎందుకు వీరిని గురించి చింతిస్తావు? పండితులు ఏవిషయానికి ఎప్పుడు చింతించరయా?"

సద సద్వివేకినీ శక్తిగల బుద్ధిని 'పండా' అంటారు. అట్టి బుద్ధిగలవారిని మాత్రమే 'పండితు'లంటారు.

మోహాక్రాంతుడై అర్జునుడు సద సద్వివేకినీ శక్తిని కోల్పోయాడు. అందువలన శ్రీకృష్ణుడాతనిని నిందిస్తున్నాడు.

జరిగిన విషయాల్ని స్మరించి ఎవడు దుఃఖిస్తాడో వాడు గతంలో ఎలాగో చెడినవాడే, ఇప్పుడు వర్తమానంలో కూడా చెడు తున్నాడు. ఇంకా భవిష్యత్తును భయంకరం చేసికొంటున్నాడు.

గతాన్నిగుఱించి దుఃఖించటాన్ని 'శోక'మంటారు. వర్త మానాన్ని గుఱించి దుఃఖించటాన్ని 'మోహ'మని, భవిష్యత్తును గుఱించి దుఃఖించటాన్ని 'భయ'మని అంటారు.

నిందల్ని సహిస్తేనేగానీ మోహం చావదు. నిందలు మానవు నకు నూతనజన్మ ననుగ్రహిస్తాయి. సహిష్ణుతా కారణంగానే సాధు త్వం ఎంతగానో ఉజ్జ్వలమవుతుంది.

అందరూ ఊఱకనే సాధువులు కాగలరా? ఒకటేమాట! జీవి తంలో చచ్చి—చెడినవాడు మాత్రమే సాధువు కాగలుగుతాడు.

నీవు మోహాక్రాంతుడవు అయినప్పుడు నిందన్ని సహించ టంలో దుఃఖమెందులకు? నీమనసు నిర్మలంగా వుండగా వ్యర్థంగా ఇతరులు నిన్ను నిందిస్తున్నారా? అయితే దుఃఖించవలసిన అవసర మేముంది?

నీ దుఃఖం నీ మానసిక దుస్థితిని తెలియచేస్తోంది. నీమనసు చెడ్డది కనుక ఎదుటివారి మాటలు, ఆచరణ చెడురూపంలో నీకు బాధా కరమవుతున్నాయి. మనసును బాగుచేసికో, కళ్ళతోచూడు మనసుతో అధ్యయనంచేయి. ప్రపంచంలో చెడ్డవారు లేనేలేరు.

భూతభవిష్యద్వర్తమానాల్ని గురించి దుఃఖించకుండా, కర్తవ్యాన్ని నిర్వర్తించడానికి కాలు కదపాలి. అట్టివాడే పండితుడు అంతేగానీ వేద వేదాంగవేత్త పండితుడుగాడు.

శ్లో॥ నత్వేవాహం జాతునాసం నత్వంనేమే జనాధిపాః,
నచైవనభవిష్యామః సర్వేవయ మతఃపరమ్॥

(భగవద్గీత అ. 2—శ్లో 12)

"అర్జునా! ఈ రాజులందరు ఇతఃపూర్వమున్నారు, ఇప్పుడున్నారు, ఇకముందుకూడ ఉంటారు. నేనుంటాను, నీవుకూడ ఉంటావు దేహంపోయినా ఆత్మ శాశ్వతంగా వుంటుంది. దాన్ని భూతభవిష్యద్వర్తమాన కాలాలు బాధించవు."

"అర్జునా! ఈరాజులంతా నేను జీవింపచేస్తే జీవిస్తారని, లేకుంటే చస్తారని అనుకోవద్దు. ఆత్మ ఎన్నడు, ఎవరివలన చావదు సుమా!"

"దేహత్యాగం చేస్తున్నాడంటే జీవుడు జీర్ణవస్త్రాన్ని త్యజించి నూతన వస్త్రాన్ని ధరిస్తున్నాడని అర్థం. దీనికి దుఃఖించవలసిన అవసర మేముంది?"

భగవానుని దృష్టిలో దుష్ట వినాశనమంటే దృశ్యాన్ని మార్పు చేయడం మాత్రమే. ఈ ప్రాణులందరు ఇప్పుడు ఈశరీరంనుండి లోకంనుండి నిష్క్రమించవచ్చును. అంతమాత్రంతో వారివ్యక్తిత్వం అంతరించదు సుమా!

ప్రాణుల్ని హింసించటం ధర్మమని ఎవరంటారు? ప్రాణుల్ని హింసిస్తే అవశ్యం మానవుడు హింసింపబడుతాడు. ఒకరి కన్నుల వెంట నీరుకార్పించితే మానవుడు అవశ్యం నీళ్ళుకార్చితీరుతాడు. దీనికి వేదాంతోపన్యాసాలెందుకు? గ్రంథాలెందుకు?

భగవంతుడంటున్నాడు; "అర్జునా! నీవు క్షత్రియుడవు. వీరు పాపాత్ములు. కాన ఈ హింసవలన నీకు ఇహలోకంలో కీర్తి లభిస్తుంది, స్వర్గంకూడా లభిస్తుంది."

"ఈ అందరు నావారు," దీన్నే 'మమత' అంటారు. ఒకచే మాట! ఇదే ఇంత సంతాపానికి హేతువు. "అర్జునా! నీవు యుద్ధం చేయవలసింది వీరితోకాదు, యుద్ధం, అర్జునా! నీవు మోహంతో చేయాలి, అంతశ్శత్రువుతో చేయాలి." "క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వోఽత్తిష్ఠ పరంతప."

శ్లో॥ నిత్యాఃసర్వే యిమరుద్ర యథాహం నిత్యవిగ్రహః,
సఖాయః పితరోగోపాగావో బృందావనం మమ,
సర్వమేతన్నిత్యమేవ చిదానందరసాత్మకమ్,
ఇదమానంద కందాఖ్యం విద్ధిబృందావనం మమ॥

(పద్మపురాణం–పాతాళఖండం.)

"శ్రీకృష్ణుడు శంకరునితో చెప్తున్నాడు; "రుద్రా! నేనెట్లు నిత్య విగ్రహుడనో అట్లే సమస్త పరివారంకూడ నిత్యం. నా

స్నేహితులు గోపాలురు, నా తల్లిదండ్రులు దేవకీ వసుదేవులు—నందయశోదలు, గోవులు, అది, ఇది; వారు, వీరననేల, రుద్రా! నా సమస్త పరివారాన్ని నావలె నిత్యంగా, చిదానంద రసాత్మకంగా గ్రహించు. ఇంక బృందావనమా? ఒక చేమాట! అది ఆనంద ధామం."

శ్రీకృష్ణుడు—సమస్త శ్రీకృష్ణ పరివారం—కంస దుర్యోధనులు—సమస్త దుష్ట శిష్టపాత్రలు నేడుకూడ వున్నారు, ఎప్పటి వరకయిన వుండగలరు. వారందరు శ్రీకృష్ణునకు సమానులు, మహా రసిక శిఖామణులు, విభిన్న మనస్తత్వాలతో శ్రీకృష్ణోపాసన చేసి విభిన్న మార్గాలద్వారా రసానుభూతిని సాధించి, రసస్వరూపులయి నారు. వారితో గోలోకంలో ప్రతిక్షణం, బృందావనంలో ప్రతినిత్యం పరమాత్మ తన అవతారకాలీన సమస్త లీలన్ని ప్రదర్శిస్తున్నాడు, ఈ భవతాపసంతప్తుల ననుగ్రహిస్తున్నాడు.

నేడు ప్రతిమానవుడు అర్జునుడు కావాలి, పరమాత్మ అతని జీవితరథానికి సారథికావాలి, ప్రతిక్షణం గీతోపదేశం జరుగాలి, సృష్టి సకలం నవచైతన్యాన్ని సంపాదించాలి. గీతా సందేశానుసారం ప్రతిమానవుడు తన జీవితంలోని ప్రతిక్షణాన్ని సంస్కరించుకోవాలి, సద్బుద్ధి సమస్త జనులలో సుందరరూపంతో సుమధుర లాస్యం చేయాలి. పాంచజన్యం మ్రోగాలి; "గీతామాతకు జై! గీతామాతకు జై!!" అప్పుడే ఈ గీతావతరణం నిత్యకళ్యాణం-పచ్చతోరణంగా అనంత సౌభాగ్యాల్ని అందుకొంటుంది, అందరికి అందిస్తుంది.

# (8) ధర్మం—శ్రీకృష్ణుడు

శ్లో॥ మాత్రాస్పర్శాస్తు కౌంతేయ! శీతోష్ణసుఖదుఃఖదాః,
ఆగమాపాయినోఽనిత్యా స్తాంతితిక్షస్వభారత॥

(భగవద్గీత అ 2-శ్లో 14.)

"కౌంతేయా! విషయ సంయోగంవలన ఇంద్రియాలకు వచ్చే సుఖదుఃఖాలు అనిత్యాలు. అవి వస్తుంటాయి, పోతుంటాయి. ధైర్యంగా వానిని సహించేవాన్ని మాత్రమే ఈలోకం 'మానవు' డంటుంది."

జ్ఞానం రెండువిధాలు. (1) శ్రుతిజ్ఞానం. (2) స్మృతిజ్ఞానం. వీనినే (1) అనుభవ స్వరూపజ్ఞానం (2) అనుభవ జన్యజ్ఞానమంటారు. వేదాలలో, ఉపనిషత్తులలో చెప్పబడిన జ్ఞానం అనుభవ స్వరూప జ్ఞానం. స్మృతిజ్ఞానం అనుభవ జన్యజ్ఞానం, ఇందు మొదటిది మెడికల్ కాలేజి, రెండవది చికిత్సాలయం. మొదటిదానిలో విద్యాబోధన ఉంటుంది, రెండవదానిలో రోగచికిత్సకు సాధన సామగ్రి ఉంటుంది. "ఒకప్పుడు ఆరోగం వచ్చింది. ఈ మందు వలన ఆరోగం తగ్గింది. కాన అట్టి రోగానికి ఈమందు ఉపయో

గించు." ఇదే అనుభవ జన్యజ్ఞానం. స్మృతులు అనుభవ జన్యజ్ఞానాన్ని అందిస్తాయి. భగవద్గీత స్మృతి. మానవుడు మోహాన్ని ఎలా మాయంచేయాలి? కామక్రోధాల్ని ఎలా స్వాధీనం చేసికోవాలి? సుఖదుఃఖాలకు ఎలా అతీతుడు కావాలి? ఈ విషయాలకు సమాధానంగా ఆచార్యుడు శ్రీకృష్ణుడు ప్రతిఒక్క నరునిముందు తన మహోన్నత జీవితాన్ని ఆవిష్కరిస్తున్నాడు.

శ్రీకృష్ణపరమాత్మ జీవితం ఆస్వాదించదగు అమృతం. అందులో అన్నీ సమస్యలే. ఆ అమృతం మహాప్రపంచ మధనంలో ప్రకటమయింది. మానవునకు సుఖదుఃఖ సహిష్ణుతను అనుగ్రహించే అమృతమది.

మధురా కారాగారంలో పరమాత్మ చతుర్భుజరూపంతో దేవకీ వసుదేవులకు ప్రకటమయినాడు. వెంటనే శిశురూపంతో గోకులం వచ్చాడు. పూతనను సంహరించాడు. వ్రజభూమిలో 11 సంవత్సరాలున్నాడు. అంతకాలం ఒకరితరువాత ఒకరుగా ఎందరో రాక్షసుల్ని రూపుమాపాడు. శ్రీకృష్ణుడా బాలుడు. ఈ రాక్షసులు అనమాన బలసంపన్నులు, చేతఆయుధం పట్టకుండగనే అందర్నీ బాలకృష్ణుడు అంతమొందించాడు. కృష్ణుడేమిటి? ఇందరు రాక్షసుల్ని వధించుటమేమిటి? కంస సంహారమయింది. ఆతరువాత జరాసంధుడు 18 పర్యాయాలు దాడిచేశాడు. ఆతరువాత ధర్మరాజు రాజసూయ యాగం, పాండవ కౌరవ సంగ్రామం, తరువాత అశ్వమేధయాగం. అన్నీ యుద్ధాలే యుద్ధాలు. శ్రీకృష్ణుని జీవితకాలమా 125 సంవత్స

రాలు మాత్రమే. ఎట్టి ఆపదలు! ఎట్టి ఆపదలు!! మానవతాదృక్కో ణంతో భౌతికంగా శ్రీకృష్ణుని జీవితాన్ని గంభీరాధ్యయనంచేస్తే గ్రాహ్యమయేది ఆతడు మహామనీషి. అడుగడుగునా ఆవిర్భవించే దుఃఖ పరం పరలలో ధైర్యంగా ఎలా ముందుకుసాగాలో తానా చరించి హితబోధచేసిన మహానుభావుడు శ్రీకృష్ణుడు. ఇంతటి ఆపత్స మయాలలోకూడ శ్రీకృష్ణుడు నవ్వుతూ నవ్విస్తుండే 'వాడేగానీ కంట తడిపెట్టి ఎరుగడు. మానవత్వంలో సుఖదుఃఖాలనే వానికి స్థానమే లేదు. ఇంక ఈ సుఖదుఃఖాలు దైవత్వంలో ఎలా గృహప్రవేశం కాగలుగుతాయి? శ్రీకృష్ణావతారం ఈ అపూర్వ పాంచజన్యాన్ని అనవరతం పూరించింది. అట్టి మహానుభావుని భగవద్గీత ప్రతిఒక్క వ్యక్తిని ఎందుకు మహానుభావునిగా రూపొందించదు? ఏనరుడయినా సరే భగవద్గీతా పఠనంతో మాత్రమే తృప్తిచెందరాదు, అందలి— ఏ విషయాన్నయినా స్వల్పమాత్రంగా నయినా ఆచరించగలుగు తున్నానా? లేదా? సద్గుణాలు ఎంతగా వృద్ధిగాంచుతున్నాయి? దుర్గు ణాలు ఎంతగా నశిస్తున్నాయి? యని ఆత్మపరీక్ష చేసికోవాలి. ఈ ఆత్మపరీక్షను మాత్రమే 'భగవద్గీతాపఠనం' అనాలి.

సాంఖ్యమంటే తత్త్వం! సమస్త సృష్టికి అదే ఆధారం. 'అనారోపితాకారం తత్త్వం.' ఆకారాన్ని నిర్ణయించటానికి పూర్వ ముండే స్థితిని 'తత్త్వ' మంటున్నారు. ఆతత్త్వమే ప్రకటస్థితిలో విష్ణువుతో కలిసి విష్ణుతత్త్వమయింది, శివునితో కలిసి శివతత్త్వ మయింది. నిర్గుణ—నిరాకారమన్నా, సగుణ—సాకారమన్నా ఏమీ

భేదంలేదు. ఒకేవస్తువు ఇలా స్థితిభేదం చెందుతోంది. నిర్గుణ—నిరాకారం కట్టెలలో అప్రకటంగా ఉండే అగ్ని. సగుణ—సాకారం ప్రకటమయిన అగ్ని. బ్రహ్మ నిర్గుణ–నిరాకారంగా—సగుణ సాకారంగా ఉంటూకూడా వానికి అతీతంగాకూడా ఉంటాడు. సగుణ—సాకారం లేక నిర్గుణ—నిరాకార ముండదు, నిర్గుణ—నిరాకారం లేక సగుణ—సాకార ముండదు.

[1] పంచభూతాలు

(1) ఆకాశం. (2) వాయువు. (3) అగ్ని. (4) జలం. (5) భూమి.

[2] కర్మేంద్రియాలు

(1) వాక్ (2) పాణి (3) పాద (4) పాయూ (5) పస్థలు.

[3] జ్ఞానేంద్రియాలు

(1) త్వక్ (2) చక్షు (3) జిహ్వ (4) ఘ్రాణ (5) శ్రోత్రాలు.

[4] విషయాలు

(1) శబ్దం (2) స్పర్శ (3) రూపం (4) రసం (5) గంధం.

[5] అంతకరణ చతుష్టయం

(1) మనో (2) బుద్ధి (3) చిత్తా (4) హంకారాలు.

ఈ 24 తత్త్వాల్ని 'సాంఖ్య' మంటారు. "పంచ వింశోఽయం పురుషః" 25వ తత్త్వం జీవుడు. 26వ తత్త్వం ప్రకృతి. 27వ తత్త్వం పరంబ్రహ్మ.

భగవద్గీతా సాంఖ్యయోగంలో 39వ శ్లోకం వరకుగల భావార్థం సంక్షిప్తంగా ఇంతవరకు ప్రస్తావించబడింది.

బుద్ధి సాంఖ్యంలో ఉంటుంది, కర్మలో కూడ ఉంటుంది. అయితే సాంఖ్యంలోని బుద్ధికి, కర్మలోని బుద్ధికి భేదముంది. బుద్ధి నశిస్తే సాంఖ్యం—కర్మ రెండూ ఉండవు. సాంఖ్యం—కర్మ వ్యాపింపచేస్తాయి, బుద్ధి వ్యాపిస్తుంది. ఎవడుజ్ఞాని? ఎవడు కర్మిష్ఠుడు? బుద్ధిమంతుడు మాత్రమే.

బుద్ధియొక్క సుందరకాండ ఈ మానవజీవితం. ఆబుద్ధియే మానవజీవితంలో నానా అధ్యాయాల్ని సృష్టిస్తుంటుంది. భగవద్గీతా 18 అధ్యాయాలు బుద్ధి సంస్కారణార్థం మాత్రమే అవతరించాయి. జీవితాన్ని తత్త్వమయం, లేదా జ్ఞానమయం చేయడానికి భగవద్గీతకు మించిది లేనేలేదు.

సాంఖ్యం ఉన్నవస్తువును ఉన్నట్లుగా ప్రకాశింపచేస్తుంది. కర్మవస్తువుకు ఏకంగా నూతనరూపాన్నే అనుగ్రహిస్తుంది. బుద్ధిలో భగవత్సాక్షాత్కారం సిద్ధింపచేస్తుంది. జీవుని బ్రహ్మనుచేస్తుంది. దాన్ని ముందుపోషిస్తేనే అది తరువాత మనల్ని పోషిస్తుంది.



# (9) ధర్మం—కర్తవ్యం

శ్లో॥ నేహాభిక్రమనాశోఽస్తి ప్రత్యవాయోనవిద్యతే।
స్వల్ప మప్యస్యధర్మస్య త్రాయతేమహతో భయాత్॥
(భగవద్గీత అ. 2-శ్లో. 40.)

"నిష్కామ కర్మయోగం బీజం ఎప్పటికి నశించదు. అది సదా వృద్ధి చెందుతుంటుంది. కర్తకు పాపపుణ్యాలనీయదు. ఫలాన్ని ఉత్పత్తిచేసి ప్రగతిని నిరోధించదు. ఎంతస్వల్పంగా ఆచరించబడినా నిష్కామకర్మ ఎంతో గొప్పభయాన్నుండి మానవుని రక్షిస్తుంది."

జీవితమంటే సుందరస్వప్నంకాదు, కర్తవ్యం. ఫలాపేక్షా రహితంగా జీవుడు కర్తవ్యకర్మల్ని నిర్వర్తించి తీరాలి. అందు నిమిత్తమే మానవశరీరం వచ్చింది.

పశువులలో ఒకప్రాణి మరొకప్రాణిని భక్షిస్తుంది. పరస్పరం సేవాధర్మంతో జీవించేవారెవరో వారే మానవులు. మానవుడు తోటి మానవుని యథాశక్తిగా జీవింపచేయాలి, ఆనందింపచేయాలి. దాన్నే మానవత్వమంటారు.

పరస్పర సహాయం లేక మానవుడెన్నటికి జీవింపలేడు. ఆకాశం అవకాశమిస్తోంది, వాయువు గాలివీస్తున్నాడు, అగ్ని అన్నం పక్వంచేస్తోంది, జలం దాహంతీరుస్తోంది, పృధ్వి జీవనయాపనం చేయటానికి స్థానమిస్తోంది. ఇంతటి ఉపకారులకు మానవశరీరం లభించినందుకు కృతజ్ఞతలు చెప్పకోనవలసిన అవసరం ఎంతయినా ఉందని నెత్తిన నోరుపెట్టుకొని ఎవరు హితబోధచేయాలి? ఇంత మాత్రం కృతజ్ఞతలు వ్యక్తంచేయని రాక్షసత్వంలోవుంటే జీవితం ఎలా సుఖవంతమవుతుంది? మరల మానవశరీరం ఎలా లభిస్తుంది?

ప్రతిదినం ప్రాతర్మధ్యాహ్న సాయంకాలాలలో సూర్య ప్రార్ధనచేయాలి, మలమూత్ర విసర్జన చేస్తున్నందుకు క్షమించమని అశ్రుపూర్ణనయనాలతో భూమాతను అభ్యర్ధించాలి, సరళమయిన స్తోత్రపాఠాలతో సకలదేవతల అనుగ్రహం సంపాదించాలి. దేవతల మానవుల ప్రశంసలను అపారంగా పొందాలి. అట్టిమానవుడే మానవుడు. లేకుంటే అతడు నిస్సంశయంగా దానవుడే. ఇలా కృతజ్ఞతా ప్రకటనచేసే సమయంలో అప్పుడుకూడ మానవుడు విషయాలకు ఎందుకు దాసుడుకావాలి? ఇంత స్వల్పకాలమయినా కామక్రోధాల్ని నిరోధించలేకపోతే ఆమానవుడేం మానవుడు? మానవుడు మనశ్శుద్ధితో మనసారా దేవతలకు, సోదర మానవులకు, పశుపక్ష్యాదులకు ప్రతినిత్యం కృతజ్ఞతలు చెప్పితీరాలి. ఇది మానవధర్మం. ధర్మం వేరూ—మానవుడు వేరూ కానేకాదు. ధర్మం మానవునిలో ప్రాణానికి ప్రాణంగా, జీవంలో జీవంగా తాదాత్మ్యం చెందివుంది. దాన్ని

పోషిస్తేనే మానవుని మనసు—శరీరం పోషింపబడుతాయి, దాన్ని సంహరిస్తే అది మానవుల మనసును—శరీరాన్ని సంహరించి తీరుతుంది. "ధర్మోరక్షతి రక్షితః."

ఇంతచక్కని అవయవాలు ఎందుకు మనకు మాత్రమే లభ్యమయినాయి? అందరికి ఎందుకు లభ్యంకాలేదు? లోకంలో సుఖవంతులున్నారు, అంగహీనులు, ఆరోగ్యహీనులు, శాంతిహీనులు కూడ వున్నారు. ఈ వైవిధ్యానికి కారణం ఏమిటి? "చేసికొన్నవారికి చేసికొన్నంత మహదేవ!" ధర్మంవలన శరీరం హృష్టపుష్టమవుతుంది, ఇంద్రియాలు పోషింపబడుతాయి, సుందరమవుతాయి, ఆయుర్వృద్ధికూడ అవుతుంది, ధర్మాత్ముడు పూర్ణాయువును ఆనందంగా అనుభవిస్తాడు. "పాపీ చిరాయుః" అన్నది వాస్తవంముందు ఎంతమాత్రం ధైర్యంగా నిలువజాలదు.

"స్వల్పమప్యస్యధర్మస్యత్రాయతే మహతోభయాత్" ఎంత స్వల్పంగా ఆచరించబడినదయినా ధర్మం మానవుల్ని ఎంతో గొప్ప భయంనుండి రక్షిస్తుంది.

పంచభూతాలు ధర్మంచేశాయి. ఇంతఘనమయిన శరీరం లభించింది. ధర్మమే శరీరంలో ప్రాణంగాఉంది. మానవుడంటాడు; "ప్రాణానికి ధర్మాలున్నాయి." ధర్మాన్ని తీసేస్తే జీవుడులేడు, జీవితం లేదు.

"ధర్మాత్ముడవు కా! లోకాన్ని ధర్మంలో నడిపించు సమస్త భయాలు నశిస్తాయి, భవభయంకూడ నశిస్తుంది."

ఇతరుల్ని సుఖింపచేయి, నీవు సుఖిస్తావు. ఇతరుల్ని దుఃఖింప చేశావా దుఃఖిస్తావు. మానవసేవతో మానవత్వాన్ని నిలబెట్టుకో!

భగవంతుడు ధర్మసంస్థాపనార్థం—దుష్టశిక్షణార్థం అవతరిస్తుంటాడు. ఇందలి రహస్యమేమిటి?

ధర్మాన్ని నాశనంచేస్తున్నాడంటే మానవుడు తనన్ని తాను నాశనం చేసికొంటున్నాడన్నమాట. ధర్మాన్ని రక్షిస్తున్నాడంటే తనన్నితాను రక్షించుకొంటున్నాడన్నమాట.

లోకంలో ఏ మానవుడయినా 'నేను–నేను' అంటాడు. ఆత్మ పదార్థం ఒక్కటే. అదే అందరిలోవుంది. జీవాలు ఇన్ని కనుపిస్తున్నాయి. వాస్తవంలో వీని స్వరూపమొక్కటే, హృదయమొక్కటే. అందువలన ఇతర ప్రాణులకు అపకారంచేస్తే అది నీవే అనుభవించ వలసివస్తుంది. అసత్యవచనంతో ఇతరుల్ని వంచించావంటే ఆత్మ హత్య చేసికొన్నావన్నమాట. ఒకటేమాట! ధర్మాన్ని రక్షించటమంటే ఆత్మరక్షణ చేసికొనటమే. ధర్మాన్ని నాశనంచేస్తే, దుర్గుణాలకు బానిసఅయితే ఎదుటివ్యక్తులు, దేశం దుఃఖాలపాలవటం తరువాత విషయం, ముందు ఈనాశనం చేసినవాడే సర్వనాశనమవుతాడు. వాస్తవంలో అది ఎదుటి వ్యక్తిని నాశనంచేయటం కానేకాదు గదా!

దైవమందు ధర్మమందు అవిశ్వాసం కలిగిందా మానవునిలో సమస్త దుర్గుణాలు ప్రవేశిస్తాయి, ఆతడెట్టి పాపాలయినా చేస్తాడు. దైవాన్ని, ధర్మాన్ని విశ్వసించకుండటం అంటే తనయందే మాన

వుడు విశ్వాసాన్ని కోల్పోతున్నాడన్నమాట. ఆదైవం—ధర్మం ఈ ఇంద్రియాల కావలనేవుండి వీనిని నడిపిస్తుంటాయిగదా! భగవదవతార సమయంలో లోకంలో ధర్మం క్షీణించింది. అంటే ఆత్మ విశ్వాసం క్షీణించింది. అందరు ఆత్మహత్య చేసికొంటున్నారు. ఈ కారణంగా ధర్మాన్ని రక్షించటానికి, సమస్త జీవుల్ని సుఖవంతుల్ని చేయటానికి ఆ నిరాకారమయిన ఆత్మయే ఆకారం ధరిస్తోంది. తన అస్తిత్వాన్ని నిరూపించుకొంటోంది. నిరాకారంగా ఉన్నంతవరకు ఆత్మవలన జీవుల ఈ అశాంతి—అవిద్య నివృత్తికావు. ఇలా ఆత్మ అవతరిస్తేనే జీవులకు ఆత్మవిశ్వాసం కలుగుతుంది. అంటే ధర్మం పోషింపబడుతుంది. సమస్తసుఖాలు సిద్ధిస్తాయి. అవతార సిద్ధాంతాన్ని అంగీకరించకపోతే మానవునకు అభ్యుదయం లేనేలేదు, వేదాంతం అసలేలేదు. ఇదితథ్యం.

సాధారణంగా పాపంవలన పుణ్యం హరించదు, పుణ్యంవలన పాపం హరించదు. రెండింటిని వేరు వేరుగా అవశ్య మనుభవించి తీరవలసిందే.

అయితే నిష్కామంతో చేయబడే ధర్మకర్మలు మానవుని పాపపుణ్యాలకు అతీతమయిన మార్గాన నడిపించి తీరుతాయి. తపసు వలన, అంటే మనోవాక్కాయ పరితాపంవలన పాపం—పుణ్యం; సుఖం—దుఃఖం రెండూ అంతరించి, దివ్యమైన భగవద్రాజ్యంలో ప్రవేశం లభిస్తుంది.

అయితే ఒక ప్రాణిని హింసించిన పాపం మాత్రం ఏతపసు వలన నశింపదు. దానిని మాత్రం అవశ్యం అనుభవించి తీరవలసిందే.

మాండవ్యుడు బాల్యంలో రెండు పక్షుల్ని పంజరంలో వుంచి వినోదానికి సూదితో గ్రుచ్చి హింసించాడు. ఫలితంగా భవిష్యత్తులో నిష్కారణంగా దొంగలనాయకుడుగా గుర్తింపబడి, ఆదేశ ప్రభువులచే శూలానికి గ్రుచ్చబడ్డాడు. శూలంమొన శరీరంలో అలాగే నిలిచిపోయింది. కాననే అణిమాండవ్యుడని పేరువచ్చింది. ఆతరువాత మాండవ్యుని మహాతపస్విగా రాజుగారు గ్రహించి, అపరాధాన్ని క్షమించ వలసిందిగా మాండవ్యుని ప్రార్థించారు. మాండవ్యుడన్నాడు;

"మహారాజా! ఇందులో నీ తప్పేముంది? నేరస్థుల్ని శిక్షించటం, లోకంలో ధర్మసంస్థాపన చేయటం మహారాజుగా నీకర్తవ్యం నీ కర్తవ్యాన్ని నీవు చాలాచక్కగా నిర్వర్తించావు. ఇందుకు నేను నిన్ను మనసారా అభినందిస్తున్నాను. మహారాజా!

శ్లో॥ సుఖేషు దుఃఖేషునకోఽపి దాతా
పరో దదాతీతి కుబుద్ధి రేషా,
అహం కరోమీతి వృధా విమానః
స్వకర్మసూత్ర గ్రథితో హిజంతుః॥

లోకంలో ఎవరూ ఎవరికీ సుఖాన్నిగాని, దుఃఖాన్నిగాని ఈయజాలరు. ఇది త్రికాలసత్యం. ఒకరొకర్ని సుఖింప చేస్తున్నారు,

దుఃఖింపచేస్తున్నారు అనుకోవడం చాలా అవివేకం. "ఏమైనా పొర పాటు చేశానేమో, అందువల్ల ఇలా దుఃఖిస్తున్నానేమో" ననుకోవటం కూడా నిస్సంశయంగా భ్రాంతధారణ. ప్రతిఒక్కజీవి కర్మాధీనమై, తానుతీసికొన్న గోతిలో తానేపడుతోంది.

మహారాజా! గతంలో నేనెవరినో హింసించి వుంటాను. లేకుంటే నా అంతటివాడు ఇలా హింసింప బడటమనేది అసంభవం. ఎదుటి వ్యక్తుల్ని సుఖింపచేస్తే, సుఖిస్తాం. దుఃఖింపచేస్తే దుఃఖి స్తాం. ఇతరుల కేమిచేసినా అది మనకే తిరిగివస్తుంది. వాస్తవంలో ఎదుటవ్యక్తికి చేయుటమంటే అది మన ఆత్మకు మనం చేసికోవటమే ఇది సృష్టిలోని సుందర నగ్నసత్యం."

"పరోపకారః పుణ్యాయ పాపాయ పరపీడనమ్." సృష్టిలో ప్రాణిహింసకు సమానమయిన పాపం మరొకటి ఏదీలేదు. ఏ తపసు కూడా ఆపాపాన్ని రూపుమాపలేదు. కాన సాధ్యమయినంత వరకు మానవుడు ప్రాణిహింసకు దూరంగా ఉండాలి.

పూర్వం మహారాష్ట్రదేశంలో విఠల్‌పంతే అనే సజ్జనుడుండే వాడు. ఆతడు వైరాగ్యంతో సన్న్యసించి, తరువాత గురూపదేశం ప్రకారం గృహస్థాశ్రమంలో ప్రవేశించాడు. ఫలితంగా ఆనాటి సంఘం సర్వవిధాలా ఆతనిని తమనుంచి బహిష్కరించింది. కాల క్రమంలో ఆ విఠల్‌పంత్-రుక్మిణీబాయి దంపతులకు సంతానం కలి గింది. క్రీ॥ శ॥ 1274వ సంవత్సరంలో జ్ఞానదేవులు ఈ కర్మ

భూమిపై ప్రకటమై, 21 సం॥ మూడునెలల, అయిదుదినాలు మాత్రమే జీవింపగలిగారు, వారిసోదరులు నివృత్తినాథులు, సోపాన దేవులు, సోదరి ముక్తాబాయి. భిక్షాన్నంతో జీవిస్తూ, విఠల్‌పంత్ భార్యాబిడ్డల్నికూడా అలాగే జీవింపచేస్తున్నాడు. అయినా ఆనాటి ధర్మవ్యవస్థ కారణంగా, సంఘ విద్రోహశక్తుల కారణంగా విఠల్ పంత్ దంపతులకు జీవనయాపనం అత్యంత దుర్భరమయి పోయింది ఫలితంగా వారు ప్రయాగక్షేత్రానికివెళ్ళి, ఆత్మహత్య చేసికొన్నారు. వారి ఆత్మహత్య పండితుల జ్ఞానోదయానికి కారణమయింది. మాతా పితృ హీనులై, సంస్కారహీనులై, భిక్షాన్నంతో జీవిస్తున్న ఈ అమాయక బాలురందు పండితులు దయార్ద్ర హృదయులయినారు. చివరకు మానవత్వం నిద్రలేచింది, ధర్మఘంట మ్రోగింది. "నహి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే." ఒక టేమాట! స్వస్వరూప జ్ఞానంవలన మానవుడు పవిత్రుడయినట్లుగా మరి దేనివలన పవిత్రుడు కాజాలడు. "జ్ఞానాగ్ని స్సర్వకర్మాణి భస్మసాత్కురుతేతథా." "సమస్త శుభాశుభ కర్మల్ని తత్కాలంలో భస్మం చేయాలంటే, అర్జునా! జ్ఞానం అగ్నికి సమానమయింది." అబోధ శిశువులు జ్ఞాన దేవాదుల్ని సంఘం సహస్ర హస్తాలతో తమలోనికి ఆహ్వానించింది. అనితరసాధ్యాలయిన మహిమలు ప్రదర్శించి, జ్ఞానదేవులు జగ ద్వంద్యులయినారు. తమ అత్యల్ప జీవితకాలంలో ఈఘోర కలి కాలంలో ఒక అపూర్వ సిద్ధాంతానికి ప్రాణంపోసి ఆదర్శ ప్రాయుల యినారు. అస్తు.



# (10) ధర్మం—నిష్కామకర్మ

నిష్కామకర్మ నిశ్చయాత్మికా బుద్ధికి జన్మనిస్తుంది. ఫలితంగా ప్రతిమానవుడు జ్ఞానదేవుడవుతాడు. సమస్త శుభాశుభ కర్మబంధాల నుండి ముక్తుడవుతాడు.

"మాఘమాసంలో సూర్యోదయకాలంలో నదీస్నానం చేయి, వైశాఖమాసంలో దానంచేయి, కార్తీకమాసంలో ప్రదోషకాలంలో శివాలయంలో దీపారాధనచేయి. ఓ మానవుడా! అనేకానేక జన్మల పాపాలనుండి ముక్తుడవవుతావు, మాతాపితరుల్ని హత్యచేసిన పాపం నశిస్తుంది, గురుద్రోహం చేసినపాపం, గురుపత్నీ గమనం చేసిన పాపంనశిస్తాయి." ఇలా వ్యాసులవారు పురాణాలలో నమ్మశక్యం కానంత అపరిమితంగా ప్రతిపాదించారు. ఇంకా ఈ విషయం కూడా చెప్పారు; "ఈ స్నాన దాన దీపారాధనాదులు చేయకుంటే నీకు ఎన్నో. ఎన్నెన్నో ఎంతో నీచమయిన జన్మలు లభిస్తాయి." ఆ సూచికను పరిశీలిస్తే చాల ఆశ్చర్యమవుతుంది. అయితే వ్యాస వచనం అసత్యమవుతుందా? అసంభవం. పురాణాలు పుస్తకాలా? కావు. ప్రత్యక్షదైవాలు. మరి ఉపర్యుక్త వచనాల్ని విశ్వసించవలసిందేనా? అవశ్యం విశ్వసించితీరాలి.

సంతానాన్ని సన్మార్గంలో నియోగించటానికి మాతా పితరులు అనేక ప్రయత్నాలు చేస్తారు, అనేకోపాయాలతో, ఆకర్షణలతో హితోపదేశాలు చేస్తారు. "నాయనా! ఇదిగో, ఇదిచేయి. దీనివలన నీవు అందరి ప్రశంసలు పొందుతావు, బాగా ద్రవ్యార్జన చేస్తావు, సర్వవిధాలా ఆనందిస్తావు. ఇలామేం చెప్పినట్లు చేయకుంటే అందరు నిన్ను నిందిస్తారు. జాగ్రత్త! రేపునీకు అన్నంపుట్టదు, దుఃఖాల పాలవుతావు." తల్లిదండ్రులు సత్యంతోగానీ, అసత్యంతోగానీ, నయానగానీ, భయానగానీ, ఆకర్షణలను చూపించియైన ఇలా సంతానాన్ని సన్మార్గంలో నియోగిస్తారు. "ఓరీ దౌర్భాగ్యుడా! చెప్పు! ఇలా ప్రవర్తించినందువలన ఆ తల్లితండ్రులు మంచిపేరు పొందుతారా? చెడుపేరు పొందుతారా? పరిణామంలో ఆనందం ప్రాప్తించేటట్లయితే, ధర్మం సిద్ధించి, జగత్కల్యాణం జరిగేటట్లయితే ముందు చెప్పిన ఈ అసత్యాలవలన అవగింజంతయైన దోషముండదు. ఈ అన్నింటిలో వాత్సల్యమే తొంగిచూస్తుంటుంది. ఇలాగే వేదమాత జగత్పితయైన భగవంతుడు ఎన్నోవిధాల యుక్తులతో, ఆకర్షణలు చూపించి, తమ సంతానాన్ని తప్పుదారినుంచి మళ్ళిస్తున్నారు. అయితే ధర్మఘంట మ్రోగితీరాలి; "ఆహా! భగవానుడెంత దయామయుడు!"

వ్యాస వచనం ఎన్నటికి అసత్యంకాదు. నిష్కామంగా చేయబడే కర్తవ్యకర్మలు, ఎంతస్వల్పంగా ఆచరించ బడినవయినప్పటికీ మానవుల్ని మహద్భయంనుంచి ముక్తుల్నిచేసి తీరుతాయి, పూర్ణకాముడయిన పరమేశ్వరుని మానవులముందుకు తీసికొనివస్తాయి.

అంతటి భగవంతుడే నిమ్నశ్రేణికి దిగివస్తుంటే ఈ తుచ్ఛ విషయ సుఖాలు ప్రాప్తిస్తాయనికూడా చెప్పవలసిన అవసరముంటుందా? అసలు అప్పుడు మానవులకు ఈవిషయసుఖాల అవసరమేముంటుంది? ధర్మం విషయసుఖాల్ని ప్రసాదిస్తూ, మానవుల్ని హెచ్చరిస్తోంది; "నాయనలారా! విషయసుఖాలు మాకు త్యాగంచేయబడే నిమిత్తం అనుగ్రహిస్తున్నాం, అనుభవించే నిమిత్తంకాదు. మానవుడు విషయాలలో ఉంటూనే వానికి అతీతుడు కావటానికి ప్రయత్నించాలి." ఇందునిమిత్తం ముందు ఆత్మవ్యవసాయం చెప్పబడుతోంది, ఇంకా భోగైశ్వర్య ప్రసక్తులగు విషయాపహృత చేతస్కులకు నిశ్చయాత్మికా బుద్ధి ప్రాప్తించదనికూడ చెప్పబడుతోంది. విషయాలు బుద్ధిని చంచలంచేస్తాయి, నాశనంచేస్తాయి. సకామకర్మలు నానావిధాలు, అవి నానావిధాలయిన ఫలాల నుత్పన్నంచేస్తాయి. స్వర్గసుఖాల నీయ వచ్చునుగాక, కానీయవి పరిణామంలో దుఃఖాన్నిస్తాయి. మానవుని బుద్ధిని స్థిరంగా ఉండనీయవు. బుద్ధి వానివలన రకరకాలుగా మోహాక్రాంతమవుతుంటుంది, జనన మరణరూపబంధం ధృఢమవుతుంది. శ్రీకృష్ణుడంటున్నాడు; "అర్జునా! ఇందువలన ధర్మానికి చరమలక్ష్యం విషయప్రాప్తికాదు, విషయనివృత్తి మాత్రమే."

ధర్మం, అథవా నిష్కామకర్మం మానవుల్ని మహద్భయం నుండి ముక్తుల్ని చేసితీరుతుంది. అయితే ఏధర్మం ఎప్పటికి ఫలప్రద మవుతుందో చెప్పటంకష్టం. "గహనా కర్మణోగతిః." సత్కర్మ సుఖానిస్తుంది, అసత్కర్మ దుఃఖాన్నిస్తుంది, వ్యక్తి విశేషా

న్నానుసరించి, ద్రవ్య విశేషాన్నానుసరించి, భావ విశేషాన్నానుస రించి, స్థాన విశేషాన్నానుసరించి కర్మలు ఫలప్రదాలవుతాయి. ఒకే కర్మకు, ఒకే ప్రమాణంలోవున్న కర్మకు ఫలంకూడా హెచ్చుతగ్గులుగా వుంటుంది: ఆఫలితం వెంటనే సిద్ధించవచ్చు, ఆలశ్యంగాకూడా సిద్ధించవచ్చు. సుఖంగానీ, దుఃఖంగానీ బయటనుండిరావు. అందు వలన మానవుడు సన్మానాన్నిగానీ, అవమానాన్నిగానీ తన మనసు వలన మనసులోనే పొందుతాడుగానీ ఎంతమాత్రం ఇతరులవలన పొందడు. ఇతరులవలన పొందుతున్నట్లుగా దృశ్యంమాత్రం కాన వస్తుంది. నరులు కష్టపడే స్థానాన్ని 'నరక' మంటున్నారు. 'యమం' అనగా అంతరింద్రియ నిగ్రహం గలవానిని 'యము' డంటున్నారు. మతి నశించటాన్నే 'మృత్యు' వంటున్నారు. జీవుడు నరకంలో యమునివలన శిక్షింపబడడు, నరకలోకంలో శిక్షింపబడడు. ఈ భూలోకంలోనే సర్వనాశనమయిన బుద్ధి మానవుని శిక్షిస్తుంది. ఆ శిక్షననుభవించే సమయమే మానవులకు 'మృత్యుకాలం'గా చెప్ప బడింది. విషయాలయందు ఆసక్తమయినది మనసు. కాన ఫలితాన్ని పొందవలసింది మనసు మాత్రమే. నశించినట్లయిన మనసు, లేదా బుద్ధి మరల నవచైతన్యాన్నిపొందాలి. అందుకే ఈ 'ధర్మఘంట' మ్రోగుతోంది.



## (11) ధర్మం—ఫలసిద్ధి

పూర్వం ఉజ్జయినీ నగరాన్ని విక్రమార్కుడు పరిపాలించే వాడు. ఆతని రాజ్యంలో ధర్మాత్ములు సముచిత సత్కారం పొందే వారు. అలాగే దుష్టులు సముచిత శిక్షను పొందేవారు. ఈకారణంగా విక్రమార్కుని ధర్మప్రభువుగా విశ్వం వేనోళ్ళ ప్రసంశించింది.

అట్టి మహాప్రభువు ఆస్థానంలోనే ఒకరాత్రి నల్వురుదొంగలు ప్రవేశించగా, ద్వారపాలకులు వారిని బంధించి మహారాజుముందు ఉపస్థితుల్ని చేశారు. ఆదొంగలు నల్వురు క్రమంగా బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్ర వర్ణాలకు సంబంధించినవారు. అందరు చౌర్యానికి వచ్చినవారే. అయితే వారు నల్వురను రాజు నాలుగు విధాలుగ శిక్షిస్తున్నాడు; కారణం ఆ నల్వురిబుద్ధి నాలుగురకాలు.

"బ్రాహ్మణోత్తమా! మీరు కులీనులు. మాఅందరకు పూజ్యులు, మాఅందర్నీ ధర్మపథంలో ప్రవర్తింప చేయవలసిన భూసురులు, ఇట్టిమీరే ఇలా చౌర్యానికి సంసిద్ధులయినారు. మీకెంత అవమానం! ప్రభువులమయిన మాకెంత అవమానం!! మీరు స్వయంగా సూచించినంత మాత్రాన నేను నా సమస్తరాజ్యాన్ని

మీకర్పించిపు-డేవాడనుగదా! ఐనా మీరు నిగ్రహశక్తిని కోల్పోయి ఇలా వర్ణవిరుద్ధంగా ప్రవర్తించారు. దానిఫలితంగా దుఃఖింప వలసి నవారు ఈ అమాయక ప్రజలేగదా! వెళ్ళండి, ఆత్మనిగ్రహంతో జీవించి, మాఅందర్నీ సుఖంగా జీవింపచేయండి, మరల ఎప్పుడూ ఇలా ప్రవర్తించకండి."

"క్షత్రియకుమారా! నీవు సాటి క్షత్రియవంశంలో జన్మించి ఇలా చౌర్యానికివచ్చావు. ఏంపుట్టుక పుట్టావురా! చక్కగా సింహాస నాసీనుడవై ప్రజలందర్నీ ధర్మమార్గంలో నియోగించవలసిన నీవే ఇలా పతనమయినావు. ఇంక ఒక్కక్షణం నీవు నారాజ్యంలో ఉన్న ట్లయితే నా ప్రజలందరుకూడ బుద్ధి భ్రష్టులవుతారు. కాన నిన్ను ఈ దేశంనుంచి బహిష్కరిస్తున్నాను. పో, నాకళ్ళముందు కనుబడకు."

"ఏం శ్రేష్టి! నీవు దొంగతనం లేకుంటే జీవింపలేని దుస్థి తిలో ఉన్నావన్నమాట. నీ యీకుకృత్యానికి నేను విధించే శిక్షవలన యావజ్జీవం నీమనసు అపార వేదనతో కృశించి, నశించాలి. వెంటనే లక్షరూప్యములు మా ఆస్థానానికి సమర్పించు. వెళ్ళు."

ఇంక శూద్ర వర్ణస్థుడయిన చోరుడు మిగిలియున్నాడు. విక్ర మార్కుడు భటులను హెచ్చరించాడు; "మీరీతనిని నగ్నునిచేసి, ఒంటినిండా నూనెరాచి, ముండనం చేయించి, గాడిదమీద ఊరేగిం చండి. పదిమందీ ఈతని సుందరముఖాన్ని చూచినవ్వాలి. ఆనవ్వులు వజ్రాయుధాలై జీవితాంతం ఈతనిని చిత్రవధ చేయాలి. ఆలసించ కండి, వెంటనే మా ఆదేశాన్ని అమలు జరుపండి."

మహారాజుగారి న్యాయం నేరస్థుల్ని ఎలా ప్రభావితుల్ని చేసింది? అవశ్యం గమనార్హం.

బ్రాహ్మణ చోరుడు ఆత్మక్షోభచెందాడు. రాజుగారి మాటలు అతనిపాలిట మారణాయుధాలయినాయి. ఆ ఆయుధాలు ఆతనికి ఈ మర్త్యభూమినుండి ఉద్వాసనచెప్పాయి. అతడు ఆత్మహత్య చేసి కొన్నాడు. వెంటనే ధర్మఘంట మ్రోగింది; "శబాశ్! రాజుగారు విధించవలసిన శిక్ష నాతడు స్వయంగానే విధించుకొన్నాడు. లోకం ఇప్పుడాతనిని చోరుడనదు. ధర్మాత్ముడంటుంది. అతడు ఆచంద్ర తారార్కం అమరజీవిగా ఉంటాడు. భావితరాలకు అవశ్యం ఆదర్శ పురుషుడవుతాడు."

క్షత్రియ కుమారుడు దేశబహిష్కృతుడై, కాశీనగరంలో కాలుపెట్టాడు. వాతావరణ ప్రభావం! ఆకాలం ఎటువంటిదో ఏమో! అతనిబుద్ధి ధర్మమార్గంలో కాలుపెట్టింది.

శ్రేష్ఠి లక్షరూపాయలు లక్షణంగా ఆస్థానానికి సమర్పించు కొన్నాడు. శ్రీరామరక్ష లభించింది. ఆత్మ పరితాపంతో అచిర కాలంలోనే ధర్మాత్ముడయినాడు.

ఇంక మన శూద్రవర్ణస్థుడున్నాడు, గాడిదపై ఊరేగుతున్నాడు అతడు గజదొంగ. ఎన్నోమార్లు అతడు మహారాజుగారి కళ్ళలో కారంచల్లినట్టివాడు. దురదృష్టం! అతడు పట్టుబడ్డాడు. పదిమంది ముందు పరాభవింప బడుతున్నాడు. పెద్దలు నవ్వుతున్నారు, పిల్లలు

రాళ్ళు రువ్వుతున్నారు. దారిలో ఏడుస్తూ భార్య ఎదురయింది. ఆతడు భార్యతో అంటాడుగదా! "సుముఖీ! ఏమిటీ కన్నీళ్ళు? అసలు నీకిప్పుడు ఏడువవలసిన అవసరమేమివచ్చింది? ఇంతలోనే అంతా నాశనమయినట్లుగా ఇంత ఏడుస్తున్నావు. ఇదేం బాగులేదు సుమా! ఇదిగో, ఇప్పుడే రెండుగంటలలో ఇంటికి వచ్చేస్తున్నాను. రేపటి నుంచి మనం మామూలుగా ఆనందంగా కాలక్షేపం చేయవచ్చు. దురదృష్టంకొద్దీ ఇప్పుడు పట్టుబడ్డానుగానీ రేపు లక్షలుపట్టుకొని వస్తాను. అనవసరంగా ఏడువవద్దు. ఆఁ! ఇంతకీ ఈరోజు శాకపాకాలేమిటి?"

దుర్మార్గునకు లోకాపవాద భయముండదు, పాపంచేస్తున్నాం, ఎదుటివారిని బాధిస్తున్నాం అన్న జ్ఞానం ఆసలేఉండదు. ఇకవాడు ఎట్లా పశ్చాత్తప్తుడవుతాడు? వానిలో స్వార్థమే స్వార్థం రాజ్యం చేస్తుంటుంది. ఇతరులు ఏడుస్తుంటే ఆనందించటమే స్వభావంగాగల దుర్జనుడు ఏంచేయడు? ఏమయినా చేయగలడు.

ఆ గజదొంగ మరుసటిదినమే మరల రాజాస్థానంలో దొంగతనం చేయవచ్చాడు, పట్టుబడ్డాడు. ఈసారి రాజుగారు అతని రెండు చేతులు నరికించేశారు. వేడివేడి రక్తం ధారగా భూమాతను స్నానం చేయిస్తోంది. కన్నతల్లి ఈ పాపరక్తంలో మునిగి తల్లడిల్లుతుంటే ఈతడు చూడలేకపోయాడు. భవిష్యత్తులోని తన దారుణ దుఃఖాన్ని ఈ త్రెగినహస్తాలు చెప్పలేక, చెప్పలేక చెపుతున్నాయి. ఆ రక్త

ధారలలో ఆతని పాపాలన్నీ రూపుమాశాయి. అంతే! ఆతడు ధర్మాత్ముడయినాడు.

నద్దిశల్లా ధర్మఘంట మ్రోగింది; "పాపం ఒక టేకావచ్చును. అనుభవం మాత్రం వ్యక్తిత్వాన్ననుసరించి భిన్నంగా ఉంటుంది. ఏకర్మకు ఏఫలితం ఎప్పుడు ఎలా అనుభవానికి వస్తుందో ఎవరూ చెప్పనేలేరు."



# (12) ధర్మం—భగవద్విస్మరణ

ప్రాపకారణంగా అవశ్యం దుఃఖించి తీరవలసిందే, భగవద్వి స్మరణకు మించిన పాపం ప్రపంచంలో మరొకటి లేనేలేదు.

శ్రీరామచంద్రుడు సమక్షంలోవుండగా బంగారులేడిని కాంక్షించింది జానకీదేవి. మహాపురుషుడయిన మఱదిని మనసొచ్చిన రీతి దుర్భాషలాడింది. ఫలితంగా రావణాధీనురాలయి దుఃఖించింది. ఆతరువాత ఏమయింది? తన శరీరాన్ని అగ్నికి ఆహుతిచేసింది. లోకానికి సందేశమిచ్చింది, భగవంతుని, లోనున్నవానిని విస్మరించినట్లయితే ఆచర్మం అగ్నికి కానుక అయితీరుతుంది. భగవత్సేవ చేసినట్లయితే ఆచర్మం భగవత్స్వరూప మవుతుంది, ఆజీవుడు అజ రామరుడవుతాడు.

శంకరుడు సమక్షంలోఉండగా దాక్షాయణి శ్రీరాముని బ్రహ్మ స్వరూపాన్ని శంకించింది. స్వామియందలి గౌరవంతోనయినా శ్రీరాముని బ్రహ్మగా అంగీకరించలేక పోయింది. జానకీ రూపం ధరించి, పరీక్షాబుద్ధితో శ్రీరాముని సమీపించింది. అబోధ శిశువు ఏనుగును చూడాలని ఏడుస్తాడు, ఎంతచెప్పినా చెవినీయడు. అప్పుడు

తండ్రి ఏనుగుబొమ్మగల కాగితాన్నిచూపించి ఆనందింపచేస్తాడు. పాపం! అలాగే శ్రీరామచంద్రుడుకూడ అబోధ శిశువని దాక్షాయణి భ్రమించింది. అప్పుడు శ్రీరాముడామెకు తన సచ్చిదానంద స్వరూపాన్ని సర్వత్రా సాక్షాత్కరింపచేశాడు. అదంతా ఇచట తెలియ చేయటం అనవసరం. శ్రీరాముని స్వరూప జ్ఞానాన్ని పొందిన తరువాతకూడా దాక్షాయణి శివసన్నిధికివచ్చి అసత్యంచెప్పింది; "స్వామీ! మీరిక్కడనుండి శ్రీరామునకెలా ప్రణమిల్లారో అలాగే నేను దగ్గఱకువెళ్ళి ఆయనకు ప్రణమిల్లాను. ఆ దివ్యసన్నిధానంలో నా సంశయాలన్నీ చాల ఆశ్చర్యంగా అదృశ్యమయినాయి."

అసలు పరమేశ్వర వచనాన్ని విశ్వసించకుండటమే దాక్షాయణి చేసిన మొదటి గొప్ప అపరాధం. ఆతరువాత శ్రీరాముని పరీక్షించాలనుకోవటం రెండవ అపరాధం. జానకీరూపాన్ని ధరించటం మూడవ అక్షమ్యాపరాధం. చివరకు సర్వజ్ఞుడయిన తనస్వామి దగ్గఱ అసత్యం చెప్పటం నాలుగవ అపరాధం. పెద్దల వచనాల్ని విశ్వసింపనివాడు, దైవభక్తి—ధర్మబుద్ధిలేని విషయీపురుషుడు ఏపాపం చేయడు? ఏ పాపమయినా చేస్తాడు, చివఱకు పదిమందిని నశింపచేసి సర్వనాశన మవుతాడు.

ధర్మం కష్టసాధ్యమే, అయితే కష్టసాధ్యంకాని విషయం లోకంలో ఏముంది? అంతమాత్రంతో ధర్మాన్ని నాశనంచేస్తే మానవుడు సర్వనాశనమవుతాడు. నిరంతరం భగవత్సేవలో వుండే ఆ జానకీదేవి, ఈ దాక్షాయణి సమస్త ప్రపంచానికి ఆరాధ్యదైవాలు

గదా, భగవద్విస్మరణవలన వారే ఇంత ఘోరశిక్ష ననుభవించారే. కష్టసాధ్యమని మానవుడు పూర్తిగా ధర్మవిముఖుడయితే ఇంకెంత ఘోరదండన ననుభవింపవలసి వుంటుంది? దౌర్భాగ్యుడా! ఆతనికి మరల పుట్టటానికి ఎలా గతులుంటాయి? ఆచంద్రతారార్కం ఆతడు నరకంలో ఉండవలసిందే.

ఫలితంగా పరమేశ్వరుడు దాక్షాయణిని శాశ్వతంగా పరిత్యజించాడు. దుఃఖసంతప్తయైన దాక్షాయణి దక్షయజ్ఞంలో దేహత్యాగం చేసి హిమవత్పుత్రికగా అవతరించింది. అప్పుడే పరమేశ్వరుడామెను పరిగ్రహించాడు.

అక్కడ లంకలో అగ్నిదేవుడు "సీత పవిత్రురాలని" శ్రీరామునకు చెప్పాడు. ఇక్కడ ఆకాశవాణి "దాక్షాయణి పవిత్రురాలని" శంకరునకు చెప్పింది. వాస్తవంలో వారు మాయామోహితులు కానే కాలేదు. మాయ వారి శ్రీ చరణాలకడ సదా ఆజ్ఞానుకారిణిగా ఉంటుంది. సమస్త బ్రహ్మాండాలు వారి సంకల్ప మాత్రాననే క్షణంలో ఆవిర్భవించి, అంతరిస్తున్నాయి. అట్టివారికి మాయఏమిటి? దండన ఏమిటి? దుఃఖమేమిటి? వారు మాయామోహితులగు మానవులకు సందేశ మిస్తున్నారు, ధర్మ ఘంట మ్రోగుతోంది; "అవశ్యమనుభోక్తవ్యం కృతం కర్మ శుభాశుభమ్." సుకృత దుష్కృతాల ఫలితాలు సుఖదుఃఖాల్ని మానవుడు అవశ్య మనుభవించి తీరవలసిందె. పాపానికి మరొక పేరు 'అఘం.' "నహాస్యతేభోగం వినాఇతి అఘః." అనుభవించకుంటే ఏది నాశనాన్ని పొందక అలాగే వెంటాడుతుంటుందో దాన్ని 'అఘ' మంటారు. అస్తు.

"స్వల్ప మప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్."
ధర్మం త్యాగంవలన సిద్ధిస్తుంది. ద్రవ్యత్యాగం ఏమంత గొప్ప విషయంకాదు, ఆశాత్యాగం, లేదా స్వార్థ త్యాగంవలన మానవుడు జీవించియుండగనే మాధవుడవుతాడు. వైరాగ్యం లేనివాడు త్యాగి కాలేడు. వైరాగ్యం త్యాగానికి పిత. ఏమిటీ శరీరం? కేవలం చర్మమేగదా! పశువుల చర్మమెట్టిదో మానవుల చర్మంకూడ అట్టిదే గదా! ఇందులో ఏ రత్నాలున్నాయి? మాణిక్యాలున్నాయి? రక్తం–మాంసం. దుర్గంధమే దుర్గంధం. చర్మం లోపల ఉన్న వానిని ప్రేమించాలి. అంతేగానీ చర్మాన్ని భగవంతుడనుకొనుటం ఎంత నీచత్వం? పశుపక్ష్యాదుల బారినుండి రక్తమాంసాల్ని కాపాడుకొనటానికి భగవంతుడీ చర్మాన్ని అనుగ్రహించాడు. చర్మమే లేకుంటే మానవులు జీవించియుండగనే పశుపక్ష్యాదుల కాహారమయ్యే వారు. ఇలా భగవంతుడు దయామయుడై, అనుగ్రహించిన చర్మాన్ని తపసునందు మాత్రమే నియోగించాలి.

తల్లిగర్భంలో జీవుడు ఎంతో నరకమనుభవిస్తాడు. ఆ గర్భ సంచిలో అవయవాలు కదల్చటానికి అవకాశముండదు. శిరసును ఒడియందు పెట్టుకొని వెనుక 700 జన్మల కర్మస్మృతిలో తల్లి గర్భంలో మానవుడు నిరంతం తల్లడిల్లుతుంటాడు. మహా ప్రబలమయిన జఠరాగ్ని నాలుగు వైపులనుండి చుట్టుముట్టుతుంటుంది. హే మానవుడా! అట్టి మానవజన్మ ఎంతనీచమయినది? ఆ రోదనంతోనే మానవశిశువు మాతృగర్భంనుండి భూమిమీదకు వస్తోంది. ప్రపం

చాన్ని చూడలేక శిశువు ఏడుస్తుంటే, ప్రపంచాన్ని ఆ శిశువు ముందుకు తీసికొనివచ్చి, లక్షలు ఖర్చుచేసి ఉత్సవంజరిపి ఈ తల్లి దండ్రులు ఆనందిస్తారు. వీరూ వాస్తవంలో ఒక తల్లిదండ్రులేనా? జీవుడు భౌతిక శరీరంనుండి, ప్రపంచంనుండి సుఖదుఃఖాలకు అతీతుడై నిష్క్రమించే ఆనందసమయం మృత్యుకాలం. ఆ సమయంలో ఈ తల్లిదండ్రులు—బంధు బాంధవులు అపరిమితంగా కన్నీరు కురిపిస్తారు. దుఃఖసమయంలో ఉత్సవం చేస్తారు, ఆనంద సమయంలో దుఃఖిస్తారు. వాస్తవానికి వీరు స్వజనులెలా అవుతారు? వ్యామోహాన్ని త్యజించి, మానవ కర్తవ్యాన్ని ప్రతివారు నిర్వర్తించాలి. అప్పుడే ఈశరీరం దివ్యమవుతుంది, జన్మ ధన్యమవుతుంది. కర్తవ్య విముఖులై, స్వార్థ సిద్ధినిమిత్తం తపించే స్వజనులు రాక్షసులు, శత్రువులు, ఆత్మవంచకులు.

శ్లో॥ ఋణానుబంధరూపేణ పశుపత్ని సుతాలయః,
ఋణక్షయే విముచ్యంతి కాతత్ర పరిదేవనా॥

"దౌర్భాగ్య మానవుడా! పశువులు, పత్ని, సంపద, సుతులు, గృహాదులు అన్నీ ఋణవశాన ఇలా ప్రాప్తించాయి. ఋణం తీరిందంటే ఒక్క నిమిషంకూడ అవి నీదగ్గర ఎంతమాత్రం 'నీవి'గా ఉండవు. అట్టివానికై ఎందుకింతగా ఏడుస్తావు?"

"చుట్టాలు దొంగలు సుతులు ఋణస్థులు కాంతలు సంసార కారణములు." (శ్రీమదాంధ్ర మహాభాగవతం.) ఇది అక్షరాలా యథార్థం.

ఏం చెప్పినా ఏం ప్రయోజనం? ఈ ప్రపంచంలో వైరాగ్యో దయానికి వ్యాధికి మించింది మరొకటి లేనేలేదు. వ్యాధిగ్రస్థమయిన శరీరం లోకంలో ఏపనికి పనికివస్తుంది? వ్యాధిగ్రస్థుని జీవితం ఎంత దుర్భరంగా ఉంటుంది? ప్రక్కనున్నవారు మాటలతో, చేతలతో ఆతని నెంతగా హింసిస్తారు? ఆ స్థితిలో లేచి, నిలబడాలంటే ఇరువురు మనుషుల సహాయం కావాలిగదా, ఏమిజన్మ ఈజన్మ? ఎందులకీ అహంకారం? ఎందులకీ అభిమానం? ఈ క్షణం ఉన్నట్లుగా మరునటి క్షణం ఉంటుందని నమ్మకమేమిటి? దౌర్భాగ్యుడా! ఇప్పటికయినా ఈ చర్మాన్ని సద్వినియోగం చేసికో.



# (13) ధర్మం — సక్తుప్రస్థుడు

"ఏ సుఖాన్ని నీవు కావాలనుకొంటావో దాన్ని ముందుగా పదిమందిచే అనుభవింపచేయి. అప్పుడే ఆసుఖాన్ని అనుభవించ టానికి అర్హుడవవుతావు. ఆసుఖంకూడ కలకాలం నీదగ్గఱ కాపురం చేస్తుంది. ఇలాకాకుండా ఇతరుల్ని దుఃఖింపచేసి సుఖించాలనుకొంటే నీవు తాత్కాలికంగా సుఖిస్తే సుఖిస్తావేమోగానీ ఎంతమాత్రం కల కాలం సుఖించలేవు. మరువవద్దు, ఇది అక్షరసత్యం."

పూర్వం సక్తుప్రస్థుడ బ్రాహ్మణోత్తముడుండేవాడు. ఆ కాలంలో దేశం చాల దుర్భిక్షానికి లోనయింది. సక్తుప్రస్థునకు రోజులు గడువటం చాల కష్టమయింది. అయినా శరీరకష్టంతో ఎంత అన్నం ప్రాప్తిస్తే అంతలోనే తాను తృప్తిచెంది, తన కుటుంబాన్ని కూడ తృప్తి పఱచెదువాడు. కొంతకాలం ఆతడు తన కుటుంబాన్ని కేవలం పేలపిండితోనే పోషిస్తూవచ్చాడు. ధర్మదేవత ఆతని పరీ క్షింప దలచి ఒకదినం వృద్ధ బ్రాహ్మణ రూపంతో వచ్చింది. సక్తు ప్రస్థుడు సంతోషంగా తన ఆహారభాగాన్ని వృద్ధునకు సమర్పించాడు. అయినా అప్పుడు వృద్ధుడు తృప్తిచెందలేదు. అంతట భార్య తన

ఆహారభాగాన్ని వృద్ధునకిచ్చేస్తానంటుంది. సక్తుప్రస్థుడు భార్యను నివారిస్తూ అంటాడు; "ప్రియే! వద్దు. పురుషునకు ఎన్నికష్టాల కోర్చియైన స్త్రీని పోషించటం ధర్మమని శాస్త్రాలు చెప్తున్నాయి. అటు వంటిది నీవు నీ భాగాన్ని ఈవృద్ధునకిస్తానంటే నేను చూడలేకున్నాను వద్దు, ప్రియా! వద్దు." ఆభార్య అంటుందిగదా! "స్వామీ! భార్యకు శరీరత్యాగం చేసియైనా భర్తను సంతుష్టునిచేయటం. భర్తమానాన్ని కాపాడటం ధర్మమని శాస్త్రాలు చెప్పటంలేదా. భర్తసేవకు భిన్న మయిన ధర్మం స్త్రీకి వేరొండు లేనేలేదు. ఈభాగాన్ని వృద్ధునకిచ్చి, ఆతని ఆనందింపచేసి తీరుతాను." భార్యభాగాన్ని భుజించినప్పటికి కూడ వృద్ధుడు తృప్తిచెందలేదు.

అప్పుడు కుమారుడు తన ఆహార భాగాన్ని వృద్ధునకిచ్చేస్తా నంటాడు. సక్తుప్రస్థుడు నివారిస్తూ అంటాడు; "వలదు, నాయనా! వలదు. బాలురకు ఆకలిమెండుగా ఉంటుంది. తల్లిదండ్రులు సర్వ స్వత్యాగంచేసి పిల్లల్ని ఆనందింప చేయాలనేగదా! తపిస్తుంటారు ఈకొద్ది పేలపిండికూడ తినకుండ నీవు ఆకలితో ఇట్లే నిలిచిపోతే నాయీకళ్ళు ఎట్లు చూడగలుగుతాయి నాయనా!" కుమారుడంటాడు! "నాన్నగారూ! శాస్త్రాలు "ఆత్మావై పుత్రనామాసి" అని చెప్పటం మీకు తెలియదా? తండ్రివేరు, పుత్రుడు వేరునా? మీరిచ్చిన శరీ రమేగదా ఇది. దీన్నేగనుక మీరనుగ్రహించకుంటే నేనీ విషయ సుఖాల్ని భోగింపగలవాడను కానుగదా! శరీరాన్ని అనుగ్రహించి ఇహసుఖాల్ని, జ్ఞాన శరీరాన్ని అనుగ్రహించి పరలోక సుఖాల్ని

రెండు ఛేతులా దయచేస్తున్న మీరు నాకు దైవ సమానులు. చర్మం ఒలిచి చెప్పులు కుట్టిచ్చినా తల్లి దండ్రుల ఋణం తీరదని పెద్దలు చెప్పటం లేదా! నా భాగాన్ని ఈ వృద్ధునకిచ్చి, సేవించుకొనుట యన్నది ఎంత స్వల్ప విషయం! ఇంతమాత్రం సేవా భాగ్యానికి కూడా ఈ శరీరం అనర్హమయే ఎడల ఇంక నేను శరీరధారణ చేయటమే అనవసరం. ఇన్ని దినాలుగా ఈ శరీరాన్ని పోషిస్తున్నది ఈ మహాద్భాగ్యం నిమిత్తమేగదా! ఇట్టి భాగ్యాన్ని చేజేతులా జార విడువమని చెప్పుటకు మీకు నోరెట్లా వస్తోంది నాన్నగారూ?" కుమారుని ఆహార భాగాన్ని స్వీకరించినప్పటికి కూడా వృద్ధుడు తృప్తి చెందలేదు.

అప్పుడు కోడలు తన ఆహారభాగాన్ని వృద్ధునకు దానం చేయబోయింది. సక్తుప్రస్తుడు నివారిస్తుంటే, కాస్త గంభీరంగా ఆ కోడలు అంటుందిగదా! "మామగారూ! శాస్త్రాలు "అతిథి దేవో భవ" యన్నాయి. ఎవడు పొట్ట నింపుకొటయే జీవిత లక్ష్యమని భావించి, పరలోకాన్ని నాశనం చేసికొంటాడో అట్టివాడు నరరూప రాక్షసుడుగా లోకంచే నిందింప బడతాడు. అట్టివాని జన్మవలన ఎన్ని తరాల పితరులో గతులులేక, ఆవేదనతో క్రుంగి, కృశించి నశిస్తారు. లోకంలో స్వార్థం నిమిత్తం బ్రతుకువాడు బ్రతికినవాడేనా ఏమి? వాడు జీవచ్ఛవం. స్వార్థం నిమిత్తమే జీవిస్తున్నవి పశువులు. అప్పుడు మానవుడును పశు సమానుడగుతున్నాడు గదా! ఎవని శరీరం వలన లోకంలో సేవ జరుగుతుందో

పదిమంది ఆనందిస్తారో అట్టివాని జీవనమే నిజమైన జీవనము. అట్టి వాడు ఈ భూలోకవాసులకు ప్రత్యక్ష దైవము. ఈ సదవకాశ మును సద్వినియోగం చేసికొని, అతిథిని ఆనందింప చేసి, ఇటు మీ పితరులను, అటు నా పితరులను తరింపచేయుటంలోనే నా మానవత్వం దైవరాజ్యానికి ప్రయాణించ గలుగుతుంది. నిజంగా ఈ లోకంలో అన్నం తినువదెవడు? ఒకరికి అన్నం పెట్టువాడు మాత్రమే. ఈ నాడు ఈ అతిథికి పెట్టే అన్నమే రేపు నాకు మీకు, మన పితరులకు అన్నంగా తిరిగివస్తుంది, అనంతంగా తిరిగివస్తుంది. ఈనాడు జరుగుతున్న ఈ స్వల్ప అన్నదానం వలన నా పరలోకం- పునర్జన్మ అత్యంత సుందరమయిన రూపం సంతరించుకొంటాయి, మామగారూ! స్వజన వ్యామోహంతో మీ బుద్ధి ఎంతగా భ్రష్టమ యింది! ఆ వృద్ధుని రూపంలో ఇక్కడ మీ కోడలే కూర్చొని అన్నం తింటున్నదని, ఈ వృద్ధుని సంతృప్తిలో సమస్త దేవతల సమస్త మానవుల సంతృప్తి అంతర్లీనంగా వుందనిమాత్రం గ్రహిం చండి, దయచేసి నన్ను వారించకండి." ఆ కోడలు భాగమయిన పేలపిండిని కూడా అరగించిన తరువాత ఆ వృద్ధుని ఆకలినివృత్తి అయింది. వెంటనే అతడు తన సహజ ధర్మదేవతా రూపంలో వారి ముందు ప్రకటమయినాడు. గద్గద కంఠంతో ఆశీర్వదిస్తున్నాడు: "పుణ్యాత్ములారా! మీరు ధన్యులు, మీ వలన ఈ సమస్త సృష్టి ధన్యము. ఈ సృష్టి నెవరు నడిపిస్తున్నారు? మీవంటి ధర్మాత్ములు మాత్రమే. ప్రతి ఒక్క కుటుంబసభ్యుడు తన కర్తవ్యాన్ని నిర్వ

ర్తించాలి. ఈ కర్తవ్య నిర్వహణయే మహాయజ్ఞం—మహాతపం, ఇంకే యజ్ఞాలు—తపాలు దీనికి ఎంతమాత్రం సరిరావు. ఈ ఒక్కొక్కరి కర్తవ్య నిర్వహణం క్షణక్షణం ముల్లోకాల్ని, ముల్లోకవాసుల్ని సృష్టి చేస్తూంటుంది. మీరు మీ కర్తవ్యాల్ని చాల ప్రశంసనీయంగా నిర్వర్తించారు. వాస్తవంలో అదే నాకు చక్కని ఆహారం. ఈ పేలపిండి ఎంతమాత్రం ఆహారం కాదు. ఇప్పుడు మీకు అక్షయంగా ధర్మబలం లభిస్తుంది. ప్రపంచంలో మానవులందరి సుఖాలు మీ దగ్గఱకే చేరుకొంటాయి. వినండి, వాస్తవంలో మీకు దానం వలన వచ్చిన పుణ్యంకన్న దానం పుచ్చుకొనుటవలన నేను అధికంగా అవమానింపబడ్డాను. అస్తు. మీ కుటుంబసభ్యులందరు ఇదిగో, ఈ దేవ విమానం మీద ఇప్పుడే సశరీరంగా వైకుంఠానికి దయచేయండి. మీ సేవలో సమస్త దేవతలు తమ తమ దేవత్వాన్ని వృద్ధి చేసుకొంటారు. దయచేయండి."

అశ్వమేధ యాగ సందర్భంలో ధర్మరాజుకు ముంగిస ఉసక్తుప్రస్థుని కథ చెప్పి, అంటోంది; "ధర్మరాజా! ఆసక్తుప్రస్థుడు అతిథికి పేలపిండి దానం చేసిన జలంలో పొరలాడగా నా అర్ధ శరీరం బంగారమయింది. ధర్మరాజా! లోకంలో ఏ తపస్సులు, యజ్ఞాలు, త్యాగగుణానికి అథవా దానానికి సరిరావని సక్తుప్రస్థుడు నిరూపించాడు. ఆతని త్యాగగుణం ఆతనిని, ఆతని పరివారాన్ని మాత్రమే సశరీరంగా వైకుంఠానికి పంపించి ధన్యుల్ని

చేయలేదు,మావంటి వారినికూడ ఇలాసుందరుల్నిగారూపొందిస్తోంది. లోకంలో ఎవరయినా సుఖాల్నిగానీ, సౌందర్యాన్ని గానీ పొందా లంటే దానం వలననే పొందాలి. ధర్మరాజా! తక్కిన నా యీ అర్ధ శరీరాన్ని కూడా బంగారంలా చేసికొనాలని ఎన్ని యజ్ఞా లకో, ఎన్ని క్షేత్రాలకో వెళ్ళాను. కాని నా ఆశ ఫలించలేదు. నీ ధర్మబుద్ధిని, యజ్ఞ వైభవాన్ని విని ఎంతో ఆశతో వచ్చి, ఇచట అవభృధస్నానం చేశాను, అయినా నా అర్ధ శరీరం బంగారం కాలేదు; ధర్మరాజా: నీ యజ్ఞం అభిమానంతో కూడింది, ఆ దానం కర్తవ్యబుద్ధితో కూడింది, దానిముందు నీ యజ్ఞం తుచ్ఛాతి తుచ్ఛ మని గ్రహించాను. మంచిది వెళ్ళి వస్తాను."



# (14) ధర్మం—జీవితం

"స్వల్ప మప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్."
ధర్మమంటే జీవితం, జీవుడంటేనే ధర్మం. ధర్మాన్ని సేవించే నిమిత్తం మానవ జీవితాన్ని నాలుగు విభాగాలు చేశారు. వానినే ఆశ్రమాలన్నారు. (1) బ్రహ్మచర్యం, (2) గృహస్థం, (3) వానప్రస్థం, (4) సన్యాసం. బ్రహ్మచర్యాన్నంతా మానవుడు గురుసేవలో ధన్యం చేసికొని, సాధ్యమయినంతగా ఇంద్రియ నిగ్రహశక్తిని సంపాదించుకోవాలి. వేదాధికారమున్న బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య వర్ణస్థులు వానిని అధ్యయనం చేయాలి, బ్రహ్మచర్యంలో సంపాదించిన నిగ్రహశక్తితో, ధర్మబద్ధంగా అర్థకామాల్ని అనుభవించటానికి తరువాత మానవుడు గృహస్థు కావాలి. దేవుడిచ్చిన సుఖసామగ్రితో సంతోషిస్తూ, తాను జీవిస్తూ, ఇతరులను జీవింపచేయాలి. తాను ధర్మాత్ముడుగా వుంటూ, తన కుటుంబాన్ని, ఆశ్రితుల్ని ధర్మాత్ములుగా రూపొందించాలి.

గృహస్థాశ్రమ విశేషాలు; గృహ యజమాని ఒకవేళ ధర్మాత్ముడు కాకున్నా, గృహమే ఆతనిని తరింపచేస్తోంది. (1) భార్య చేసిన పుణ్యకార్యాలన్నింటి ఫలం భర్తకే చెందుతుంది. (2) సంతానానికిచేసే ఉపనయన—వివాహాది సంస్కారాలవలన పుణ్యం లభి

స్తోంది. (3) ఆ సమయాలలోని వేదమంత్రాలు——అన్నదానాలు అమితమయిన పుణ్యాన్నిస్తున్నాయి. (4) 'అపుత్రస్య గతిర్నాస్తి' యనుటచే పుత్రులు పుట్టుటవలననే పుణ్యాన్నిస్తున్నారు. (5) కన్యాదానం వలన వచ్చే పుణ్యం అంతా—ఇంతా కాదు, దేవతలు తరిస్తారు, పితృదేవతలు తరిస్తారు. (6) ఈ శుభకార్యాలలో దేవతారాధన జరుగుతోంది గదా? అది మానవున కెంతగానయినా అభ్యుదయ కారణం. (7) దేవర్షి పితృఋణాల్ని ఒక్క గృహస్థు మాత్రమే తీర్చుకొనగలడు. (8) గృహస్థు కేవలం తన పొట్టను మాత్రమే నింపుకొనుటతో తృప్తిచెందరాదు. పశువుల్ని—సోదర మానవుల్నికూడ అన్నాదులచే తృప్తుల్నిచేయాలి. (9) లోకంలో గృహస్థు ఒక్కడే ఇతరాశ్రమాల వారికి ఆధార స్తంభమవుతున్నాడు (10) మానవ శరీరావయవాలలో సమస్త దేవతలు నివసిస్తున్నారు వారిని సాక్షాత్కరింప చేసేది ధర్మానుష్ఠానం ఒక్కటిమాత్రమే. ఆ ధర్మం ఒక్క గృహస్థాశ్రమంలో మాత్రమే పూర్ణత్వాన్ని సంపాదించు కొంటుంది. (11) 'గృహస్థు' అంటే గృహంలో ఉండేవాడని అర్థం. అట్టిగృహం వాస్తుశాస్త్ర ప్రకారం నిర్మింపబడాలి. అప్పుడే ఆ గృహంలో దేవతలు నివసిస్తారు. ఈవిధంగా గృహం కూడా మానవుని తరింపచేస్తోంది. (12) ప్రతి ఆలోచన, ప్రతి ఆచరణ శాస్త్రసమ్మతంగా, స్వార్థ యుక్తం కాకుండా పరార్థ యుక్తంగా ఉండాలి. అట్టి గృహస్థు జీవితమే అఖండ తపం, అద్భుత యజ్ఞం.

ధర్మం పదిమందికి సుఖాన్నిస్తుంది, అధర్మం పదిమందికి దుఃఖాన్నిస్తుంది. ఒక్క ధర్మాత్మునివలన చతుర్దశ భువనాలు సుఖి

స్తాయి. దుర్మార్గుడు ఒక్కనివలన చతుర్దశ భువనాలు దుఃఖిస్తాయి. దుర్భావాలు కేవలం మనసును మాత్రమే ఆశ్రయించి ఉండవు. అవి పంచభూతాలలో లీనమై సమస్త బ్రహ్మాండాలు వ్యాపిస్తాయి. తపస్వులవలన సమస్త దేవతలు ఆనందించి, పైనుండి క్రిందకు దిగివచ్చేవారు. దుర్మార్గులవలన నిలువనీడలేక, సుఖంలేక, కొండ గృహాలలో కాలక్షేపం చేసేవారు. రామరాజ్యంలో శూద్రవర్ణస్థుడయిన శంబుకుడు ధర్మవిరుద్ధంగా తపసు చేశాడు, ఫలితంగా బ్రాహ్మణ బాలుడు అకాలమరణం చెందాడు.

"ధర్మస్య సూక్ష్మాగతిః" ధర్మగతి అత్యంత సూక్ష్మమయినది.

గృహస్థాశ్రమంలో షుమారు 50 సంవత్సరాల వరకు అర్ధ కామాల్ని అనుభవించిన తరువాత మానవుడు వైరాగ్యవంతుడు కావాలి, పరివార వ్యామోహాన్ని. శరీరదృష్టిని తగ్గించుకొని, ఆత్మాభిముఖుడు కావాలి. ఈ ప్రయత్నం నిమిత్తమే వానప్రస్థాశ్రమం ఏర్పడింది. గృహంలోఉండి వానప్రస్థానికి యోగ్యమగు తపసు ఈనాడుకూడ చేసికొన వచ్చును.

సన్యాసమంటే వస్తుస్థితిలో సర్వసంకల్ప సన్యాసం. కర్మ సన్యాసం వలన ఎవరు సన్యాసి కాజాలరు. మనసును నిగ్రహింప లేనివానికి సన్యాసావశ్యకత ఎంతమాత్రంలేదు. తరించగలవాడు ఏ ఆశ్రమంలోనుండి యైన తరించగలడు. ముఖ్యంగా కలికాలంలో సన్యాసాశ్రమ నియమాల్ని పాటించగలగటం చాల కష్టసాధ్యం. అయితే కష్టసాధ్యమయిన ఆ నియమాల్ని ప్రయత్నించి, సాధ్య మయినంతవరకు ధర్మాన్ని రక్షించాలి. ధర్మమేదయినా కష్టసాధ్యం గానే ఉంటుంది గానీ సులభంగా ఎలా ఉంటుంది? ప్రాణత్యాగాని

కయినా సిద్ధమై, ధర్మాన్ని పోషించటంలోనే మానవునకు మానవత్వం సత్యం, దానం–దయ బ్రహ్మచర్యం ఇవన్నీ అత్యంత కష్టసాధ్యాలే. అయితే పాపాచరణం కష్టసాధ్యం కాదా? చోరుడు చౌర్యానికి వెళ్ళితే లాభంవస్తే వస్తుంది, లేదా ప్రాణాలేపోతాయి. ప్రాణత్యాగం ప్రాణి హింసలోగన్న ఒకప్రాణి సుఖం నిమిత్తం జరిగితే అదెంత ఉత్త మం? ధర్మం నిమిత్తం ప్రాణత్యాగం చేయటమన్నది చాలా స్వల్ప విషయమని, అందే మానవజన్మకు సార్ధకతయని పూర్వం ప్రతి ఒక్క రాజర్షి—మహర్షి చాల చక్కగా గ్రహించారు. బుద్ధి జన్మ సహజంగా తద్రూపమయిన కారణంగా పాపాత్మునకు పాపాచరణలో కష్టంలేదు, పైగా అత్యంత ప్రీతియున్నది. అట్లే ధర్మాత్మునకు కూడ ధర్మాచరణలో సహజంగా ప్రీతి ఉంటుంది. పాపాత్ముడు జీవి తంలో ఒక్కసారి సత్యం చెప్పాలంటే చెప్పగలడా? దానం చేయా లంటే చేయగలడా? తోటిప్రాణుల్ని సుఖింపచేయగలడా? ప్రాణం పోయినా ఈ కార్యాల్ని వాడెలా చేయలేడో అలాగే ప్రాణం తీసినా ధర్మాత్ముడు పాపం చేయలేడు. అనిచ్ఛగానయినా ఆతని శరీరం పదిమందిని సుఖింపచేసి తీరుతుంది. ఏశాస్త్రం కూడా ధర్మాన్ని పూర్తిగా ఆచరించటం లేదని, ఆత్మ గుణాలలో లోపమున్నదని మానవుని నరకానికి పంపించటంలేదు. ఏ మానవుడయిన ఒకే జన్మలో, ఒక్కరోజుననే ఎలా సర్వశ్రేష్ట మానవుడు కాగలుగు తాడు? స్వల్పమాత్రంగా నయినా దుర్గుణాల్ని దినదినానికి క్షీణింప చేసికొనటం, సద్గుణాల్ని వృద్ధిచేసికొనటం మానవ కర్తవ్యం. అంతే

శ్లో॥ అనుగంతుం సతాంవర్త్మ కృత్స్నంయది నశక్యతే,
స్వల్పమప్యనుగంతవ్యం మార్గస్థో నావసీదతి॥

(మనుస్మృతి.)

"మానవుడా! మహాపురుషుల జీవితాన్ని పూర్తిగా అనుకరింపలేవా? అయితే స్వల్పంగానయినా అనుకరించుగానీ, పూర్తిగా మాత్రం ఆమార్గాన్ని త్యజించవద్దు"

పురుషునకు జీవితంలో సన్న్యాస మెట్టిదో స్త్రీకి వైధవ్య మట్టిది. ఇరువురూ శిరోముండనం చేయించుకొంటారు, కర్మాధికారాన్ని సూచించే యజ్ఞోపవీతాన్ని, మంగళసూత్రాన్ని త్యజిస్తారు. సుందర వేషాన్ని, రుచికరమగు ఆహారాన్ని త్యజిస్తారు, ప్రపంచ ముఖం చూడరు విషయాలకు, విషయీ పురుషులకు దూరంగా ఉంటారు. ఆత్మానుసంధానానికి, స్వ స్వరూప జ్ఞానాన్ని పొందటానికి జీవితంలో ఇలా చివరిభాగం ప్రత్యేకించబడింది. ఏ మానవునికయినా చివరిరోజులలో భావిప్రగతి దృష్ట్యా శరీర సుఖాపేక్ష నశించటం చాల అవసరంగదా!

పతి గతించిన స్త్రీ ఆహారాన్ని త్యజించి, సుందరవేషాన్ని, సమస్త భోగసామగ్రిని త్యజిస్తుంది, త్యజించాలి. ఇది ఆమె జీవితానికి దేవుడిచ్చిన శాపమా? కాదు?, వరం. పతి గతించాడని, జీవితం సుఖహీనమయిందని శాస్త్రం స్త్రీలను ఆ వైధవ్యదశలో, పురుషులను సన్న్యాసాశ్రమంలో ఏడవమనటం లేదు. శరీర సుఖమే ప్రధానమనుకొంటే వీరికీస్థితి నిస్సంశయంగా శిక్షయే. కాని హిందూ ధర్మం శరీరసుఖాన్ని సుఖమనటంలేదు. శరీరాతీత స్థితిలో మాత్రమే మానవుడు సుఖిస్తాడంటోంది. అది త్రికాల సత్యం. పతి గతించాడంటే ఈభార్య—భర్త మొదలయిన సంబంధాలు కేవలం ఋణవశాన మాత్రమే ప్రాప్తించాయని, శరీరం అనిత్యమని హితోపదేశం చేస్తున్నాడు. కాన స్త్రీ పతిదేవుని అభావంలో శరీర సుఖాల్ని సాధ్యమయి

నంతగా నిరోధించి, ఆత్మభావాన్ని పొందాలి. ఇంద్రియ నిగ్రహంతో ప్రకృతిని స్వాధీనం చేసికొని, గుణాతీత స్థితిలో బ్రహ్మ నిర్వాణాన్ని సాధించాలి. స్త్రీ పురుషులు ప్రీతితో అనుసరించవలసిన ఈ విధానాల్నే శాస్త్రం మానవ సుఖదృష్టితో విధిస్తున్నది. శాస్త్రం-ధర్మం-దైవం-గురువులు-సుఖం అన్న శబ్దరహస్యాలు తెలియని వారికి, తెలియచెప్పినా విశ్వసించలేని ప్రవాహ జీవులకు ఆ విధానాలు బాధాకరంగా వుంటే ఎంతమాత్రం ఆశ్చర్య చెందనక్కరలేదు.

ఇలా ఇంద్రియాల్ని విషయాధీనం కాకుండా రక్షించుకొన్న ధీరుడు, అప్రాకృత రాజ్యంలో ఆత్మవ్యవసాయం చేస్తాడు.

ధర్మం శరీర సుఖాల ననుగ్రహిస్తూ, మానవుని శరీరాతీతుని గావించి, ఆత్మ వ్యవసాయపరుని చేస్తుంది. అయితే ధర్మానికి లక్ష్యం శరీర సుఖాలుకావు. బాలుడు స్కూలునకు వెళ్ళనంటే తల్లిదండ్రులాతనికి మిఠాయి నిమిత్తం రూపాయి ఇస్తారు. ఇచట ప్రధానలక్ష్యం బాలునకు చదువు చెప్పించటంగానీ మిఠాయి తినిపించటం కాదుగదా!

(1) భక్తి; "సమాధిసిద్ధిరీశ్వర ప్రణిధానాత్." (పాతంజల యోగసూత్రాలు—87.) ఈశ్వరునికి ఆత్మార్పణం చేసిన జీవుడు క్రమంగా స్థూల సూక్ష్మకారణ శరీరాతీతుడై, సమాధిస్థ డవుతాడు.

(2) సంధ్యావందనం; "భువనజ్ఞానం సూర్యేసంయమాత్." (పాతంజల యోగసూత్రాలు—21) సూర్యునియందు మనసును నియమిస్తే 14 భువనాలు ఎలా ప్రవర్తిల్లుతున్నాయో జ్ఞానం సిద్ధిస్తుంది, మానవుడు విశ్వస్వరూపుడవుతాడు.

"ఉద్యంతం అ స్తయంతం ఆదిత్యం అభిధ్యాయన్ కుర్వన్ బ్రాహ్మణో విద్వాన్ సకలం భద్రమశ్నుతే."

(శ్రుతి.)

"మానవుడా! సకల శుభాల్ని పొందాలంటే ఉదయా స్తమయ కాలాలలో సూర్యభగవానుని ధ్యానించు."

సూర్యుడు బ్రహ్మాండ ప్రకాశకుడు—నాయకుడు. సూర్యోపాసకుడు కూడ బ్రహ్మాండ ప్రకాశకుడు—నాయకుడు కాగలడు.

"ఓజోసి సహోసి బలమసి భ్రాజోసి దేవానాం ధామనామాసి సర్వమసి సర్వాయుః." సూర్యోపాసన వలన వీర్యం అధోముఖం కాక, ఊర్ధ్వ ముఖమవుతుంది. అదే క్రమంగా ఓజస్సుగా, సహస్సుగా, బలంగా, భ్రాజస్సుగా, దేవధామాలుగా, చివరకు బ్రహ్మగా రూపొందుతుంది. ప్రతి మానవునిలో వీర్యకణాలు నాగ రూపంలో ఉంటాయి, సమస్త శరీరానికి ఆధారంగా ఉంటాయి. అవే మూలాధారంలో కుండలినీ రూపంలో ఉంటాయి. ఈ కుండలినీ సహాయం వలననే సాధకుడు సహస్రారంలో అమృతాన్ని పానం చేస్తున్నాడు.

(3) అగ్ని ఉపాసన;

"ఆరోగ్యం భాస్కరాదిచ్ఛేత్ శ్రియమిచ్ఛేద్ధుతాశనాత్."

(ఆనంద రామాయణం.)

సూర్యుడు ఆరోగ్య మిస్తాడు, అగ్ని ధనమిస్తాడు, అగ్ని జ్ఞాన ధనాన్నికూడ అనుగ్రహిస్తాడు. లౌకిక—పార లౌకిక రాజ్య

ద్వారాల దగ్గఱ అగ్ని ద్వారపాలకుడు. అతని సత్కరింపకుంటే ఆధ్యాత్మిక సుఖం లేనేలేదు. ఇక విషయసుఖాలు మాత్రం ఎలా ఉంటాయి?

శ్లో॥ అనాచారోహిపురుషో లోకేభవతి నిందితః,
దుఃఖభాగీచ సతతం వ్యాధితోఽల్పాయురేవచ॥

(మనుస్మృతి.)

అనాచారువంతుడవశ్యం లోకంచే నిందింపబడుతాడు, దుఃఖంచే, వ్యాధిచే పీడింపబడుతాడు. మరియు అల్పాయుష్కుడుగా నశిస్తాడు.

పాపం తీవ్రమయినపుడది క్రమ క్రమంగా మేధాశక్తిని, శరీరాన్ని భక్షించేస్తుంది.

శ్లో॥ కుర్వన్నేవేహ కర్మాణి జిజీవిషేచ్ఛతం సమాః।
ఏవంత్వయి నాన్యథేతోఽస్తిన కర్మలిప్యతే నరే॥

(ఈశావాస్యోపనిషత్.)

ధర్మ కర్మాలకు జీవితాన్ని అంకితం చేయాలి, నూరు సంవత్సరాలు లోకంలో శరీరధారణ చేయాలి.

"జీవామ శ్శరదశ్శతం—శృణవామ శ్శరదశ్శతం—ప్రభవామ శ్శరద శ్శతం."

(మాధ్యాహ్నిక సంధ్యావందనం.)

"నేను నూరు సంవత్సరాలు జీవించుదును గాక! చెవులతో చక్కగా విందునుగాక! సంతానోత్పత్తి చేయుదునుగాక!" ఇది సంధ్యోపాసకుని హృదయం.



# (15) ధర్మం - సూక్ష్మశరీరం

ధర్మం సూక్ష్మశరీరానికి అంటే మనసుకు సంబంధించింది.

శ్లో॥ ప్రజహాతి యదాకామాన్ సర్వాన్పార్థ! మనోగతాన్,
ఆత్మ న్యేవాత్మనా తుష్టః స్థితప్రజ్ఞ స్తదోచ్యతే॥
(భగవద్గీత అ2-శ్లో 55,)

"ఎవని ఇంద్రియాలు అంతర్ముఖాలో, ఎవనికి విషయాలు భగవత్సంబంధంతో దివ్యమయినాయో, ఎవడు ఆత్మయందే సంతుష్టుడో ఆతడే బ్రాహ్మణ్యుడు, అపర బ్రహ్మ."

శారీరక కర్మల కుండేశక్తి గన్న మనశ్శక్తి చాలగొప్పది. శరీర మనుభవించే సుఖం అత్యల్పం మాత్రమే. సమస్త బ్రహ్మాం డాల్ని తనలోనికి కేంద్రీకరించుకొని స్వప్నావస్థలో మనసు సమస్త బ్రహ్మాండాలకు సంబంధించిన సుఖదుఃఖాల్ని అపారంగా అనుభ విస్తోంది, శరీరం చేయలేని మహత్తర కార్యాన్ని మనసు చేయ గలదు. ఎదుటి వ్యక్తి సుఖింపవలెననిగానీ, దుఃఖింపవలెననిగానీ మనసు బలంగా సంకల్పించిందా, అంతే! ఆ వ్యక్తి సుఖదుఃఖాల్ని అనుభవించి తీరవలసిందే. పురాణకథలలో ఒకరొకరికి వరాలిచ్చి

నట్లుగా, శాపాలిచ్చినట్లుగా అనేక ప్రసంగాలు లభిస్తుంటాయి. మనసు ఆనంద మనుభవించే స్థితిలో నోటినుండి వచ్చే ప్రశంసావచనాల్నే 'వరా' లంటారు. మనసు అపారంగా దుఃఖించే సమయంలో నోటి నుండి వచ్చే పరుష వచనాల్నే 'శాపా'లంటారు. ఇంతే! సాధారణ మానవుల జీవితాలలో కూడ మనస్థ్సితి ననుసరించి వరాలుంటాయి, శాపాలుంటాయి; ఇంక మహాత్ముల విషయం చెప్పవలసిందేముంది! త్రిభువనాలలో వారి సంకల్పానికి, ఆశీర్వచనానికి అసంభవమనేదే లేదు.

ధర్మం సమస్త బ్రహ్మాండాల్ని, దేవతల్ని మానవశరీరం లోనికే ఆకర్షిస్తుంది. మానవశరీరంలోనే అప్రకటంగా ఉన్న పైవారిని ప్రకటం చేస్తుంది. మానవుని ఆత్మారాముని చేస్తుంది.

"స్వల్ప మప్యస్య ధర్మస్య త్రాయతే మహతోభయాత్,"

అన్నం నుండి జన్మించే సంకల్ప వికల్పాత్మక శక్తిని మన సంటారు. పంచ జ్ఞానేంద్రియాలకు శబ్ద స్పర్శ రూప రస గంధ విషయాలు ఆహారాలు. ఆహారమంటే పోషించే పదార్థం. కనులకు చూచుట, చెవులకు వినుట, ముక్కునకు వాసన చూచుట ఇలా ఆయా ఇంద్రియాలకు ఆ విషయాలు ఆహారాలు. ఇంద్రియాలకు విషయ సంసేవనం అనివార్య ధర్మం. ఈ ధర్మం లేకుంటే ఆ ఇంద్రియాలు లేనేలేవు. అలాగే జీవికి కూడ అనివార్య ధర్మ మున్నది, ఏ ఇంద్రి యానికి ఏ విషయాన్ని ఎంత ప్రమాణంలో అందించాలో, ఏ విష యాన్ని మాత్రమే ఆహారంగా అందించాలో సదసద్వివేక జ్ఞానం జీవికి ధర్మం. ధర్మవిరుద్ధంగా ఇంద్రియాలకు విషయాల్ని ఆహా

రంగా చేస్తే అందువలన మనోవాక్కాయాలు పోషింపబడవు. బల హీనాలయి, అంతరిస్తాయి. ఇంద్రియాలకు విషయాలతో పాటుగా, ధర్మకర్మల్ని, ఈశ్వరుని కూడా ఆహారంగా అందించాలి. ఇంద్రియాల్ని వానిని లోనవుండి నడిపిస్తున్న ఈశ్వరుని దగ్గరకు తీసికొని వెళ్లాలి. అంటే ప్రహ్లాదుని వలె, గోపికలవలె సమస్తేంద్రియాలకు ఈశ్వర సేవాధర్మంతో ప్రేమరసరూపమియ్యాలి. రసవారిధి ఈ శ్యామ గోపాలుడు, కాన ప్రేమరసాన్ని, భక్తిరసాన్ని, శ్యామ రసాన్ని నిరంతర ఆస్వాదిస్తూ మానవులు ఆపాదమస్తకం రస స్వరూపులు కావాలి, ఇదే మానవ జన్మకు పరమ ధర్మం.

శ్లో॥ తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీత మత్పరః,
వశేహి యస్యేంద్రియాణి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా॥
(భగవద్గీత అ2-శ్లో 61.)

"అర్జునా ! అర్జునా !! ఈ విషయాలు మనసును-బుద్ధిని సర్వ నాశనం చేస్తున్నాయయ్యా, (అ2-శ్లో 60) కాన వానిని నిగ్రహించాలయ్యా ! నీమాట వినని కన్ను నీకన్ను ఎలా అవుతుంది. చెవి నీచెవి ఎలా అవుతుంది, చేతులు నీచేతులు ఎలా అవుతాయి ? కన్నులు నీవు చెప్పిన దృశ్యాల్ని మాత్రమే చూడాలి. జిహ్వ నీవు తినమన్న ఆహారాన్ని మాత్రమే తినాలి, చేయి నీవు చెప్పిన పనిని మాత్రమే చేయాలి. సమస్తేంద్రియాలు నీమాటను వినితీరాలి. లేకుంటే ఈ శరీరం నీ శరీరం ఎలా అవుతుంది ? ఇంద్రియాలు నీమాట వినుటలేదు. నీదికాని ఈ అవిధేయంగా వుండే శరీరాన్ని

'నీది' అని ఆసక్తి చెందావా? ఈ పరివారం 'నాది' అని ఆసక్తుడవయినావా, అంతకు మించిన బుద్ధినాశము, దుఃఖకారణము ఈ సృష్టిలో ఇంకేముంటుందయ్యా అర్జునా! కాన ఇంద్రియాల్ని నిగ్రహించు. ఆ తరువాత వానిని చక్కగా నాయందు లీనంచేయి. నీ మనోబలం - ఆత్మబలం — దేహబలం-దైవబలం అపరిమితంగా వృద్ధి అవుతాయి, సుఖిస్తావు."

ఆనందం విషయాలలో లేదని, అది ఆత్మలో వున్నదని, స్వస్వరూపమేనని గ్రహించువారు కొద్దిమంది మాత్రమే ఉంటారు, అందువలననే సుఖించాలని అందరు నిర్విరామంగా ప్రయత్నిస్తున్నారు కాని సుఖించేవారు మాత్రం అల్పసంఖ్యాకులుగానే ఉంటున్నారు. మానవుడా! పొట్ట నిమిత్తం అధికంగా బాధపడవద్దు. అది విధి లిఖితమై ఉండనే ఉంది. భార్యాబిడ్డల నిమిత్తం అధికంగా బాధ పడవద్దు. వారు ఋణవశాన ఇలా ప్రాప్తించి, కపటప్రేమ నటిస్తున్నారు, మోసపోకు! శరీరం చక్కగా ఉండగానే ధర్మం చేసికో, దీపముండగానే ఇల్లు తిర్చిదిద్దుకో, సుఖిస్తావు. ఇక నీ ఇష్టం.

స్వల్పమయినప్పటికి ధర్మం ఆత్మ వ్యవసాయం ద్వారా జీవుని మహద్భయం నుండి రక్షిస్తోంది. ప్రకృతి క్షేత్రం - శరీరం సాధనం, అంటే నాగలి. ముందు దీనితో ప్రకృతి క్షేత్రాన్ని సాగు చేయాలి. అసద్భావనలు - అసత్కర్మలనే కలుపు మొక్కల్ని తీసేయాలి. సత్కర్మలనే బీజాల్ని స్థాపించాలి. ఇంద్రియ నిగ్రహ రూపమయిన కృషి చేయాలి. ఎంత మానవుడు కృషిచేసినా దైవానుగ్రహం లేకుంటే పంట పండదు. దైవ కృపయనే జలం అత్యంతావశ్యకం. హృదయాకాశాన అరిషడ్వర్గాలనే పక్షులు విహరిస్తూ,

పంటను పొట్టపెట్టుకొంటాయి, వాని బారినుండి పంటను రక్షించాలి. పంటకు నలువైపులా సరిహద్దు నేర్పరచాలి. లేకుంటే పశువులు పైరును ధ్వంసం చేస్తాయి. ఆత్మవ్యవసాయాన్ని ధ్వంసంచేసే పశువులు దుర్జనులు. వారి బారినుండి రక్షించే సరిహద్దు బ్రహ్మచర్యం. పంటకు పురుగులు పట్టకుండా జాగ్రత్త వహించాలి. అలాగే ఆత్మ వ్యవసాయంలో అణిమాద్యష్ట సిద్ధులకు ఎంతమాత్రం వశం కారాదు. భూస్వామి స్వయంగా వ్యవసాయం చేసికొనక సోమరియై భూమిని కౌలుకిస్తే పండిన పంట పండినట్లుగా చేజిక్కదు. అందువలన స్వంతగానే వ్యవసాయం చేసికోవాలి. సాధకుడు కూడ సోమరియై ప్రకృతి క్షేత్రాన్ని స్వయంగా సాగుచేయక అరిషడ్వర్గాలకు కౌలుకిస్తే చివరకు సర్వనాశనమవుతాడు. మంత్రజపం-ఆచార్య కృప ఆధారంగా వుంటేగానీ భూమాత తనలోని సంపదను ప్రకటం చేయదు. అవి అత్యంతావశ్యకాలు. నవద్వారాల్ని చక్కగా నిరోధించిన గానీ ఆ దైవకృప అనే వర్ష జలం సరిగా హృదయ క్షేత్రానికి ప్రవహింపదు. నవద్వారాలు బహిర్ముఖంగా ఉంటే ఆ వర్ష జలం బహిరంగమయి వ్యర్థమవుతుంది, ఫలప్రదం కాదు. ఈ విధంగా భూస్వామి అన్ని నియమాల్ని పాటిస్తేనే, చివరకు జ్ఞానమనే పంట పండుతుంది. పండిన పంటను తూర్పారబెట్టాలి, అనవసర భాగాన్ని త్యజించాలి. ఇలాగే జ్ఞానమనే ధాన్యాన్ని విశుద్ధం-నిష్కల్మషం చేసికోవాలి. కేవలం ధాన్యం - ఇంటికి చేరినంత మాత్రాన పొట్టలు నిండుతవా ? నిండవు. ధాన్యాన్ని దంచాలి. చివరకు అ గింజలను వండాలి. అప్పుడే అన్నం సిద్ధమై, ఆకలిని తీర్చగలుగుతుంది. ఇలాగే జ్ఞానాన్ని మధించాలి, లేదా దంచాలి. అప్పుడు సచ్చిదానంద స్వరూపమందు ప్రేమ ఉదయిస్తుంది. ఆ ప్రేమ రసరూపం. ఒక్క ప్రేమరసం లేక భక్తిరసం మాత్రమే

జీవుల్ని భవతాప ముక్తుల్నిచేసి. మరల పతనం కాకుండా వారిని శాశ్వతంగా పరమాత్మ అంగఅందగ్గర పశువులుగా కట్టిపడేస్తుంది. ఆ ప్రేమరసం ప్రాప్తించనంతవరకు భూస్వామిని మరియు ఇచట సాధకుని నవరంధ్ర శరీరం నానా రకాలుగా బాధిస్తూనే వుంటుంది.

(భగవద్గీత అ2-శ్లో 59)



# (16) ధర్మం -
# "కర్మణ్యేవాధికారస్తే"

శ్లో॥ కర్మణ్యేవాధికారస్తే మాఫలేషుకదాచన,
మాకర్మ ఫలహేతు ర్భూర్మాతే సంగోస్త్వ కర్మణి॥

(భగవద్గీత అ2-శ్లో 47.)

"నరుడా కర్మచేయడానికే నీవు జన్మించావు. జన్మించావు గనుక, మరల జన్మిస్తావు గనుక, నరుడా! నీవీయుద్ధం చేసితీరవల సిందే. కర్తవ్య కర్మను నిర్వర్తించటమేగానీ ఫలితాన్ని గురించి, ఆలోచించే అధికారం నీకులేదు. పరిణామం నీ మనసుకు భిన్నంగా ఉన్నా కర్తవ్య బుద్ధితో కర్మ నాచరించి తీరవలసిందే. మనసు పక్వం కానంతవరకు, విషయాసక్తంగా ఉంటున్నంతవరకు శరీ రంతో కర్మల్ని నిస్వార్థంగా ఆచరించి తీరాలి. అప్పుడు ఆ కర్మ యోగమవుతుంది, యజ్ఞమవుతుంది. విషయసుఖాలనుభవించాలి, కర్మమాత్రం చేయకూడదు అని ఎవరు భావిస్తారో, అర్జునా ! వారు మిధ్యాచారులు, (భగవద్గీత అ3-శ్లో॥ 6.) ఎవరిదగ్గర వాసన-కర్మ రెండూ ఉంటాయో వారు సాధారణ జీవులు, వాసన లేకుండా కర్మ

ఎవరిదగ్గర ఉంటుందో వారు ఉత్తములు. కర్మచేస్తూకూడా అతీతంగా అకర్మణ్యత్వ స్థితిలో ఎవరుంటారో వారు మహాపురుషులు. కర్మ చేసితీరాలన్న నియమం వారికుండదు. వారి సమస్త కర్మలు భగవదర్పితాలుగా ఉంటాయి. వారు నన్నే అనన్యరక్షకునిగా, అనన్య పోషకునిగా, అనన్యాశయునిగా, అనన్యాధారంగా, సర్వస్వంగా భావించి, శరణాగతులవుతుంటారు. "చేయించేవాడు ఈశ్వరుడే. మాకు కర్తృత్వం లే"దని ఉచ్చకోటికి చెందిన శరణాగతులు ప్రగాఢంగా విశ్వసిస్తారు. అట్టివారు ప్రమాదవశానకూడ ఎప్పుడూ పాప ప్రవృత్తులుకారు, ఈశ్వరుడు పాపం చేయించడుగదా! పాపమే చేయించేటట్లయితే ఆ ఫలితాన్ని ఈశ్వరుడనుభవిస్తాడా? జీవుడనుభవిస్తాడా? "నాదత్తే కస్య చిత్పాపం నచైవం సుకృతం విభుః." జీవుల పాపపుణ్యాలతో ఈశ్వరున కెంత్రమాత్రం సంబంధం లేదు. పై శరణాగతుల మాటను సాధారణ మానవుడే గనుక వల్లిస్తున్నట్లయితే వెంటనే అతనిని మహాపాపాత్మునిగా గుర్తించి తీరాలి. చేసిన పాపపుణ్యాలకు నిస్సంశయంగా జీవుడే అవశ్యం సుఖదుఃఖాలనుభవించితీరాలి. ఎవరి కర్మకు వారుగాక మరొకరు కర్తలెలా అవుతారు? అయితే కర్మ చేసికూడా సుఖదుఃఖాల్ని పొందకుండా ఉండాలంటే జీవుడు అసంగుడు కావాలి. అర్జునా! "కర్మ చేయననే" అధికారం నీకు లేదయ్యా? "నహి కశ్చిత్ క్షణమపి జాతుతిష్ఠత్యకర్మకృత్" ప్రకృతికి వివశుడై మానవుడు ఒక్క క్షణంకూడా ఉపరతుడుగాక నిరంతరం ప్రవృత్తుడవుతున్నాడు."

శ్లో॥ నకర్తృత్వం నకర్మాణి లోకస్య సృజతి ప్రభుః,
నకర్మ ఫల సంయోగం స్వభావస్తు ప్రవర్తతే॥
(భగవద్గీత అ:5–శ్లో 14.)

"ఆత్మకు – భగవంతునకు కర్తృత్వం లేదు. కర్మతో సంబంధం లేదు. కర్మ తనఫలాన్ని అవశ్యం సహజంగానే ప్రకటం చేసితీరుతుంది. దానిలో భగవంతున కెంతమాత్రం సంబంధంలేదు. అంతా "స్వభావస్తు ప్రవర్తతే." స్వభావానికి వివశమై ప్రవర్తిల్లు తోంది."

"నేను పరమానంద మనుభవించు చున్నాను."

ఈ అందరిచే చెప్పబడుచున్న 'నేనే' 'భగవంతుడు' వారనుభవిస్తున్నామంటున్న ఆ 'ఆనంద'మేదో అదే 'భగవంతుడు.' ఆ భగవంతుడే లేకుంటే సుఖంలేదు, సుఖించేవారులేరు, సుఖిస్తున్నా మన్నస్ఫూర్తి కూడ లేదు, ఆ భగవంతు డెక్కడనుండి వచ్చాడు ? "నేను"–'ఆనందం'; కర్త–కర్మ" ఎక్కడనుండి వచ్చాయి ? సమాధానం క్రియ. అంతే, "స్వభావస్తు ప్రవర్తతే."

కర్తవ్య కర్మల్ని నిర్వర్తించే నిమిత్తమే భగవంతుడు శరీరాన్నిచ్చి, జీవుని ఈ లోకానికి పంపాడు. ఈ శరీరం, ప్రకృతి, ద్రవ్యం, సుఖాలు వాస్తవంలో ఇవేవీ మానవునికి స్వంతంకావు. భగవద్దత్తమయిన వస్తువుల్ని భగవదర్పణం చేస్తూ, సమబుద్ధితో శారీరక కర్మల్ని నిర్వర్తించక మానవుడు పైవాని నన్నింటి యందు 'నాది–నాది' యని మమత్వాన్ని స్థాపించుకొంటున్నాడు, కర్తవ్యాన్ని విస్మరిస్తున్నాడు. ఫలితంగా ఆతడొక్కడు మాత్రమే

దుఃఖించటంలేదు, సమస్త జీవులు దుఃఖిస్తున్నాయి, ఎంత భగవ దపచారం! ఇదెంత అక్షమ్యాపరాధం!!

సమస్త క్రియాకలాపాలు ఊయలలు, ఊయల ముందుకు వస్తూ, వెనుకను వెళుతుంటుంది. ఆ ఊయలకేమిటి ఆధారం? ఏమిటి లక్ష్యం? చెట్టుకొమ్మ, ముందునకు వచ్చినా, వెనుకకు వెళ్ళినా ఆ ఊయల చెట్టుకొమ్మ ఆధారంగా సమానస్థితిని పొంది తీరుతుంది. ఆ చెట్టుకొమ్మయే భగవంతుడు, త్రాడు అవిద్య, సమానస్థితియే యోగం, భగవదాధారం లేకుంటే ఈ జీవులకు సంకల్పం-చలనం-క్రియాశీలత ఏమేలేవు. (భగవద్గీత అ2-శ్లో-48.) కాన ఈ సమస్త కర్మల్ని భగవదర్పణం చేయాలి. (భగవద్గీత అ2-శ్లో 61.)

"ఏపని చేయకుండ మానవుడూరక కూర్చోలేడు. కాన ఆ చేసేది నిష్కామకర్మ చేయాలనియా సారోపదేశం?" అవును, సమస్త భౌతిక ద్రవ్యం, చివరకు శరీరంకూడ నీదికానప్పుడు నిష్కామకర్మగాక సకామకర్మ ఎలా చేయిగలుగుతావు? నీకవసర మయిన వాని నన్నింటిని భగవంతుడు అడుగకముందే అనుగ్ర హిస్తున్నాడు. ఇది సృష్టిలో సహజం. ఇంక సకామోపాసన చేయ వలసిన అవసరమేముంది? ఒక్కటే కామం, ధర్మప్రభువు కావాలి, ఆయన ప్రేమ కావాలి. అంతే, అప్పుడు తక్కిన సమస్తం నీవి లోనికే వచ్చి చేరుతాయి.

ప్రతి మానవుడు పుణ్యఫలం సుఖం కావాలనుకొంటాడు, పుణ్యం చేయడు. పాపఫలం దుఃఖం కావాలనుకోడు; పాపమే చేస్తాడు.

ఒక్కొక్క మానవుడు మంచి చేయాలనుకొంటాడు. అయినా చేయలేడు? ఏమిటి కారణం? ఈశ్వరుడా? కాదు, కారణం మనసు, ఇంద్రియాల్ని నడిపించే యంత్రం మనసు చెడిపోయింది. ఇది యంత్రంలో లోపం. దీన్ని బాగుచేసికోవాలి. అంతేగానీ వ్యర్థంగా ఈశ్వరుని నిందించకూడదు. సుఖం వచ్చినప్పుడు మానవుడు అంతా స్వప్రయోజకత్వమంటాడు. మరి దుఃఖ వచ్చినప్పుడు మాత్రమే ఎందుకు ఈశ్వరుని నిందిస్తాడు. దాన్నికూడా 'స్వప్రయోజకత్వ' మనియే అనుకొంటే ఎంతో బాగుంటుంది గదా!

శ్లో॥ కామ ఏష క్రోధ ఏష రజోగుణ సముద్భవః
మహాశనో మహాపాప్మా విద్ధ్యేన మిహవైరిణామ్॥

(భగవద్గీత. అ3-శ్లో 37.)

"అర్జునా! మనసు కామక్రోధాలతో నిండివుంటుంది. రజోగుణంవల్ల కామక్రోధాలు జన్మిస్తాయి. వానిలో కామానికి చాలా పెద్దపొట్ట ఉంది. ఎంత ఆహారం అందించినా దానికి తృప్తిలేదు. ఆజ్యం పోస్తుంటే అగ్నివలె, ఆహారం అందిస్తున్న కొద్దీ కామం వృద్ధి అవుతుంటుంది, సమస్త పాపాలకు కారణం రెండవది ఆ క్రోధం. అర్జునా! ఈ రెండింటిని శత్రువులుగా గుర్తించి, జాగ్రత్తగా జీవించు!"

కామం వలన రాగం, క్రోధం వలన ద్వేషం రూపు దాలుస్తాయి. మహాకాముకునకు ప్రపంచమంతా కామినీమయంగా గోచరిస్తూంది. ఆతనికి కామినిగాక వేరొండు ప్రపంచమే కానరాదు. ఈ విధంగా కామం రాగాన్ని ఉత్పన్నంచేసి, మానవుని అంధునిచేసి నశింపచేస్తోంది.

ద్వేషంకూడ ఇటువంటిదే. లంకలోని రాక్షసులపై వీర హనుమానుడు ద్వేషం వహించాడు. ఫలితంగా అశోక వాటికలోని పుష్పాలన్నీ ఎఱ్ఱగా కనుపించాయి. ద్వేషం ప్రపంచ స్వరూపాన్నే మార్చేస్తుంది. అది ఎదుటి వ్యక్తిని దహిస్తుందా? ఏమో? సందేహమే. ముందు జన్మస్థానాన్ని, దహిస్తుందనటంలో, ద్వేషం వహించిన వ్యక్తియే ముందుగా నశిస్తాడనటంలో మాత్రం ఎట్టి సందేహం లేదు.

శ్లో॥ రాగద్వేష వియుక్తైస్తు విషయా నింద్రియైశ్చరన్,
ఆత్మవశ్యై ర్విధేయాత్మా ప్రసాద మధి గచ్ఛతి॥

(భగవద్గీత. అ2–శ్లో 64.)

"రాగద్వేషాలు లేని అంతఃకరణంతో విషయాల్ని అనుభవించాలి. కామక్రోధాలుండవచ్చును, కానీ యవి స్వాధీనంగా ఉండాలి. జీవుడు ఆత్మశక్తికి అవిధేయుడుగా కాక విధేయుడుగా ఉండాలి. అప్పుడే ప్రసాద గుణాన్ని పొంది శాంతుడవుతాడు."

# (17) ధర్మం - రాగద్వేషాలు

మనసు మంచిదయిన, రాగద్వేష రహితమయిన ఆ శరీరంతో జరిగే ప్రతికర్మ వ్యక్తి కళ్యాణంతోపాటుగా విశ్వకళ్యాణాన్ని సిద్ధింపచేస్తుంది. ఇతరుల ఏ గుణాల వలన నీవు దుఃఖిస్తావో ఆ గుణాలే నీతో ఉంటే నీవలన ఇతరులు దుఃఖించరా? కాన కర్మ రాగద్వేష రహితంగా ఉండితీరాలి. ఇట్టి 'నీకర్మ' ఎందరికో సద్బుద్ధి ననుగ్రహిస్తుంది.

పద్మావతీ జయదేవులకు పరిణయమయింది. నూతన వధూవరులు పసుపు బట్టలతో, అపరిమితమయిన పెండ్లి కానుకలతో ఘోరారణ్యాల మార్గంగా పాలకీలలో పయనిస్తున్నారు. విధి విలాసం। వధూవరుల దురదృష్టం!! నల్వురు దొంగలు దాపురించి జయదేవుల కాళ్ళు—చేతులు అమానుషంగా తీసేశి, ఒక పాడుబడిన బావిలో పడేశారు, పాలకీలలోని ధనాన్నంతా దొంగిలించి పలాయనం చిత్తగించారు.

మన జయదేవులు షట్శాస్త్ర పండితులు. అతి దరిద్రులు, పైగా ఇప్పుడే అంగవైకల్యం. లోకంలో హృదయమున్నవానికి

సరయిన శరీరం - శరీర సుఖాలు ఉండవని వారు నిరూపిస్తున్నారు. బాధతో నిట్టూర్పులు విడుస్తూ, నిదానంగా మూలుగుతున్నారు. ఏ దురదృష్టం ఇంతటి పండితుని ఇంత నిర్దాక్షిణ్యంగా ఇలా తన కబంధ హస్తాలకు గురిచేసికొన్నదో, ఆ దురదృష్టానికి మృత్యువు దాపురించింది, జయదేవుల భాగ్యం జన్మ ధరించింది. దురదృష్టం లోనే కొంత-కొంత అదృష్టం రూపురేఖలు సంతరించుకొంటోంది. శాస్త్రాలు అదృష్టాన్నే దైవమంటున్నాయి. ఆ దేశం రాజుగారు సైన్య సమేతంగా వనవిహారానికి వచ్చి జయదేవుల దుఃఖగీతాన్ని విన్నారు. జయదేవులు అపర సదాశివులుగా రాజుగారికి దర్శన మిచ్చారు. అంతే! జయదేవులకు ఆస్థాన విద్వాంస పదవి లభించింది. ఆస్థానంలో ప్రవేశింపగనే జయదేవులు యోచించారు; "జీవితంలో నాకెట్లో సుఖంలేదు. ఈ కంటి ముందటి వ్యక్తులయినా కడుపునిండా తిని, కంటినిండా నిదురపోవాలి." వెంటనే ధర్మఘంట ప్రయోగింప బడింది. ప్రతిదినం దివ్యంగా అన్నదానం జరుగటానికి మహారాజు ఏర్పాట్లు చేశాడు, ఎంతమంది ఎన్ని సంవత్సరాలున్నా సరే, రాజాస్థానంలో చక్కగా అన్నం లభిస్తుండేది. క్రమంగా రాజుగారికి, అన్నదానానికి మంచిపేరు వచ్చింది. ఈ విషయం తెలిసి ఆ దొంగలు కూడ వచ్చారు. రాజాస్థానంలో అవిటివాడయిన జయదేవుల్ని చూచి, నిర్ఘాంతపోయారు. జయదేవులు మహారాజును శాసిస్తున్నారు; "మహారాజా! ఈ నల్వురు పూర్వం నాకెంతో ఉపకారం చేశారు. నేను చేసిన అక్షమ్యాపరాధానికి పూర్వం నాకు ఉరిశిక్ష విధింప బడింది. అయినా వీరు దయార్ద్ర హృదయులై, కాళ్ళు - చేతులు మాత్రం తీసేసి నాకు ప్రాణభిక్ష పెట్టారు. మహారాజా! వీరికి జీవితాంతం మన ఆస్థానంలో స్థానం లభించాలి, నావలె వీరికి గౌరవం

జరుగాలి, "సుఖేషు దుఃఖేషునకో౽పిదాతా." ఈ లోకంలో ఎవరును ఎవరికిని సుఖాన్నిగానీ, దుఃఖాన్నిగానీ ఈయరు. నా దుష్కర్మమున నేనిలా దుఃఖిస్తున్నాను. ఇప్పటికయినా నేను వీరి రుణాన్ని తీర్చు కొనకుంటే నాకు భవిష్యత్తే ఉండదు. మహారాజా! వెంటనే వీరికి స్వాగతం చెప్పు."

దొంగలు నల్వురకు ఆస్థానంలో ఆరు నెలలు ఘనమయిన ఆతిధ్యం లభించింది. ఆ రాజాన్నం అతి విచిత్రంగా వారి మనసులను శుద్ధిచేసింది. "కాళ్ళు-చేతులు తీసేసిన వ్యక్తి కోమల హృదయంతో మనకు అన్నం పెట్టిస్తుంటే, తిని, ఆనందించే మన జన్మ ఏంజన్మ?" కన్నీటితో, కంపించే శరీరంతో దొంగలు నల్వురు మహారాజు కాళ్ళపై పడ్డారు; గద్గద కంఠంతో తమ క్రౌర్యాన్ని నివేదించారు.

ఒక్క క్షణం మహారాజు బొమ్మవలె నిలిచిపోయాడు. నిలువెల్లా ఏదో అతీతశక్తి సంచరిస్తున్నట్లయినది. అంతే! ఒడలెరుగని దివ్యోన్మాదంతో పరుగుదీశి, జయదేవులను తన ప్రేమపాశంతో బంధించేశాడు, అంటున్నాడు; "మహాత్మా! నిజంగా మీరు రాగద్వేషాలకు అతీతమగు మధుర మూర్తులు. ఈ లోకంలో చరించవలసినవారు కానేకారు. వీరు చేసిన రాక్షసకృత్యానికి ఈ దొంగలను ఉరితీయించినా ఏం తప్పులేదు, కానీ అందువలన ఏమిటి లాభం? కోమల హృదయంతో ఈ కిరాతకుల గుండెలను కదలించి, కంట తడి పెట్టించి, మీరు వీరిని సత్పురుషులుగా రూపొందించారు. ఇంత దురవస్థకు గురిచేసిన వారిని ఎంతగానో సత్కరింపచేశారు. రాగద్వేషాలకు అతీతమగు మీ అమృత హృదయం ఈ దొంగల్ని,

నన్ను, నా ప్రజల్ని కృతకృత్యుల్ని చేసింది, మహాత్మా! మీకు ఎలా కృతజ్ఞతలు చెప్పుకొనగలను?"

అదే సమయంలో ధర్మఘంట మ్రోగింది; "కర్తవ్య కర్మలు చేసితీరాలి, నిస్స్వార్థంగా చేయాలి, వివేకంతో చేయాలి. ఒకవేళ నిస్స్వార్థం - వివేకం నీ కర్మలలో లేకున్నా రాగద్వేషాలు రెండూ మాత్రం లేకుండినట్లయితే అట్టికర్మ వ్యక్తి కళ్యాణంతోపాటుగా విశ్వ కళ్యాణాన్ని సిద్ధింప చేసేతీరుతుంది."

శ్లో॥ యఃసర్వత్రా నభిస్నేహస్తత్ త్ప్రాప్య శుభాశుభం,
నాభీనందతి నద్వేష్టి తస్య ప్రజ్ఞా ప్రతిష్టితా॥
(భగవద్గీత అ2-శ్లో 57.)

"ద్వేషం త్యజించతగ్గది. అలాగే దానితోపాటుగా స్నేహం కూడా త్యజించదగ్గదే. సజ్జనునకు శత్రువులుండరు, మిత్రులుకూడ ఉండరు. ఒకరియందు మనసు విశేషంగా ఆసక్తమయినదంటే ఫలితంగా భవిష్యత్తులో ఆ మనసు దుఃఖించి తీరుతుంది. స్నేహం-ద్వేషం, రెండూ బుద్ధిని భ్రష్టంచేసి, మానవుని దానవునిగా రూపొందిస్తాయి. కాన వీనిని త్యజించాలి, అనాసక్తుడుగా సజ్జనుడు జీవించాలి. ఇష్టమయిన వస్తువు ప్రాప్తించినప్పుడు హర్షాన్నిగానీ, అయిష్ట వస్తువు ప్రాప్తించినప్పుడు ద్వేషాన్నిగానీ ఎవడు పొందడో వాని బుద్ధి మాత్రమే సద్బుద్ధిగా, అట్టివాడు మాత్రమే సుఖవంతుడుగా నిర్ణయింపబడుచున్నాడు."

నల్వురు దొంగల మనసూ ఘంటవలె మ్రోగింది; "జయదేవులు నిజంగా స్థిత ప్రజ్ఞులు, జయదేవ పండిత శిరోమణికి జై!"

"మనసు మంచిదయిన చాలదా? శరీరంతో కర్మచేయనేల?" ఇలా ప్రశ్నించేవాడు నిస్సంశయంగా మహాపాపాత్ముడు, రహస్యంగా పాపాలు చేసేవాడు. మనసు మంచిదయితే ఆ మంచి శరీరం ద్వారా వ్యక్తమయి తీరుతుంది. ఒకనాటి సత్కర్మల వలననే ఇంత సర్వాంగ సుందర శరీరం లభించింది. మరల ఇటువంటి శరీరమే కావాలనుకొనేవారు తప్పక ఈ శరీరంతో సత్కర్మలు చేసితీరాలి. సుఖంగానీ, సుందర రూపంగానీ, కీర్తిగానీ సత్కర్మలు లేకుంటే లభింపనే లభింపవు.

ప్రశ్న :- ధర్మాచరణకు భగవానుడు మనకు పూర్వజన్మ జ్ఞానమిచ్చిన ఎంత బాగుండేది? అయ్యో! ఆపనిచేశాం, ఇలా పుట్టాం, కనుక ఇకనైన సత్కార్యాలు చేయాలి. ఈ జ్ఞానముంటే ఎంత బాగుండేది?

బాగానే ఉండేది. చేసిన పాపాలన్నీ స్మరణలో ఉంటే మానవులు జీవించగలరా? పునర్జన్మ జ్ఞానముంటేచాలు మానవుడు బాగుపడి తీరుతాడు. "అయ్యో! నా కనులముందు నా తండ్రి దేహ త్యాగం చేశాడు, నేనుకూడ ఇంతేగదా! నిన్నటి వ్యక్తి ఈలోకంలో నేడు లేడు, నిన్న లేనివ్యక్తి నేడున్నాడు. ఏమిటీ విచిత్రం ? ఒకడు పుట్టుకతోనే సమస్త సుఖ సంపన్నుడు, వేరొకడు రోగి, మరొకడు అంధుడు, ఇంకొకడు దరిద్రుడు. సృష్టిలో ఎందులకిన్ని జీవాలున్నాయి? రేపు నేను ఈ జీవాలవలె ఎందుకు కాకూడదు? సృష్టిలోని హృదయ విదారకమయిన ఈ వైవిధ్యానికి కారణం ఏమిటి? మానవుడా! ఈ విషయంపై ఎప్పుడైనా ఆలోచించావా?

ఆలోచించిచూడు. పునర్జన్మ సమస్త సుఖ సంపన్నంగా ఉండాలంటే వెంటనే ధర్మప్రవృత్తుడవు కా!

కర్మం-ధర్మం-జన్మం. ఈ మూడింటి సంయోగ స్వరూపమే హిందూమతం.

పాపపుణ్యాలు బలీయంగా ఉన్నంతవరకు మానవుడు ధర్మ ప్రవృత్తుడు కాలేడు. పాపపుణ్య రూపమయిన సంస్కార బీజాలు చక్రవత్ అంతఃకరణంలో పరిభ్రమిస్తుంటాయి.

శ్లో॥ ఏషాం ఏయాని కర్మాణి ప్రాక్సృష్ట్యాం ప్రతిపేదిరే,
తాన్యేవ ప్రతిపాద్యంతే సృజ్యమానాః పునః పునః॥
(మహాభారతం – శాంతిపర్వం.)

ప్రళయకాలంలో కూడ ఈ సంస్కార బీజాలు జీవుని యందు నిహితాలయి, సృష్టి ప్రారంభంలో పునః పునః అంకురిస్తుంటాయి.

శ్లో॥ పాపం కర్మఫలం కించిత్ యది తస్మిన్నహిదృశ్యతే.
నృపతే తస్య పుత్రేషు పౌత్రేష్వపిచనప్తృషు॥
(మహాభారతం – శాంతిపర్వం.)

ఇంతేకాదు. పాపం తీవ్రమయినప్పుడది ఆ పాప శరీరం నుండి పుత్ర పౌత్రులకు, బంధువులకు కూడ సంక్రమిస్తుంది.

ఈ పాప పుణ్యాల్ని రూపుమాపటం ఎలా? ఇందుకే గౌతముడు తన ధర్మ సూత్రాలలో నలుబది సంస్కారాల్ని చెప్పాడు. ఈ సంస్కారాలతో మనసు – శరీరాన్ని సంస్కరింపక నరుడు మోక్ష ప్రయత్నం చేయనేరాదు.

---

# (18) ధర్మం - షోడశసంస్కారాలు

మనసులోని మలం నశించాలంటే కర్మ జరుగాలి, విక్షేపాలు నశించాలంటే శ్యామ సుందర రూపాన్ని ప్రేమించాలి, ఆవరణ భంగం కావాలంటే జీవేశ్వరులయొక్క, మాయయొక్క యధార్థ జ్ఞానాన్ని పొందాలి.

మలక్షయం కానంతవరకు దానధర్మాలు, పూజా జపతపాదులు సత్ఫలితాన్నీయలేవు. కాననే హిందూ జీవనంలో ఈ నలుబది సంస్కారాలు సుచారు రూపంలో జీర్ణమయి యున్నాయి. ఏ యాగం యోగం ఈ సంస్కార ప్రభావానికి ఎంతమాత్రం సరిరాదు. వీనిని కర్తవ్య భావంతో సకాలంలో – సశాస్త్రీయంగా – ద్రవ్య విషయంలో యధాశక్తిగా నిర్వర్తించి తీరాలి. లేకుంటే ఆ జీవికి ఆధ్యాత్మికంగా అభ్యుదయం ఎలాగో లేదు. చివరకు లౌకికంగా కూడ అభ్యుదయం లేదు. ఇది త్రికాల సత్యం. సంస్కరణ శబ్దానికి దోషాల్ని పరిహారించటమని అర్థం. మనోవాక్కాయాలలో వుండే

దోషాల్ని పరిహరించే వానిని 'సంస్కారా' లంటారు. వీనివలన దోషాలు అంతరించటమేగాక, సద్గుణాలు అంకురిస్తాయి. హీనాంగాలు పరిపూర్ణమవుతాయి. (1) స్థాన (2) ద్రవ్య (3) భావ (4) వ్యక్తి విశేషాల ననుసరించి ఈ సంస్కారాలు ఎంతో-ఎంతో ఉన్నతాలయి, అనంతానంత ఫలప్రదాయకాలవుతాయి, ఉపనయనం వరకు తండ్రి చేసే సంస్కారాల ప్రభావం పుత్రునిపై ఉంటుంది. ఉపనయనాదిగా పురుషుడు కర్మాధికారాన్ని పొంది, పాపపుణ్య ఫలభాగి అవు తున్నాడు. ఉపనయనం లేని పురుషుడు, వివాహంకాని స్త్రీ శూద్ర సమానులు, కర్మాధికార శూన్యులు, వారికి ఇహపరాలు రెండూ దుఃఖమయమవుతాయి. ఉప = సమీపం; నయనం = నేత్రం, మలక్షయం ద్వారా జ్ఞాననేత్రాన్ని ప్రసాదించే అద్భుత ప్రక్రియ ఉపనయనం. అది జీవుని భగవత్సన్నిధానానికి నడిపిస్తోంది. భగ వంతుడు యజ్ఞోపవీత రూపంలో పురుషుని, మంగళసూత్ర రూపంలో స్త్రీని నిరంతరం శక్తి దానంచేస్తూ అనుగ్రహిస్తున్నాడు. ఉపనయ నార్హతలేని స్త్రీ శూద్రాదులు, ఇతర వర్ణస్థులుకూడ ఉదయం-మధ్యాహ్నం-సాయంత్రం భగవత్ప్రార్థన చేయాలి. అదే వారికి గాయత్రీ మంత్రసదృశమై, వారందరినీ సుసంస్కృతుల్ని చేస్తుంది. ఈ సంస్కారాలన్నింటివలన సిద్ధించే ప్రయోజనాన్ని ఇతరులు భగవద్ధ్యానం - సత్ప్రవర్తనల వలననే పొందగలుగుతున్నారు. ఈ సంస్కారాలు స్థూల, సూక్ష్మకారణ శరీరాల్ని శుద్ధిచేసి, భగవత్కృపకు మానవుని యోగ్యుని చేస్తున్నాయి. పాప ప్రాబల్యం వలన ఈ విషయాన్ని మానవుడు గ్రహించలేకున్నాడు. దైవ రాజ్యంలో ప్రవేశించాలంటే ఈ నలుబది సంస్కారాల్ని విధిగా సేవించితీరాలి.

శ్లో॥ కాంక్షంతః కర్మణాం సిద్ధిం యజంత ఇహ దేవతాః,
క్షిప్రంహి మానుషే లోకే సిద్ధిర్భవతి కర్మజా॥
(భగవద్గీత. అ4–శ్లో2.)

"కర్మలకు తగిన ఫలాన్ని పొందాలనుకొనేవారు దేవతల్ని ఆరాధిస్తారు. ఒక్క మానవలోకంలో మాత్రమే, మానవ శరీరంలో మాత్రమే సిద్ధి లభిస్తోంది, అదయినా కర్మచేస్తే మాత్రమే, ఒకటే సిద్ధాంతం, సుఖించాలంటే మానవులు కర్మలు చేసితీరాలి."

దేవ, ఋషి, పితృ భూత, మనుష్య యజ్ఞాల్ని పంచ మహా యజ్ఞాలంటారు. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యుల కివి వేద మంత్రాత్మకాలు. వేదమంత్రాలు లేకుండా ఇతర వర్ణాలవారు–స్త్రీలు కూడ ఈ యజ్ఞాల్ని ఆచరించి తీరాలి. "ఋణాని త్రేణ్యపాకృత్య మనోమోక్షే నివేశయేత్." దేవర్షి పితృ ఋణాల్ని తీర్చుకొన్న తరువాతనే మనసును మోక్ష ప్రయత్నంలో నియోగించాలని శాస్త్రం చెప్తోంది, ఆహారాన్ని భగవంతునకు నివేదించి భుజించటం వలన దేవఋణం తీరుతుంది. ఆహారమంటే 'అన్న'మని మాత్రమే అర్థం కాదు. ప్రతి ఇంద్రియానికి ఒక్కొక్క విషయం ఆహారం. ఇంద్రియాలు గ్రహించే ఆయా విషయాలు ధర్మబద్ధంగా ఉంటే ఆ ఆహారం వలన ఇంద్రియాలు చక్కగా వృద్ధి అవుతాయి. అప్పుడే ఆ ఇంద్రియాలలో వుండే దేవతలు ప్రసన్నులవుతారు. చివరకు సమస్తేంద్రియ కర్మల్ని అంతర్ముఖంచేసి, ఆత్మలో లీనంచేస్తారు. (భగవద్గీత. అ 4 – శ్లో 27.) త్యాగం చేయటాన్నే 'యజ్ఞ' మంటారు. ఇంద్రియాలతో జరిగే సమస్త వ్యాపారాలు వ్యక్తి సుఖం నిమిత్తంకాక విశ్వ కల్యాణం నిమిత్తం ప్రవర్తిల్లాలి. ఇదేయజ్ఞం.

ఒకే ఆత్మ తత్త్వం అందరిలో వుంది, అందరుగా వుంది. ఈ జ్ఞానంతో కూడిన త్యాగం యజ్ఞమై, 'శాంత'మనే అమృతాన్ని ప్రసాదిస్తుంది. చివరకు జీవితం ప్రసాద రూపమవుతుంది.

ఊర్ధ్వ లోకాలలో వుంటూ పితరులు భూలోకంలో తమ వంశస్థులు సమస్త సుఖ సంపన్నులుగా ఉండాలని కోరుకుంటారు. అంతటి వాత్సల్యమయులకు ఆహారం అందించటం మానవధర్మం కాదా? సంవత్సరానికొక్క పర్యాయం మాత్రం శ్రాద్ధం జరిపితే చాలు, పితరులు రోజూ ఆహారాన్ని పొందగలుగుతారు. వేద మంత్రాలతో బ్రాహ్మణులకు పెట్టే భోజనం, చేసే అగ్నిసేవ, చివరకు పిండాల్ని కాకులచేగానీ, ఆవులచేగానీ తినిపించటం, వీని ప్రభావం ఎప్పటికీ వ్యర్థంకాదు. ఇక్కడ భూలోకంలో ఈ విధంగా కర్మలు జరిగితేనే అక్కడ దేవతలు – పితృదేవతలు ఆహారం పొందగలుగుతారు. ఒక సాధారణ వ్యక్తికి అన్నం పెట్టితేనే ఆతని ఆశీర్వచనం అమోఘంగా ఉంటుందని శాస్త్రం చెప్తుంటే, దేవతల్ని, పితృ దేవతల్ని తృప్తుల్నిచేసి వారి ఆశీర్వచనం పొందటానికి సమానమయిన విషయం మరొకటి లేదని వేరే చెప్పాలా? ఇలాగే వివాహితుడయి మానవుడు వంశాభివృద్ధిచేస్తే పితరులు సంతసించి, ఆశీర్వదిస్తారు.

ఋషులు మంత్ర ద్రష్టలయి, మానవుల మేధాశక్తిని క్షణ క్షణం వృద్ధి చేస్తున్నారు. అట్టి ఋషుల ఋణం తీర్చుకోవాలంటే వారందించిన వేదశాస్త్రాల్ని అధ్యయనం చేయాలి, చేయించాలి. భోజనానికి ముందు మంత్రంతోగానీ, మంత్రహీనంగాగానీ, సమస్త ఆహార పదార్థాల్ని కొద్ది, కొద్దిగా అగ్నికి సమర్పించాలి. ఇలాగే

కాకులకుగానీ, ఆవులకుగానీ సమర్పించి, ఆహారం వంతుకొనలేని పశువుల్నికూడ తృప్తిపరచాలి. ఇంక మధ్యాహ్న కాలానికి ఇంటి కరుదెంచిన అతిథుల్ని యథాశక్తి తృప్తిపఱచటం ధర్మమని వేరే చెప్పాలా? సద్గృహస్థు ప్రతినిత్యం కనీసం పరాయి వ్యక్తి నొక్కని నయిన తోడుచేసికొని భుజించాలి.

శ్లో॥ ద్వారం ద్వార మటన్ భిక్షుః శిక్షత్వేవ నయాచతే,
అదత్వా మాదృశో మాభూః దత్వాత్వం త్వాదృశో భవ॥
(యజుర్వేదం.)

భిక్షుకుడు లోకుల్ని యాచించటంలేదు, అశ్రుపూర్ణ నయనాలతో హితోపదేశం చేస్తున్నాడు; "మహాశయా! మరుసటి జన్మలో కూడ నీ విదేస్థితిలో ఉండదలుచు చున్నావా? అయితే ధర్మాత్ముడవు కా! నావలె కాదలుచు చున్నావా? అయితే ధర్మమవసరంలేదు, ఆలోచించుకో, నీ ఇష్టం."

ఇలా దేవర్షి పితృ భూత మనుష్య గణాల్ని సంతృప్తుల్ని చేసే అద్భుత విధానాలే పంచమహాయజ్ఞాలు. మానవ జీవితమంటే వారి దివ్యాశీర్వచనం యొక్క ఫలం.

ఇక తక్కిన సంస్కారాల పేర్లన్నీ క్రమంగా చెప్పబడుతున్నాయి. (6) గర్భాధానం, (7) పుంసవనం;- ఇది గర్భస్థ శిశువు పురుషుడగుటకై చేసే సంస్కారం, (8) సీమంతం;- దీని వలన గర్భస్థ దృఢావయవాలు కలవాడవుతాడు. ఈ సంస్కారం ప్రథమ గర్భానికి మాత్రమే చెప్పబడింది. (9) జాతకర్మ;- దీని

వలన పుత్రుడు దీర్ఘాయుష్మంతు డవుతాడు. (10) నామకరణం. (11) అన్నప్రాశనం. (12) చేలం ;- అంటే కేశఖండనం, (13) ఉపనయనం. (14) (15) (16) (17) నాలుగు వేద వ్రతాలు. ఇవి ద్విజ బ్రహ్మచారికి వేదం చక్కగా అభ్యాసం కావటానికై చేయబడే సంస్కారాలు. (18) సమావర్తనం, లేక స్నాతకం. (19) వివాహం. (20) నుండి (26) వరకు సప్తపాక యజ్ఞాలు. (1) అష్టకం. (2) పార్వణం. (3) శ్రాద్ధం, (4) శ్రావణి (5) ఆగ్రహాయణి (6) చైత్రి, (7) ఆశ్వయుజి.

(27) నుండి (34) వరకు సప్తహవిర్యజ్ఞాలు. (1) అగ్న్యాధేయం. (2) అగ్నిహోత్రం. (3) దర్శపూర్ణ మాసేష్టులు, (4) నిరూఢ పశుబంధం. (5) సౌత్రామణి. (6) ఆగ్రయణం. (7) చాతుర్మాస్యలు.

(34) నుండి (40) వరకు సప్తసోమ సంస్థలు (1) అగ్నిష్టోమం. (2) అత్యగ్నిష్టోమం. (3) ఉక్థ్యం. (4) షోడశి. (5) వాజపేయం. (6) అతిరాత్రం. (7) అప్తోర్యామం, ఈ శ్రౌతకర్మలు స్వర్గాదులకై చేయబడితే కామ్యాలవుతాయి, నిష్కామంగా చేయబడితే మోక్షప్రాప్తికి కారణాలవుతాయి. ఆచరించటంలో హెచ్చుతగ్గు లుండవచ్చునుగాని ఇందలి ఏ సంస్కారాన్ని కూడ బుద్ధిపూర్వకంగా పరిత్యజించకూడదు. ఇవి హిందువుల 40 సంస్కారాలు. శరీరానికి జరిగే సంస్కారాలలో కడపటిది అంత్యేష్టి.

ఇవన్నీ మానవజీవితాన్ని చక్కగా నియమబద్ధంచేసి, భగవద్రాజ్యంలో ప్రవేశింప చేస్తాయి.

ధర్మం అంటే జీవితం. దివ్యజీవితం. అంతర్ముఖ జీవితం, లోకానికే అది జీవనదాయకం.

— —

# (19) ధర్మం - నామసంకీర్తన

ప్రాయశ్చిత్తాల వలన నరక దుఃఖం నివారింపబడుతుంది. అయినా పాపబుద్ధి నశించనంతవరకు మానవుడు పాపం చేస్తూనే వుంటాడు. ఆ మనసు లేదా బుద్ధి లేదా అంతఃకరణం ఎలా పవిత్ర మవుతుంది? దానికి ఉపాయమేమీ లేనేలేదా?

రోగం వచ్చింది, ఔషధ సేవనం వలన తగ్గింది. అయినా ఇంకా కొంతకాలం ఆహార విహారాలలో నియమంగా లేకుంటే వ్యాధి మరల వస్తుంది. ఇలాగే మనసును ఆ దుష్ట సంస్కారాలతో పాటుగా సబీజంగా నశింప చేయకుంటే భవవ్యాధి మరల మరల సంక్రమిస్తుంటుంది. ఈ వ్యాధి నివారింపబడటానికి ఏమిటి ఉపాయం?

శ్లో॥ నైకాంతికం తద్ధి కృతేఽపి నిష్కృతే
మనః పునర్ధావతి చేదసత్పథే,
తత్కర్మ నిర్హార మభీప్సతాం హరే
ర్గుణానువాదః ఖలు సత్త్వభావనః॥

(శ్రీమద్భాగవతం స్కం-6-అ2-శ్లో 12.)

శ్లో॥ అపి చేత్సుదురాచారో భజతే మామనన్యభాక్,
సాధురేవ సమంతవ్యః సమ్యగ్వ్యవసి తో హిసః॥

(భగవద్గీత. అ9–శ్లో 30.)

మనసును అసత్పథాన్నుండి నిరోధించే మార్గం ఒకే ఒక్కటి. పాప వాసనల్ని సబీజంగా అంతరింపచేసే మార్గం ఒకే ఒక్కటి. ఈ మనసును దాని వెనుకవున్న ఆత్మయందు, లేదా శ్రీకృష్ణ పరమాత్మయందు నియోగించాలి భగవద్గుణగానం – భగవన్నామ సంకీర్తనం చేయాలి. మానవుడు భగవచ్ఛరణాగతుడు కావాలి.

శ్లో॥ సతతం కీర్తయంతోమాం యతంతశ్చ ధృఢవ్రతాః,
నమస్యంతశ్చ మాం భక్త్యా నిత్యయుక్తా ఉపాసతే॥

(భగవద్గీత అ9–శ్లో 14.)

శ్రీకృష్ణ భగవానుడు చెప్తున్నాడు; "అర్జునా! నన్ను భక్తులు అనన్య భక్తితో ఉపాసిస్తారు. "తతం వీణాదికం వాద్యం." వీణాది వాద్యాలతో నా నామసంకీర్తన, గుణసంకీర్తన, భావసంకీర్తన, లీలాసంకీర్తన చేస్తారు, నా ప్రాప్తికై ధృఢప్రయత్నం చేస్తారు. నాకు నమస్కరిస్తూ నా ధ్యానంలో లీనమవుతారు."

శ్లో॥ అపహాయ నిజం కర్మ కృష్ణ కృష్ణేతి వాదినః,
తే హరేః ద్వేషిణః పాప్మా ధర్మార్థం జన్మయద్ధరేః॥

(విష్ణుపురాణం.)

"వర్ణాశ్రమ విహిత ధర్మకర్మల్ని త్యజించి, ఎవరు కేవలం శ్రీకృష్ణ నామమే గ్రహిస్తారో వారు హరి ద్వేషకులు, పాపాత్ములు ఏ ధర్మాన్ని రక్షించటానికి భగవంతు డవతరిస్తున్నాడో ఆ ధర్మాన్ని త్యజించిన తరువాత మానవులకు సుఖమెలా వుంటుంది?"

భగవన్నామ బలం చూచుకొని ఎవరు పాపాలు చేస్తారో వారిపాపాలు వృద్ధి అవుతాయి, ఆచంద్రతారార్కం వారు నరకంలో దుఃఖిస్తారు.

అవశ్యం వర్ణాశ్రమ ధర్మాల్ని అనుష్టిస్తూ, వానికి తోడుగా భగవన్నామాన్ని స్మరించాలి, మనసులు మధుర శ్యామరూపానికి మధుకరం చేయాలి.

శ్లో॥ మయ్యేవ మన ఆధత్స్వ మయి, బుద్ధిం నివేశయ,
నివసిష్యసి మయ్యేవ అత ఊర్ధ్వం నసంశయః॥

(భగవద్గీత. అ12-శ్లో 8.)

"అర్జునా! నాయందు మనసును లగ్నం కావించు నాయందు బుద్ధి నిలుపు. 24 గంటలు నాయందే. నా నామరూప గుణలీలా ధామాలందే నివసించు, తప్పక నన్నే పొందగలవు."

భగవన్నామాన్ని నిరంతరం మనసుతో స్మరించాలి. అది సాధ్యమా? కాదు. కనుకనే ఒక్క గంట సమయాన్నయినా సంకీర్తనకు వినియోగించాలి. భావప్రధానమయినది మాత్రమే నిజమయిన సంకీర్తన. ప్రేమ-ఆర్తి ఉంటేనే సంకీర్తన ఫలదాయక

మవుతుంది. పేరుతో పిలిచినంత మాత్రాననే ఆ పేరు గలవాడు మన దగ్గఱకు వస్తున్నప్పుడు భగవంతుడెందుకురాడు. రావాలన్న భావంతో పిలిచినట్లయితే భగవంతుడు ఆలస్యం చేయకుండా తప్పక వెంటనే వచ్చి తీరుతాడు.

అయితే మానవ జీవితానికి సంకీర్తన ఒక్కటి మాత్రమే సరిపోతుందా ? చాలదు. సంకీర్తన ఒక్కగంట మాత్రమే చేస్తాం. తక్కిన 23 గంటలు ఎలా సద్వినియోగం కావాలి? సంకీర్తనచేస్తూ, మరొకవైపు అసత్యంచెప్పి, అక్రమంగా ప్రవర్తిస్తుంటే అది భగవన్నామ సంకీర్తన ఎలా అవుతుంది? దంభమవుతుంది. పవిత్ర భావంలో సంకీర్తన చేసేవాడు పొరబడికూడా అసన్మార్గాన కాలు పెట్టడు. జీవితం భగవద్రాజ్యంలో ప్రవేశించిందని, భగవత్కృపకు యోగ్యతను సంతరించుకొన్నదని ధర్మం అంటే సద్గుణాలు మాత్రమే తెలియచేస్తాయి. అందువలన వాక్కు సంకీర్తన చేయాలి. దానికితోడు మనసు సదా శుభాన్ని చింతించాలి, శరీరం పరోపకారానికి సంపూర్ణంగా అంకితం కావాలి.

"మయ్యేవ మన ఆధత్స్వ-" "మనోరంతర్గతం విష్ణోః-" నిశ్చలమయిన మనసులోనికి భగవంతుడు కృపాపరవశుడై ప్రవేశిస్తాడు. నిశ్చలమయిన మనసులో భగవంతుడుంటాడు. ఆ భగవంతుని యందు ఈ మనసు కేంద్రీకరింపబడాలి.

"మయిబుద్ధిం నివేశయ." "ధీయో యోనః ప్రచోదయాత్." బుద్ధిని ప్రబోధన చేసేవాణ్ణే భగవంతుడంటారు. బుద్ధిని శుద్ధం చేసి

కొనటానికే 'ఉపాసన' అని పేరు. ఈశ్వరుడు అంతఃకరణ శుద్ధి గలవాని రూపంగా ఉంటున్నాడు.

"నివసిష్యసి మయ్యేవ." జీవుడు భగవంతుని యందు నివసించాలి. అంటే భగవంతుడే కావాలి.

శ్లో॥ శనైశ్శనై రుపరమే బుద్ధ్యా ధృతిగ్రహీతయా.
ఆత్మ సంస్థం మనః కృత్వానకించి దపిచింతయేత్,
(భగవద్గీత. అ6–శ్లో25.)

"బుద్ధి ద్వారా మనసును నిగ్రహించి ఆత్మయందు ప్రవేశించాలి, ఆత్మారిక్తముగా దేనిని మనసు చింతించకూడదు."

"బ్రహ్మ విద్ బ్రహ్మైవ భవతి." బ్రహ్మను తెలిసికొన్న వాడు బ్రహ్మయే అగుచున్నాడు.

త్రికరణ శుద్ధి ఏకాగ్రతకు జన్మనిస్తుంది. అప్పుడే "స్వస్వరూపాలు సంధానం" ఆరంభమవుతుంది. "స్వస్వరూపాను సంధానం భక్తిరిత్యభిధీయతే." (శ్రీ ఆదిశంకరులు) భగవానుని నామరూపాలలో రమించటం భక్తియని ప్రారంభసాధకు దంటాడు. అవును, నిజమే. ఈ అన్ని నామరూపాలు ఆత్మవే. అది బీజం. ప్రపంచం ఇంత విస్తృతంగా కన్పిస్తోంది. అంటేనే అర్ధమవుతోంది. నిశ్చయం! ఈ ద్వంద్వమంతా నశించేదే. ఈమాట తప్పు. దేనికీ కూడా నాశనమనేదే లేదు. సత్పదార్థం ఒకటున్నది కనుకనే ఇవన్నీ ఉన్నాయి, ఇవన్నీ నశించవు, ఆ సత్పదార్థం ఆత్మలో లయిస్తాయి. ఇదే ప్రళయం, ఏవిధమయిన వృత్తులులేని మనస్థితినే 'ప్రళయ'

మంటారు, ప్రళయంలో అంత సృష్టి ఉంటుంది. బ్రహ్మసంస్థితి ఉంటుంది. ప్రళయం అంటే ఆధునిక జనానికి ఎందువలననో సదభిప్రాయం లేదు. అసలు ప్రళయం లేకపోతే 'ఆధ్యాత్మికం' లేనే లేదు.

ఈ అన్ని నామరూపాలు బీజంలో లయిస్తాయి. అంటే సత్పదార్థం ఆత్మ వీని యన్నింటికి అతీతమయినదని వేరేచెప్పాలా" సర్వనామాలూ ఆత్మవే. అను సంధానం ఈ నామరూపాల వలన గాకపోతే ఇంకెలా జరుగుతుంది? సాధకుడు ప్రతిఒక్క నామంలోనికి, రూపంలోనికి భావశరీరంతో ప్రవేశించాలి. తన్మయుడు కావాలి, విశ్వస్వరూపుడు కావాలి. ఇదే "సతతం కీర్తయంతోమాం" అన్న భగవద్గీతా శ్లోకానికి అసలయిన అర్థం.

# (20) ధర్మం -
# "కర్మణ్యేవాధికారస్తే" - వాల్మీకి

"నరుడా! అనుసంధానమనే భక్తిమార్గంలో ప్రవృత్తుడవై, ప్రహ్లాదుడవగుటకే నీవు జన్మించావు. ఇందుగలడందులేడని భగవంతుని సర్వాత్మకునిగా అనుసంధానం చేయాలి. అఖిల రూపాలు ఆయన రూపాలుగా, ఆయన ఆత్మ స్వరూపుడుగా అనుసంధానం చేయాలి." బహిర్ముఖుల నిమిత్తం ఈ నామ రూపారాధానం ఆ అనుసంధానంలోనే ఒక భాగంగా, అవశ్య కర్తవ్యంగా విధించబడింది. మానవుడు ఈ కర్మ నిమిత్తమే పుట్టాడు.

జీవుడు ఆత్మాభిముఖుడు కావాలి, ఆత్మానందంలో మగ్నుడు కావాలి, సమస్త దేవతలు - లోకాలు - అవతారాలు ఆత్మ సూర్యునకు వివిధ కిరణాలు. దృశ్యాన్ని నశ్యంగా, దుఃఖదంగా భావించి, అతీతుడవటంలోనే ఆత్మక్రీడ - దైవకృప యనేవి అనుభవానికి వస్తాయి. అలా అతీత్వాన్ని సాధించటం చాలాకష్టం. అసాధ్యాన్ని సాధ్యం చేసికొనటంలోనే మానవుడు మానవుడుగా, మాధవుడుగా రూపొందగలుగుతాడు.

రత్నాకరుడు మహాక్రూరుడు. ఈ నామరూపాలే శరీరం-శరీరసుఖాలే ప్రధానమనుకొనేవాడు. అతడు చేయని పాపమంటూ ఏదీలేదు. ఇటువంటి ప్రవాహ జీవులు తమ వాసనా ప్రవాహానికి వారధి నిర్మించాలంటే సత్సాంగత్యం ఉండితీరాలి. సప్తర్షులు తటస్థపడ్డారు. ఒకటేమాట! జీవహింస చేస్తున్నావు. నీవుకూడ హింసింపబడతావు. ఇన్ని ప్రాణులు కంటతడి పెట్టున్నాయి. నీవుకూడ కంటతడి పెట్టవలసి వస్తుంది. పాపమంటే జీవహింసకన్నె మరింకేమీ లేదు. ఇలా జీవహింస ఎందుకు చేస్తున్నావు?

రత్నాకరుడన్నాడు; స్వాములారా! ఆరంభంలో ఈ జీవహింసలో మనసు స్వల్పంగా బాధపడేదేకానీ క్రమంగా అభ్యాసమయింది. ఇప్పుడు ఆ ప్రాణులు దుఃఖిస్తుంటే నా మనసు ఆనందంతో నాట్యమాడుతోంది. పొట్టకోసరం వీనిపొట్ట చీల్చక తప్పిందికాదు. స్వాములూ! ఒక్కపొట్ట అయితే ఇంత శ్రమ అవసరమేలేదు. నా పరివారం చాల పెద్దది. అందఱికీ నేనొక్కడనే ఆధారం. గృహస్థుడనై వారి పొట్టలు నింపకున్న, స్వాములూ! అదికూడ అన్యాయమేగదా! స్వాములూ! గృహస్థు కావటమే పాపం. పాపం వలననే సంతానం కలుగుతోంది. చివఱకు వారివలన మళ్ళీ పాపమే జరుగుతోంది. పాపం-పాపం అంటారు స్వాములూ! అదిలేకుండా మానవజీవితం ఎట్లా ఉంటుంది?

స్వాములు రత్నాకరుని వాచాలత్వానికి క్షణంసేపు అవాక్కులయారు, అంటున్నారు; శాబాశ్! రత్నాకరా! శాబాశ్!! నీలో ధర్మం చరిస్తూనే వుంది. దాన్ని క్రియాన్వితం చేయటానికి అతీతశక్తి సహకారం ఈ సమయంలో నీకు చాల అవసరం. గృహస్థాశ్రమంలో

భార్యాబిడ్డల నవశ్యం పోషించవలసిందే. లేకుంటే గృహస్థు ఇహపర లోకాలలో దుఃఖభాగి అవుతాడు. నిజమే ! అయితే న్యాయంగా ధనం పుట్టకుంటే చావటమే ఉత్తమం, అన్యాయంగా సంపాదించిన ధనంతో శరీరాన్ని పోషించుకొనేవాడు మానవుడుకాడు, రాక్షసుడు! పాపంలేక మానవ జీవితం ఉండనే ఉండదన్నావు. నిజమే! పాపానికి దూరమయి, చర్మచక్షువులకు దూరంగా వున్న దివ్య ప్రపంచంలో జీవించటమే జీవించటం. భౌతిక ప్రపంచంలో-శరీరంలో విషయాల వెంట కాలక్షేపం చేసే జీవితం జీవితమేకాదు, ఈ సుఖం సుఖమే కాదు. ఈ సుఖం కావాలనుకోవటమే మానవుడుచేసే ఘోరమయిన పాపం. జీవితం పాపస్వరూపం పొందటానికి ఇక్కడే ప్రారంభ పూజ జరుగుతుంది.

ఒక శ్రీమంతుడు బజారున వెళుతుంటే ఆతని జేబులోని పది రూపాయలనోటు గాలికి ఎగిరిపోయింది. ఇది ఆతడు గుర్తించలేదు. ఆతని దృష్టిలో పదిరూపాయలకు మూల్యమేలేదు. దినానికి ఇరువది రూపాయలు నిర్నిమిత్తంగా ఆతడు ఖర్చుచేస్తుంటాడు. ఒక ఆజన్మ దరిద్రుడు శ్రీమంతుని అనుగమిస్తూ, ఆ పదిరూపాయల నోటును సంగ్రహించాడు. ఆనోటు లేకున్నందువలన శ్రీమంతునకు ఏంనష్టం లేదు. ఈ దరిద్రునకు చాలా లాభముంది. రత్నాకరా! చెప్పు, దరిద్రుడు పదిరూపాయల నోటును సంగ్రహించటం న్యాయమా? అన్యాయమా? అన్యాయమే, ఆతనినుండి పదిరూపాయల్ని, వాని నుండి సుఖాల్ని ఆశించటమే అన్యాయం.

శ్లో॥ ప్రజహాతి యదాకామాన్ సర్వాన్‌పార్థ! మనోగతాన్,
ఆత్మన్యేవాత్మనాతుష్టః స్థితప్రజ్ఞస్తదోచ్యతే॥
(భగవద్గీత అ. 2-శ్లో॥ 55.)

"నరుడా! నీకు సుఖం కావాలా? అయితే లోకాన్ని చూడకు, శరీరాన్ని మఱచిపో, విషయ విముఖుడవుకా! ఆత్మలో ఆనందాన్ని అనవరతం అనుభవించు. అప్పుడే నీ ప్రజ్ఞాశక్తి రూపంలో ప్రభువు ప్రకటమవుతాడు. నిగ్రహింపబడిన మనసు సమస్త నామరూపాలలో ప్రభు ప్రేమరసాన్ని ప్రవహింపచేస్తుంది. సమస్త నామరూపాల్ని తనలోనికి సంగ్రహించుకొంటుంది. నిరాకారం అప్రకటస్థితి, సాకారమంటే ప్రకటావస్థ. నిరాకారం అఖండానందం. సాకారంలో దుఃఖమే దుఃఖం. బ్రహ్మ సగుణ సాకారుడయినాడనే చిత్తవృత్తిలోనే దుఃఖముంది, ఆ ఉపాసనలో దుఃఖముంది. కాన సగుణ సాకారావస్థలో దుఃఖం ఉండీ లేనట్లుగా ఉంది. జీవుడు సగుణ సాకారుడే. అయితే బ్రహ్మ నిర్గుణ నిరాకారుడవటం అసంభవం. బ్రహ్మ నిర్గుణ నిరాకారుడు. అయితే జీవుడు నిర్గుణ-నిరాకారుడయితీరుతాడు గౌరవనీయులందరూ తమ పేరుముందు 'బ్రహ్మశ్రీ'ని నిలుపుకొనటం చూస్తున్నదే గదా!"

రత్నాకరా! ప్రపంచంలో పాపం—పుణ్యం; సుఖం—దుఃఖం; మంచి—చెడు అనేవి లేనేలేవు. మనసే వీనియన్నింటి రూపాల్ని పొందుతోంది. ఆ మనసే గుణకర్మాధీనంగా శరీరాన్ని సృష్టిస్తోంది. దివ్యత్వం భావంలో భావంగా ఉంటుంది. ఆ భావమే బ్రహ్మ. ఆదేభావం బహిరంగమై, అంటే భావం లేక మనసు ప్రపంచాకార మవుతోంది. అజ్ఞానాన్ని పొందుతోంది, ఇతరుల్ని వంచిస్తోంది, తప్పులు చేస్తోంది, విషయాలకు బానిస అవుతోంది, అంతా పురుషార్థమేనని అహంకరిస్తోంది. ఫలితంగా ఈ ప్రపంచంలో సుఖం—దుఃఖం అనే రెండు యజ్ఞగుండాలకు ఆహుతిఅవుతోంది.

బ్రహ్మ సృష్టి లో దినరాత్రులు—;పాపపుణ్యాలు—;శ్రీమంతుడు—దరిద్రుడు; గంగానది—మురికికాలువ; రత్నాలు—రాళ్ళు; అన్నీ ఉన్నాయి. మంచివాడు మంచికి, చెడ్డవాడు చెడుకు ఆకర్షింప బడుతారు ఇది సృష్టిలోని దోషంకాదు, మనసులోని దోషం.

అసత్య వచనం వలన—వ్యభిచారాదుల వలనకూడ దుఃఖం ఎందుకు వస్తోంది? స్వార్ధసిద్ధి నిమిత్తం అసత్యం చెప్పినందువలన ఎదుటివ్యక్తికి ఏం నష్టముంది? వ్యభిచరించినందువలన ఎదుటి వ్యక్తికిగానీ, ఆ స్త్రీకిగాని ఏం నష్టముంది? మనసు స్వస్థానంనుండి బయటకు చరిస్తోంది, చలిస్తోంది. దాన్నే 'వ్యభిచార' మంటున్నారు. అలా చలించటమే, భావం బాహ్య ప్రపంచంలో సుఖంకోసం దూషిత మవుట 'పాప' మంటున్నారు. దుఃఖాలన్నీ ఇక్కడినుండే పుట్టు తున్నాయి. ఏం రత్నాకరా! నీవు రేపు దుఃఖించి తీరుతావు."

రత్నాకరుడంటున్నాడు; "సిద్ధంగాఉన్నాను. నేనే కాదు, నా పరివారమంతా నాతోటి దుఃఖించటానికి సిద్ధంగాఉంది. నేను ఈనాటిని గురించి ఆలోచించేవాడనేగానీ రేపటినిగురించి ఆలో చించే మనిషినిగాను."

సప్తర్షులంటున్నారు; "మూర్ఖుడా! రేపటిరోజు స్థితి ఈనాటి నీ మనోవృత్తులపైననే ఆధారపడి వుంటుంది. పునర్జన్మ వర్త మానం పైననే ఆధారపడి వుంటుంది. ఆ! తరువాతమాట! ఈ నీ పరివారమంతా నీతోపాటు సుఖించటానికి కాచుకొనివుందిగానీ, రేపటి రోజు దుఃఖించవలసివస్తే అందుకు సిద్ధంగాలేదు. లాభనష్టాల వ్యాపారాన్ని ఈ అజ్ఞ మానవులు 'సంసార' మంటున్నారు. లాభ

దాయకంగా ఉంటేనే పరివార జీవనం కొనసాగుతుంది. అందులో ఏవ్యక్తి స్వార్థానికి భంగం వాటిల్లినా పరివారజీవనం విచ్ఛిన్న మవుతుంది, దుఃఖాలయమవుతుంది. ఇది నాలుగు స్తంభాలాట. ధర్మార్థ కామ మోక్షాలు నాలుగు స్తంభాలు. ఆటలో ఓడినాసరే, అర్థ కామాలు నష్టమయినాసరే చివరి పురుషార్థాన్ని సాధించటమే మానవ జీవితానికి ప్రప్రథమ కర్తవ్యంగా, ధర్మంగా చెప్పబడుతోంది. అర్థకామాలు నష్టంకానిదే, మనోవాక్కాయాలు అఘాతానికి లోను కానిదే చివరి పురుషార్థం మోక్షం సిద్ధించదు. రత్నాకరా! ఒకటే మాట! దుఃఖంలో ఎవరికివారే యమునాతీరే. అప్పుడిక పరివార జీవనముండదు. ఇహమనే బజారునుండి పరమనే అంతఃపురంలో అడుగిడటానికి ఈ సూక్తి నిశ్చయంగా సింహద్వార సమానం."

రత్నాకరుని అంతరంగం సంతాప పూర్ణమయింది. ఆత్మ యజ్ఞ వేదికనుండి నిర్వేదజ్వాలలు బహిరంగ మవుతున్నాయి. అతడు వింటున్నది వేదాంతోపన్యాసంకాదు, ఉపనిషత్తులుకావు. ప్రతినిత్యం ఎదురయ్యే గృహసమస్య. ఇదేం క్రొత్తదికాదు. అయినా ఎంత క్రొత్తగాఉంది! ఇది ఎంత ఆలోచనీయాంశం! అయినా ఎప్పుడూ ఆలోచించనేలేదే?

కుటుంబ సభ్యులందరు ఏకకంఠంతో రత్నాకరునకు ప్రత్యుత్తరమిచ్చారు. దానిని గురించి వివరించాల్సిన అవసరంకూడా ఉంటుందా?

రత్నాకరుడు అశ్రువులలో అశ్రురూపమయినాడు, ప్రవాహ మయినాడు. ఛీ! వీరెంత కృతఘ్నులు! వీరినెంతగా "నావారు— నావారని" ప్రేమించాను!! వీరినిమిత్తం ఈఒక్క జీవితమేనా, ఎన్ని

జన్మలు నష్టమయినాయి!!! అబ్బా! ఈలోకం ఎంతగ్రుడ్డిది. వ్యామోహంతో వ్యాకులురవుతూకూడా ఈదౌర్భాగ్య మానవులు ఇంటిని వీడటానికి సుతరాం ఇష్టపడరే!

అంతే! రత్నాకరుడనే ఆ ప్రవాహం సప్తర్షుల పాదాల దగ్గఱకు వచ్చినిలిచింది.

ప్రతిఒక్క మానవుడూ ఇలా రత్నాకరుడైతే ఆచార్యులు కూడ సప్తర్షి సమానులవుతారు.

రత్నాకరుడు కారణజన్ముడు, కొననే ఆచార్యోపదేశం క్షణంలో హృదయక్షేత్రంనుండి అంకురించింది.

సమయం కలిసిరావాలి. అంతవరకు ఈమాటల వైభవం గ్రాహ్యంకాదు. సమయం వచ్చితీరుతుంది. ఇష్టంతో విన్నా, అయిష్టంతో విన్నా ఈవచనాలు ఎన్నిజన్మల తరువాత అయినా ఫలితాన్నిచ్చి తీరుతాయి. అంతవరకు శ్రవణం—నిర్విరామ శ్రవణం అత్యంతావశ్యకం. (1) శాస్త్రకృప. (2) దైవకృప. (3) గురుకృప, (4) పురుషప్రయత్నం. ఈనాలుగు మానవజీవితాన్ని చరితార్థం చేసే సాధనాలు.

సప్తర్షులు ఆలోచించారు; "ఇంతటి మహా పాపాత్ముడు తరించటం ఎలా?" ఈతడు ఎట్టి ఆధ్యాత్మిక సాధనచేయటానికీ యోగ్యుడుకాడే? పూజలు చేయగలడా? జపాలుచేయగలడా? ఇన్ని మహా పాపాల్ని హరింపచేయగల సాధన యేముంది? సాధన ఇప్పుడు ఆరంభిస్తే అది పునర్జన్మలో ఫలిస్తుందంటే ఎలా? సద్యః

ఫలదాయకంగా ఉండాలి. అట్టిసాధన ఏముంది? ఆలోచించి. ఆలోచించి సప్తమహర్షులు 'మరా'యని ఉపదేశించారు. రత్నాకరునిబుద్ధి తిరుగబడివుంది. అందువలన ఉపదేశంకూడా గతితప్పింది. రామనామం ఎట్టి పాపాలనయినా హరిస్తుంది. అయితే రామనామ బలంతో ఎవడు పాపాలుచేస్తాడో వాని పాపాల్నిమాత్రం హరించలేదు. రాముడు కనుబడడు. ఈ రామనామమే సర్వజనులకు ప్రత్యక్ష దైవం. నామానికి నామి వశుడవుతాడు. కాన శ్రీరామునిగన్న శ్రీరామనామమే గొప్పది. భగవన్నామం భక్తుల్ని భగవత్స్వరూపుల్ని చేస్తుంది, మనోవాక్కాయాల్ని మధురంచేసి మరోజన్మ ననుగ్రహిస్తుంది. కావనే ప్రతిహిందువు భగవన్నామాన్ని ఆత్మనామంగా గ్రహిస్తున్నాడు. ఆ నామాల్నే సంతానానికికూడ అనుగ్రహిస్తున్నాడు. ఒక్క పొరబాటు చేస్తున్నాడు; అసలుపేరును వదలి, ముద్దుపేరును ఆశ్రయిస్తున్నాడు. ఎంత వ్యామోహం! ప్రతివ్యక్తి అసలు పేర్లతో ఇకనయినా తన సంతానాన్ని పిలుచుగాక! జ్యేష్ఠ పుత్రుని పేరుతో పిలువరాదు. నామం -- నామి ఇవి భిన్నంగావు. జ్యేష్ఠపుత్రుడు వంశాధారుడు గాన అతనిపేరుతో పిలిచినా నామి బలహీనుడవుతాడు, ఫలితంగా వంశం నశిస్తుంది. అర్ధాంగిని పేరుతో పిలువరాదు. అర్ధాంగి అంటే నిజశరీరంలోని భాగమేగదా! ఒకటే మాట! నామికన్న నామం గొప్పది. కొన్ని సమయాలలో, కొందరు వ్యక్తుల విషయంలో దాన్ని గుప్తంగా ఉంచాలి. అప్పుడే దాని ప్రభావం అనంతమవుతుంది. అర్ధాంగిని పేరుతో పిలవటమంటే నిజాయుర్దాయాన్ని నశింపచేసికొనటమేనని సారాంశం. ఆత్మనామాన్ని ప్రకటం చేయకూడదు, గుప్తంగా ఉంచాలి. ప్రకటం చేస్తే ఆయువుక్షీణిస్తుంది. పెద్దల్ని పేరుతో పిలువకూడదు.

"అయ్యా! స్వామీ!!" అని పిలువాలి. పేరుతో పిలిచినపడల సజ్జనుల కృప దూరమవుతుంది. పైనచెప్పిన వారంతా ఈ ప్రపంచంలోని వ్యక్తులు, ఆత్మభిన్నులుగా వీరితో వ్యవహారం జరుగుతోంది కాన ఈ మర్యాదను అవశ్యం రక్షించితీరాలి. భగవంతుడు అందరిలో ఉండేవాడు; ఆత్మలో ఉండేవాడు. ఈ సమస్తమానవులు భగవత్స్వరూపులే: కారణం భగవంతుడు లేకుంటే వీరు లేనేలేరు. భూదగలవారికి భగవంతుడు ఎప్పుడూ ప్రకటంగానే ఉన్నాడు. మరియు అప్రకటంగాకూడ ఉన్నాడు. తనముందు మాయను నిలిపియున్నాడు. ఈవిధంగా అప్రకటంగా—ప్రకటంగా ఉండేవాడు కనుక ఆ భగవంతుని నామాన్ని గుప్తంగా ఉంచవలసిన అవసరం ఎంతమాత్రం లేదు సరికదా, ఎంత ఉచ్చైస్స్వరంతో కీర్తిస్తే అంత అధిక ఫలముంటుంది. ఈ కనుబడే మాయ, అంటే నామరూపాలు మాయమవుతాయి. అయితే? ఇంక లోనున్న చిన్మయరూపం సమస్త ప్రపంచ స్వరూపంగా సాక్షాత్కరిస్తుంది. భగవన్నామం ఇంత ఘనమయిన దంటే ఆశ్చర్యమేముంది? ఈ సాధారణ జీవుల నామాలే ఎంతోగొప్పవి. దేహ త్యాగానంతరంకూడ జీవులకు—అంటే పితరులకు ఈ భూలోకంనుండి ఆహారం అందుతోంది. దీనికి ఏమిటి ఆధారం? శ్రాద్ధంలో పిండాల్ని వారివారి గోత్రనామాలతో మంత్రించటమేగదా!

సప్తర్షులు వెళ్ళిపోయినారు. ఏమిటి ఆశ్చర్యమా? ఇంకా ఎంత సేపుంటారు? ఉపదేశం ఎంత సేపుంటుంది? సమర్థులయినవారి మౌనమే యోగ్య శిష్యులకు సరియైన ఉపదేశంగదా! రత్నాకరుడు వాల్మీకి మహర్షిగా రూపొందాడు.

పూర్వం నిరంతరం జీవహింస చేస్తుండేవాడుగదా! ఎట్టి వారయినా జీవహింసవలన అవశ్యం దుఃఖించవలసిందే అన్నాడుగదా రత్నాకరుడు దుఃఖించకుండుటకు ఏమిటి కారణం?

రత్నాకరుడు ఇప్పుడు రత్నాకరమై, వాల్మీకిగా రూపొంది, పూర్వం జీవహింసలో ఎంతగా ఆనందించేవాడో ఇప్పుడంతగా సమస్తజీవుల్ని ఆనందింపచేయాలని తపిస్తున్నాడు. పూర్వభావంలో ఎంత కాఠిన్యమో ఆధునికభావంలో అంతగా, అంతకు నూరింతలుగా కారుణ్యం రాజ్యంచేస్తోంది. ఎవనికి వాడుగా పాపాల్ని రూపుమాపుకోవడంలో సమర్ధుడు కాలేకపోవచ్చు. సత్పురుషులంతటివారు ఉపదేశకులయినప్పుడు కూడా ఇంకా పాపాలు పూర్వవత్ సజీవంగా ఉంటాయా? రత్నాకరుడు జీవాల్ని హింసించాడు, ఫలితంగా అతని పాపశరీరాన్ని వేలసంవత్సరాలుగా క్రిములు భక్షించినాయిగదా! శరీరం — మనసు ఈవిధంగా దివ్యంకాగా, "జ్ఞానాగ్ని స్సర్వకర్మాణి భస్మసాత్కురుతేతథా." జ్ఞానాగ్నిలో సమస్త పాపపుణ్యకర్మలు సబీజంగా దగ్ధమయినాయి. ఒక్కమారు అంతిమ సమయంలో శివ ముఖతః ఉపదేశం పొందినంత మాత్రాన కాశీలో సమస్త జీవాలు జననమరణ బంధంనుండి ముక్తమవుతున్నాయే ఇక రత్నాకరుడు తరించాడంటే ఆశ్చర్యానికి అవకాశమేముంది?

పూర్వశరీరంలో అంత జీవహింసకుడు రత్నాకరుడు ఇప్పుడు పక్షిమిధునంలో మగపక్షి గతించగా, శోకించే ఆడుపక్షిని చూచి అపారంగా శోకిస్తున్నాడు. ఆశోకం శ్లోకానికి జన్మనిస్తోంది. విశ్వకళ్యాణానికి నిలయమయిన రామాయణానికి రమణీయ రూపకల్పన చేస్తోంది.

రత్నాకరుడు వాస్తవంలో కారణజన్ముడు. శాపకారణంగా ప్రాచేతసులు ఇలా అవతరించారు. రామనామ వైభవాన్ని నిరూపించటానికే వారిన్ని పాపాలుచేశారు. వాస్తవంలో అవి పాపాలు కావు కాననే వానిని పఠించిన నేటి పాపాత్ములు మహాత్ములవుతున్నారు. ఆ ప్రాచేతసులు ఈ అధమాధములకు ఎంతటి ఆదర్శ చరిత్రను అందించారు! "లోకస్సమస్తా సుఖినోభవంతు."

చివరిమాట! ఒక్కసారి విన్నంతమాత్రాన క్రొత్తభాష ఏదయినా అర్ధమవుతోందా? గణితశాస్త్రం అర్ధమవుతోందా? అర్ధం కానప్పుడు అతీంద్రియ శక్తులు ధర్మం—దైవం మాత్రం ఎట్లా అర్ధమవుతాయి? అతీంద్రియ స్థితిలోమాత్రమే అర్ధమవుతాయి. అంతవరకు ప్రారంభ సాధకులకు ఒక్క అచంచల విశ్వాసమే శ్రీరామరక్ష.

---

# (21) ధర్మం-"కర్మణ్యేవాధికారస్తే" భరతుడు ఎలా మాట్లాడాలి?

ప్రత్యక్షరం భగవత్స్వరూపం. అకారాది క్షకారాంత వర్ణ నిర్మిత విగ్రహుడు భగవంతుడు. షట్చక్రాలు బీజాక్షరయుక్తాలు, బీజాక్షరములను జపించటంవలన భగవంతుడు సులభంగా వశుడవుతున్నాడు. ఈవిధంగా వర్ణమాలకు ఎనలేని ప్రాశస్త్యంఉంది. ఆదిదంపతులు పార్వతీపరమేశ్వరులు. ఆ పరమేశ్వరుని డమరుకం నుండి సంగీత సాహిత్యాలు రూపం సంతరించుకొన్నాయి. ఆ నటరాజు నాట్యం సమస్త కళలకు, సమస్త రసాలకు జన్మదాత.

నిత్యజీవితంలో ప్రత్యక్షరాన్ని నియమబద్ధంగా, సర్వ ప్రాణులూ సంతోషించే విధంగా ఉచ్చరించాలి. ఇంతకుమించిన ఉపాసన లేనేలేదు.

దశరధుడు శ్రీరామ విరహంలో దేహత్యాగం చేశాడు. అంత్యక్రియలు చక్కగా సమాప్తమయినాయి. అనంతరం సభ తీరింది. వశిష్ఠ ప్రభృతులు సమావేశమైనారు. అందరూ కర్తవ్యాన్ని భరతునకు నివేదిస్తున్నారు. "నాయనా! నాన్నగారి నిమిత్తం నీవు శోకింపదగదు. వారు వాస్తవంగా కీర్తిశేషులు, దేవేంద్ర సమ్రా

నితులు. ఏ నాన్నగారి వచనాల్ని శిరసావహించి సుగుణాభి రాముడు శ్రీరాముడు పత్నీ, సోదర సహితంగా వనరాజ్య పట్టాభిషేకం చేసి కొన్నాడో ఆ నాన్నగారి వచనాల్ని సత్యం చేయవలసిన బాధ్యత నీయందుకూడ ఉంది. ఇప్పుడు అయోధ్యావాసులందరు నీపరిపాలనను హృదయపూర్వకంగా కోరుకొంటున్నారు. నాన్నా! భరతా!! ఇంక అవిలంబంగా అయోధ్యాసింహాసనాన్ని అలంకరించటమే నీకర్తవ్యం"

కౌసల్యాదేవికూడ లాలనగా ఇదే విషయాన్ని భరతునకు నచ్చచెప్పింది.

అప్పుడు భరతుడంటాడుగదా! "అభివందనాలు. అందరూ నా శ్రేయోభిలాషులు నా శ్రేయస్సును చక్కగా ఆలోచించి కర్తవ్యాన్ని నివేదించారు. వశిష్ఠులంతటివారు, కౌసల్య అంతటి తల్లి కలలో నయినా ధర్మమే బోధిస్తారుగానీ అధర్మమెలా బోధిస్తారు? అట్టి పూజ్యులు మతానికి భిన్నంగా మాట్లాడవలసి వస్తున్నది. కైకేయీ పుత్రుని విషయంలో ఇదేం ఆశ్చర్యంకాదు. అసలు ఈలోకంలో భరతుడెందుకు పుట్టాడు?

కాలంతీరింది. నాన్నగారు దేహత్యాగం చేశారు. సమస్త సుఖాలు అనుభవించి లబ్ధ ప్రతిష్ఠులయినవారి నిమిత్తం శోకించవల సిన అవసరం ఎంతమాత్రంలేదు. నాశోకమంతా ఒక్క శ్రీరాముని నిమిత్తమే. సుఖాలనుభవించవలసిన వయసులో కుశలపై శయనిస్తూ ఫలాహారంతో, అదికూడా సరిగా ఉండీ లేక అలా అన్నగారు— వదినగారు —లక్ష్మణుడు కొండలలో పాదరక్షలుకూడ లేకుండా సంచరిస్తున్నారే ఏ సహృదయుడు ఈ సంఘటననుచూచి జీవించి యుండగలడు? అందుకుకారణం ఎవరు? నాతల్లి దౌర్భాగ్యురాలు

కైకేయి. ఎవని సద్గుణాలు శత్రువుల్నికూడ ముగ్ధుల్ని చేసేవో, ఎవని సౌందర్యం పశువుల్నికూడ పరవశుల్నిచేసేదో అట్టి శ్రీరాముడు నాతల్లికి శత్రువయినాడు. అంతా నాదురదృష్టం. నాతల్లి దుర్మార్గురాలు, నేను సజ్జనుడనని ఎలా చెప్పేది? ఈ కైకేయీ కుతంత్రంలో భరతునకు సంబంధంలేదని నాతల్లి, తండ్రి, గురువు, దైవాలు శ్రీ సీతారాములు అంటారేమోగానీ చివరకు లక్ష్మణుడు కూడ నావిషయంలో శంకించితీరేదే. అయోధ్యావాసులందరూ ముక్త కంఠంతో ఘోషించేదే;—ఈ భరతుని సహకారం లేకుండా ఇంత సాహసం అబల కైకేయి ఎలా చేయగలిగింది? ఈభరతుడు ఇక్ష్వాకు వంశానికి ముసలంగా కైకేయి కడుపున చెడబుట్టాడు. తల్లిచే ఇంత చదరంగం ఆడించి మహారాజుని స్వర్గానికి పంపించాడు, సమస్త చరాచర జీవులకు అత్యంత ప్రేమాస్పదులయిన జానకీరాముల్ని వనాలకు పంపించాడు. ఎంత పయోముఖ విషకుంభం! భరతుడెంత పయోముఖ విషకుంభం!!" ఇలా ప్రజలంతా నిందిస్తుంటే, ఈ కైకేయీ కుపుత్రునికి అయోధ్యాసింహాసనం అందించాలని మీరంతా ఆలోచిస్తున్నారు. నాయందలి వ్యామోహం మిమ్మల్ని ఎంతగా నేల కూల ద్రోసింది! విధివంచితునకు గురువులు—పరివారం-ప్రజలు-సమస్త లోకం వ్యతిరేకంగా ఉంటుందనే జనవాక్యం నేడు అక్షరాలా నిజమయింది. ఇప్పుడు నేనేం మాట్లాడను. మీరు మీస్వార్ధంతో సమయోచితంగా మాట్లాడుతున్నారుగానీ నాసుఖాన్ని ఆలోచించి ఎంత మాత్రం మాట్లాడుటలేదు. నాహృదయంలో ధర్మఘంట మ్రోగు తోంది. శ్రీ సీతారాముల పాదసేవలోదక్క భరతునకు ఇంకెందునా సుఖంలేదు, లేదు, ముమ్మాటికీలేదు. నా అనుపస్థితిలో ఇంత చదరంగం నాతల్లి ఆడింది కనుక నా ఆత్మతృప్తి నిమిత్తం——ప్రజల మనస్సమాధానం నిమిత్తం ముందు నేను అవిలంబంగా శ్రీ సీతా

రాముల్ని దర్శించి, అపరాధక్షమాపణ చెప్పుకొంటూ ఏడ్చి, ఏడ్చి కడుపును తేలిక చేసికోవాలి. వారిని అవశ్యం అయోధ్యకు రప్పించి తీరాలి. ఇందుకుగాను అవసరమయితే నేను—శత్రుఘ్నుడు-లక్ష్మణుడు వనవాసం చేస్తాం. నా యీ ప్రయత్నానికి మీరందరకు హృదయపూర్వకంగా సహకరిస్తారని ఆశిస్తున్నాను."

సంపూర్ణ అయోధ్యాజనత భరత భారతికి మనస్ఫూర్తిగా తమ అంతఃకరణాన్ని హారతిచేసింది.

అది చిత్రకూటం. సమయోచితంగా వశిష్ఠమహర్షి శ్రీరామునకు నివేదించారు—"భరతుడు ఆర్తుడు. ధర్మఘంట ఆర్తుల హృదయాలలో మాత్రమే మ్రోగుతుంది. అందువలన భరత భారతిని ఆలకించి, రామచంద్రా! నీకెలా ఉచితంగా ఉంటే అలా వ్యవహరించు."

నిండు సభలో భరతుడు నిలువునా నీరు నీరయినాడు. ఆతని ప్రేమ వివశునిగా గాంచి మనుషులమాటేల, కంట తడిపెట్టని ప్రాణి చిత్రకూటంలో ఒక్కటికూడాలేదు. రాళ్ళు ద్రవీభవించాయి. మరి ప్రాణవంతులో? ప్రాణాన్ని కోల్పోయారు. ఇది అక్షరాలా వాస్తవం. ప్రేమకు అసాధ్యమనేది లేనేలేదు. చిత్రకూటం చాలాచిత్రంగా మార్పుచెందింది.

ఆగి—ఆగి ధర్మఘంట మ్రోగుతోంది;

"కరుణామయుడు—సర్వజనాంతర్యామి అయిన నాస్వామికి నివేదించవలసిన ఆవసరం ఉందని నేను కలలోకూడా అనుకోటం

లేదు. వశిష్ఠాది గురుజనం నా యందు ఈ అసహనీయమయిన బాధ్యత ఉంచారు కనుక తప్పనిసరిగా నివేదించుకొంటున్నాను;

ఇంతమంది తపస్వులున్న ఈ మహాసభలో నోరెత్తిమాట్లాడి పాప భాగినవుతున్నానే అసలు నేనెందుకు ఈలోకంలో పుట్టాను?

మన స్వప్రీతిగా ఉన్నా—లేకున్నా మహనీయుల మతాన్ని "చూస్తాను—చేస్తాను—ఆలోచిస్తాను" అనకుండా వెంటనే-వెంటనే ఎంతమాత్రం కాలహరణం చేయకుండా ఆచరించి చూపించాలి. అది సత్కార్యమగుగాక! దుష్కార్యమగుగాక! అందే దాసునకు కళ్యాణం, సుఖం.

"అయితే ఇప్పుడు నేనేం మాట్లాడను?"

భరతుడు చిత్రకూటానికి శ్రీరామ సోదరునిగా రాలేదు, భక్తునిగా రాలేదు, కైకేయీ కుపుత్రునిగా, ఆర్తునిగా వచ్చాడు. ఆర్తవాణిని ఆలకించకుంటే కౌసల్యాతనయుడు కరుణాపయోనిధి ఎలా అవుతాడు?

భరతుడు శ్రీ సీతారాముల్ని తన ప్రతివాక్యంలో బహువచనంలో సంబోధిస్తున్నాడు. ఎంతటి మర్యాద!

"మా అందరి హృదయాల్ని అధ్యయనం చేయగల అమృతహృదయుడు స్వామి. స్వామి స్వభావం బాల్యంనుండి నాకు బాగుగా తెలుసు. మా అందరి వర్తమాన స్థితిని, ప్రేమ వివశతను ప్రత్యక్షంగా చూస్తూనే వున్నారు. స్వామి మనసుకు భిన్నగా వారిని అయోధ్యకు వచ్చి చేరవలసిందిగా ఎంత మాత్రం నేను నిర్బంధించుటలేదు.

నాకు, నా ప్రజలకు ఎందు సుఖమో, కళ్యాణమో ఆ మార్గాన్ని సూచించ వలసిందిగా మాత్రం నివేదించుకొంటున్నాను."

ఎంత క్లుప్తాక్షరాలు! అబ్బ! నిజంగా ఎంత నవనీతాలు !!

అయోధ్యనుండి పాదచారిగా భరతుడింత దూరప్రాంతం చిత్రకూటానికి ఎందుకు వచ్చాడు? 700 మంది కౌసల్యా ప్రభృతి మహిషులు, వశిష్ఠాది గురువులు, సమస్త అయోధ్యా వాసులు, చివ అకు ఏనుగులు, గుఱ్ఱాలు ఇంత భారీయాత్ర చేసి ఎందుకు చిత్రకూటానికి వచ్చాయి? శ్రీ సీతారాముల్ని అయోధ్యకు మరల్చటానికికాదా? మరి ఎవరును ప్రభువుకు ఆ మాట విన్నవింపరేమో?

గౌరవనీయుల సమక్షంలో మనసును చంపుకోవాలని, అధికంగా మాట్లాడరాదని, సమయోచితంగా మాట్లాడాలని, అదే ధర్మమని, అట్టి ధర్మాన్ని రక్షించటం లోనే ఆత్మ కళ్యాణం—విశ్వకళ్యాణం సిద్ధిస్తుందని ఎఱుగని మూర్ఖులా అయోధ్యావాసులు?

"ఆఁ! తరువాత శ్రీరాముడేమన్నాడో?"

"నాన్నా! భరతా!! అన్నీ తెలిసిన వాడవు. నీకు అధికంగా చెప్ప నవసరం లేదు. మన ఇక్ష్వాకు వంశస్థులందరు ప్రజా సుఖమే స్వసుఖంగా భావించి, ఎట్టి త్యాగాని కయినా సిద్ధ మయినట్టి వారు. నాన్నగారి ఆత్మతృప్తి నిమిత్తం నేనిలా వనాలకు వచ్చాను, నాన్న గారు స్వర్గస్థులయారా, ఇపుడు సంరక్షకుడు లేకుంటే ఈ అయోధ్యా వాసులేమవుతారు? నాన్నా! మానవ జీవితం పార్థం నిమిత్తం—స్వసుఖం నిమిత్తం కాదు. అట్టి జీవితాన్ని పశు జీవితం అంటారు. త్యాగ పూర్ణమయిన దొక్కటే మానవ జీవితం. మానవ శరీరం

వలన కొద్దిగనో, గొప్పగనో ఇతర సమస్త ప్రాణులు. సుఖించాలి ఇది ప్రతి ఒక్కరికి జీవిత లక్ష్యమై తీరాలి. నీవు అయోధ్యకు వెళ్ళి జనసంరక్షణ బాధ్యతను, తమ్ముడూ! స్వీకరించి తీరాలి. నీ కోసరం కాదు, ఈ ఆర్తజనావళి కోసరం. క్షత్రియులంగా పుట్టినందుకు ఇది మన ధర్మం. ఈ ధర్మాన్ని నాశనం చేస్తే సమస్త ప్రపంచం నాశన మవుతుంది."

ధర్మ ఘంట ఆగింది. సోదరులు శ్రీరామభరతుల సుమధుర సమ్మేళనం లో ధరిత్రి ఊగింది. ధన్య జీవులు శ్రీ తులసీ దాసుగారి జీవితం ఆ దృశ్యానికి, భరత భారతికి శాశ్వతంగా హారతి అయింది.

నాన్నగారిచ్చిన వనరాజ్యాన్ని స్వీకరించినవాడు శ్రీరాములు అయితే అయోధ్యారాజ్యం భరతునకు నాన్నగారీయలేదా? భరతుడు దానిని స్వీకరింపక నంది గ్రామం వెళ్ళినాడేమి? ఆహా! నిస్సంశ యంగా భరతుడు శ్రీరాముని గన్న యధికుడు.

భరతుడే ఆవిర్భవింపకుంటే త్యాగం – నమ్రత – సేవాపరా యణత – శిష్టాచారం – దుఃఖ సహిష్ణుత–లోకాపవాద భీతి – భ్రాతృ భక్తి ఈ సద్గుణాల వైభవం జగాని కెలా గ్రాహ్య మవుతుంది? దుర్గుణాలకు – దురభ్యాసాలకు లోనయిన ఈ కలికాల ప్రజలు బాగుపడుటకు భువన భాస్కరుడు మరెవడున్నాడు?

గౌరవం ఇచ్చి పుచ్చుకోవాలి. ముందు త్యాగియై, తరువాత మహారాజు కావాలి, మాటలో మాధుర్యాన్ని నింపి బాహ్యాన్ని, అం తరాన్ని పరిమళ భరితం చేసి కోవాలి, దుర్మార్గాన్ని, దుర్మార్గుల్ని ద్వేషించి, నిందించరాదు. అలా చేస్తే నీవు దుర్మార్గుడ వవుతావు.

అందరిచే నిందింపబడుతావు. ప్రపంచాన్ని ప్రేమతో, సేవలో, త్యాగంతో జయించాలి. స్వార్థంతో స్వాధీనం చేసికొనరాదు.

ఒకటే మాట! రామాయణానికి ఏకైకాదర్శమూర్తి భరతుడు.

శ్రీరాముడు గొప్పవాడా? కాదు, శ్రీరామ సేవకులే గొప్పవారు.

ధర్మఘంట మ్రోగుతుంది; "హే దుఃఖీమానవులారా! భరతునివలె మాట్లాడటం నేర్చుకోండి, చాలు, సుఖించితీరుతారు."



# (22) "నరుడా ! కర్మ ఫలం గురించి ఆలోచించకు."

ప్రతి ఒక్క కర్మకు ఫలాన్నుత్పత్తి చేసే లక్షణం సహజం గానే ఉంది. అనవసరంగా నరుడా! ఫలాన్నపేక్షించి ఎందుకు నీ మనసును మలినం చేసికొంటావు? "కామం - క్రోధం - లోభం అనేవి నాకు సహజ లక్షణాలు. నేను ఫలాన్ని కాంక్షించకుండ వుండలేను" అంటే అది చాలా తప్పు. మనసుకు ఈ అరిషడ్వర్గాలు సహజం కావు. అది కేవలం ఈశ్వరునకు నివాసమందిరం. "సంగాత్సంజాయతే కామః." మనసు విషయాల్ని చూచి, ప్రపంచాన్ని చూచి ఆసక్తమవుతోంది. చూడకుంటే ఆసక్తి లేదు, ఆగ లేదు, దుఃఖం లేదు. అరిషడ్వర్గాలు బయటి ప్రపంచంనుండి వచ్చి మానవుని దుఃఖింప చేస్తున్నాయి. ఇట్టి వీనిని మనం స్వచ్ఛమయిన మనసులోనికి రానీయట మెందుకు? దుఃఖించు టెందులకు? ఒక పర్యాయం వీనిని రానిచ్చామా వదుల్చుకోవటం చాలా కష్టం, రానీయటం సులభమే. వదుల్చుకొనుటకే ఎన్ని జన్మలో అవసర మవుతున్నాయి.

"నాకు ఫలాపేక్ష లేదు. కాని నాయందు ఫలాపేక్ష నుంచి ప్రక్కనున్నవారు నన్ను దుఃఖింప చేస్తుంటే నేనేం చేయాలి?"

ఇదేం ప్రశ్నకాదు. ఫలాపేక్ష లేకుంటే నీవు దుఃఖించటం అసంభవం. నీవు దుఃఖిస్తున్నావంటే నీలో ఫలాపేక్ష సూక్ష్మంగా ఉన్నదనే అర్థం. ఆ మనుషుల్ని - వారి క్రియాకలాపాన్ని చూచీ చూడకుండ సంచరించటమే నీ కర్తవ్యం. అసలు కర్మ కర్తవ్య బుద్ధితో ఉండాలి. అప్పుడది ఈశ్వరుడనే ఫలాన్ని ప్రకటంచేస్తుంది నిశ్చలమగు ఆ మనస్థ్సితిలో అఖండానందం అవతరిస్తుంది.

అడుగులు వేసికొంటూ వెళ్ళు. అంతే, అవనియందలి ప్రతి ఇసుకరేణువు సత్యం శివం సుందరమయి తీరుతుంది.

"ఫలితం గురించి ఆలోచించకుండా కర్మ చేస్తే లోకం అతనిని బుద్ధిహీనుడనదా?"

అంటుంది. ఇక్కడ చెప్పుకొంటున్నది కర్తవ్య కర్మల విషయం. వానిని నిష్కామంగానే ఆచరించాలి. కర్తవ్య కర్మలకు లక్ష్యం వ్యక్తి కళ్యాణంకాదు, విశ్వకళ్యాణం. విశ్వకళ్యాణంలో వ్యక్తి కళ్యాణంకూడ అంతర్లీనమేగదా!

"కర్మ నేనుచేశాను. నేను దీనిఫలితాన్ని అనుభవించాలి." అనుకోవటంలోనే సుఖంవెంట దుఃఖంకూడా అడుగులు వేస్తోంది. కర్మచేసిన 'నేను' ఆ 'నేను' అది గోపాలకృష్ణుడు నేను-ఆత్మ-లేక ఈశ్వరుడు ఒక్కడే. ఈ నానాత్వమంతా-రూప వైచిత్ర్యమంతా మాయప్రవాహం. అందు పవిత్ర ధర్మగంగ ఆచివరినుండి ఈ చివరికి ద్రుతగతితో ప్రవహించాలి. ఆ ప్రవాహంలో సమస్త తన్మయమయి ప్రవహించగా, సమస్త నామరూపాలు నశిం మిగులునదొక్కటి మాత్రమే. అదే 'నేను', బ్రహ్మ లేక కృష్ణ

కాన శరీర వృక్షానికి పక్షులు రెండే జీవేశ్వరులు. వారు సమాన ధర్మయుక్తులవటమే ఫలం, తక్కినదంతా నిష్ఫలం. అస్తు.

గోపాలకృష్ణుని జీవితాన్ని పరిశీలిద్దాం. నిజంగా అతడు పురుషసింహం. సర్వతోముఖ ప్రతిభావంతుడు, అతనికి భౌతిక విజ్ఞాన దిశగా చేతకాని కార్యమంటూ ఏంలేదు. సర్వసమర్థుడు. పిన్ననాటనే అసాధారణ కార్యాలలో చాతుర్యాన్ని ప్రదర్శించి, సర్వ జన శిరోమణి అయినాడు. కంసమామను వధించాడు. అప్పుడు మధురా సామ్రాజ్యాన్ని స్వాధీనంచేసికొనివుంటే గోపాలుడు వ్రజ బాలలకు మాత్రమే పరిమితం కాకుండా, సమస్త ప్రపంచానికి పరి పాలకుని రూపంలో పరమేశ్వరుడు కాగలిగేవాడు. నందుడెలాగో సామంతరాజు, నందనందనుడు జనేశ్వరుడు కావటం ఎంతయినా సముచితం. అయినా గోపాలుడు గోపాలుడుగా, సలహాదారుగా మాత్రమే నిలిచి ఉగ్రసేనుని మధురాపురాధినేతను చేశాడు. లోక మంతా గోపాలుని గొప్పదనానికి తప్పనిసరిగా ప్రణమిల్లవలసి వచ్చింది. "ఎంత నిష్కామ కర్మయోగి గోపాలుడు!"

ఇట్టి సందర్భాలెన్నో తటస్థపడ్డాయి. జరాసంధుని వధింపచేసి ఆరాజ్యాన్ని అతని కుమారులకే అప్పగించాడు. నరకాసురుని వధించి ఆరాజ్యాన్ని అతనికుమారులకే అప్పగించాడు. బాణాసురుని వధించి ఆరాజ్యాన్ని అతని కుమారులకే అప్పగించాడు. రాజ్యాలు నిలబెట్టాడు. ఎందరినో రాజులుగా రూపొందించాడు. కాని తాను మాత్రం గోపాలుడుగానే నిలిచాడు.

విశ్వకళ్యాణ కాంక్షతో పాండవ కౌరవులందరి శ్రేయస్సు కాంక్షిస్తూ, పాండవదూతగా దుర్యోధనునకు నచ్చచెప్పవచ్చాడు.

అఖండ రాజనీతి ధురంధరుడు, అయినా దుర్యోధనుడు దారికి రాలేదు. చివరకు కౌరవ పాండవయుద్ధం అనివార్యమయింది. రాజ్యాలేలవలసిన గోపాలకృష్ణుడు అశ్వ సంచాలకుడయినాడు. "సింహాసనం అధిరోహిస్తే ఏ సేవకూడ జరుగదు. సింహాసనం ప్రక్కనుంటే, కాళ్ళదగ్గరుంటే బాగుగా సేవాకార్యాలు జరుగుతాయి, నీరాజనాలు అందుతాయి." ఈ రహస్యాన్ని ప్రభువు చక్కగా గ్రహించాడు. ప్రభువు సలహాలు, కృపాకటాక్షం లేకుంటే మహా తపశ్శాలురు కౌరవుల్ని వధించటానికి ఈ పాండవులేపాటివారు? కృష్ణుడు రధం ముందున్నాడు గనుకనే రధంపై అర్జునుడు నిలబడ గలిగాడు, సునాయాసంగా కౌరవవీరుల్ని సంహరింపగలిగాడు. అంతతో గత్యాన్యాయరీత్యా హస్తినాపురాధినేత కావలసింది సమ యోచిత ప్రజ్ఞాశాలి—సర్వసమర్ధుడు గోపాలుడు కానీ ధర్మరాజు కాదు. అయినా ఉదారహృదయంతో ధర్మరాజుని పట్టాభిషిక్తుని చేశాడంటే ఎంత నిష్కామ కర్మయోగి మన గోపాలకృష్ణుడు ధర్మ రాజునిచే అశ్వమేధయాగం చేయించి, అర్జునునిచే ఎందరో దుష్టుల్ని వధింపచేసిన గోపాలుడు, ఆసేతు హిమాచలంనుండి భూరి భూరి ప్రశంసల్ని అందుకొన్న గోపాలుడు కడకు గోపాలుడుగానే వృక్ష చ్ఛాయలో దేహాన్ని త్యజించాడు. ఇదిగో దీన్నే 'నిష్కామకర్మ యోగ' మంటారు.

———

# (23) "నరుడా! సోమరిగావుంటే ప్రకృతి నిన్ను శపిస్తుంది. కర్మచేయుననే అధికారం నీకులేదు."

రావణ సంహారమయింది. విభీషణ పట్టాభిషేకంకూడా అయింది. మర్యాదా పురుషోత్తముడు శ్రీరామచంద్రుడు సీతాలక్ష్మ ణులతో, రాక్షస మిత్రులతో, వానరమిత్రులతో పుష్పకవిమానంపై అయోధ్యకు తిరుగుప్రయాణం సాగిస్తున్నాడు. కిష్కింద సమీ పిస్తుంటే శ్రీరామునితో హనుమ ఒక నివేదనచేశాడు; "ప్రభూ! అదిగో ఆపర్వత సమీప గుహలలో మాతల్లి అంజన ఘోరతపం చేస్తోంది. రావణునితో యుద్ధకారణంగా ఆమెనుచూచి చాలకాల మయింది. అసలు మాటేమంటే ఆమె మీదర్శనానికి అత్యంత విహ్వలురాలు. ఒక్కసారి ఆమెను చూచివద్దాం. నామాట కాదన కండి."

శ్రీరామునకు సీతాసమాచారాన్ని, సీతాదేవికి శ్రీరామ సమా చారాన్ని నివేదించి వారి ప్రాణాల్ని రక్షించింది మన వీరహను మానుడే. సంజీవనితెచ్చి, లక్ష్మణునకు ఎవరు ప్రాణంపోశారు? మన వీరహనుమానుడే, అనుల్లంఘనీయమగు నూరు యోజనాల

సముద్రాన్ని లంఘించి, త్రికూటాచలంపై అత్యంత రహస్యంగా ఉన్న లంకానగరంలో ప్రవేశించి, సీతనూరడించి, రాక్షసులకూల్చి లంకనుకాల్చి వచ్చిందెవరు? మన వీరహనుమానుడు కాడా? అట్టి హనుమానుని వినతిని కరుణాపయోనిధి అయితే దాశరధి ఎలా నిరాకరించగలరు? వెంటనే అందరూ అంజనా సన్నిధానానికి చేరుకొన్నారు.

"అమ్మా! వచ్చానమ్మా! నేనొచ్చేశానమ్మా! అమ్మ సీతను, అయ్య రాముని తోడుచేసికొని వచ్చానమ్మా! నీతపం ఫలించిందమ్మా! కరుణాపయోనిధి దాశరధి సపరివారంగా యుద్ధంలో రావణునివధించి, సకుశలంగా తిరిగివచ్చారమ్మా! ఇంకా ఎందుకమ్మా ఈతపం? కళ్ళు తెఱిచి చూడవేమిటమ్మా!"

అంజన కళ్ళుతెఱిచి చూచింది. చూచింది, బాగాచూచింది. కౌసల్యాకుమారుని తనకళ్ళకు అంజనం చేసేసుకొంది. తరువాత తనకుమారుని చూచింది. తనువు చెప్పరానంతగా మంటలు గ్రక్కుతోంది. ఆంజనేయుడు కంపించి పోతున్నాడు. అంజన మాట్లాడుతుందిగదా అవి మాటలుకావు, మంటలు, నిజం, మంటలే.

"ఏమిరా ఏమన్నావు? శ్రీరాముడు యుద్ధంలో రావణుని వధించి, పత్నీసహితంగా, కుశలంగా తిరిగి వచ్చాడా?"

"అవునమ్మా!"

"నాకడుపున చెడబుట్టావుగదరా దౌర్భాగ్యుడా! ఎంత సోమరివయినావురా నీచుడా! ఇంతమాత్రం సేవచేయటానికయినా నోచుకొనక పోయినతరువాత ఎందుకురా ఇంకానీవీశరీరాన్ని పోషించటం? రావణుడు చావాలంటే ఈ కమల కోమల సుకుమార శరీరుడు

కౌసల్యాసుతుడు రాత్రింబగళ్ళు, ఏడుదినాలు యుద్ధంచేశాడా? అప్పుడు నీవేమైనావురా కృతఘ్నుడా? నా పాలబలాన్ని పరిహసించే నీవలన నీవేగాదు నేనుచెడ్డాను, వీరుచెడ్డారు. ఈ సమస్త ప్రకృతి చెడ్డది. నా పాలుత్రాగి ఎంత సోమరివయినావురా? ఉండకు ఇఁక ఒక్కక్షణం నీవు నాకన్నుల ముందుండకు. పో. శ్రీరాముని వెంట అయోధ్యకు పో. చేసిన తప్పిదానికి ఫలరూపంగా ఆ జీవనం అప్రమత్తుడవై అమ్మా నాన్నల్ని సేవించుకో."

ఆంజనేయుడు ఆపాదమస్తకం ద్రవీభవించాడు. అంతరాత్మ అపరిమితంగా సంతాపానికి గురయింది.

"ప్రతి ఒక్కడూ ఘనుడనని, అద్వితీయ సేవకుడనని అహంకరించేవాడే. జరిగిన తప్పులనెప్పుడయినా ఇతరుల ముఖంగా వినవలసిందే, ఎంతగా ఇతరులు నిందిస్తే అంతగా జీవితం అమృత స్వరూపమవుతుంది. ఎంతగా ప్రశంసిస్తే అంతగా పతనమవుతుంది. శరీరధారణ చేస్తున్నప్పుడు ఆ శరీరాన్ని సేవాధర్మంలో నియోగించక మానవుడు సోమరియైతే వెంటనే ఇప్పుడే ఈ ప్రకృతియే ఆతనిని శపించి తీరుతుంది. ఆతడు వర్తమాన శరీరంలోనే దుఃఖించి తీరుతాడు."

"అవును, నిజమే. ప్రక్కనే నేనుండి ఏడుదినాలు-అదియు రాత్రింబగళ్ళు రామస్వామిచే రణంజరిపించాను. నిజంగా ఈలోకంలో నాపుట్టుక వ్యర్థం. ఇంకా ఇలా శరీరధారణ చేస్తున్నందుకు జననీ ఆదేశానుసారం అవశ్య జానకీరాముల సేవచేసికొని తీరవలసిందే."

వెంటనే హనుమకు మరొక ఆలోచన వచ్చింది. భయంతో నిదానంగా పెదవులు కదల్చాడు. మాటమాత్రం వ్యక్తమవుతోంది:-

"అమ్మా! నీవుచెప్పింది నిజమే. నేను చాలా అధమాధము డను. అయితే మాటిమాటికి; అమ్మా! నా పాలు, నాపాలంటావు. ఏమిటి నీపాలకుగల ప్రత్యేకత? ఈలోకంలో ప్రతిజీవి తల్లిపాల వలననేగదా వృద్ధిచెందుతోంది!"

కుమారుని మాటలు పూర్తికానేలేదు, అంజన తన కంచు కొన్ని తొలగించి, స్తనములనుండి పాలను ప్రకటంచేసింది. తపో మూర్తులగు వారికి ఈక్షుద్ర భౌతికవస్తువులు లోపిస్తాయా? అందునా ఆదినాలలో తల్లులు జీవితపర్యంతం సమృద్ధిగా పాలుకలిగియుండే వారు.

అంతే! రెండు అఖండధారలు అతితీవ్రంగా బహిర్గతమై, ఎదుటనున్న రెండు పర్వతాల్ని సమూలంగా ఛేదించేశాయి.

తల్లి ప్రభావానికి నిశ్చేష్టుడయిన హనుమంతుడు అపరిమిత సంతాపంతో ఆమె పాదాలపై పడ్డాడు.

వెనువెంట రాక్షసవీరులు—వానరవీరులేనా; సీతారామలక్ష్మ ణులుకూడా భక్తితో ఆమె పాదాలకు ప్రణమిల్లారు.

ఎందుకు ప్రణమిల్లరు! అలవాటు ఆజన్మాంతం అలాగే నిలిచి వుంటుంది. అది అంతరించటం అసంభవం. కౌసల్యాది తల్లులు— వశిష్ఠాది గురువులు ఎంతదూరంనుండి కనులబడెడువారో, అక్కడ నుండియే మన శ్రీరాముడు సాష్టాంగ దండప్రణామంతో వారిని గౌరవించేవాడు. అయితే శ్రీరామునిచే దండప్రణామాలు చేయించు కొనేటంత హృదయ హీనులావారు? కారు. సజల నేత్రాలతో పరుగు పరుగునవచ్చి శ్రీరాముని బాహుపాశంలో బంధించేశేవారు.

నిజంగా ఎవరు ధర్మాత్ములు? ఆ శ్రీరాముడు, వశిష్ఠాదులు, ఎవర్ని ముందుగా ఆరాధించాలి? సేవాధర్మంలో జీవించి, రోమ రోమంలో శ్రీరాముని బంధించుకొన్న ఆంజనేయుని మాత్రమే.

"శ్రీరామభక్త వీరహనుమాన్‌కీ జై!"

— — —

# (24) యోగం - జడభరతుడు

శ్లో॥ యోగస్థః కురుకర్మాణి సంగంత్యక్త్వా ధనంజయ,
సిద్ధ్యసిద్ధ్యోః సమోభూత్వా సమత్వం యోగఉచ్యతే॥
(భగవద్గీత అ॥ 2-శ్లో॥ 48.)

"ధనంజయా! విషయ విముఖుడా! యోగివై కర్మ ప్రవృత్తుడవుకా! యోగమంటే ఏమిటి? ఆసక్తి లేకుండుట. కర్మఫలమందు కాంక్షలేకుండుట. సర్వకాల సర్వావస్థలందు సమానంగాఉండే విషయాతీత - త్రిగుణాతీత స్థితియే యోగం"

కర్మకు మూలం కామనలు. సమస్తకామనల బిందుస్థానంలో ధర్మపభువుకు ప్రాణప్రతిష్ఠ జరుగాలి. కామోత్కంఠత గోపికలు, భయమున కంసుడు, వైరక్రియ శిశుపాల ముఖ్యనృపతులు, సంబంధంతో యాదవులు, ప్రేమతో శౌనకాదులు భగవత్సంబంధ సుఖమనుభవించారు. ఎవరెట్టివారో భగవంతుడు వారికట్టివాడు. మేడమీదనుండి క్రిందకు దిగాలంటే ఏ సోపానాల్ని అధిరోహించి వ్యక్తి మేడమీదకు వెళ్ళాడో, సాధారణంగా అవే సోపానాలనుండి క్రిందకు దిగవలసివుంటుంది. పైకెక్కేటప్పుడు ముఖం ఊర్ధ్వదిశగా, దిగేటప్పుడు భూదిశగా ఉంటుంది, ఇంతేభేదం. ఇట్లే ఏకర్మలు లౌకి

కాలో ఆవే ఆత్మానందానికికూడ కారణాలు. ఒకటేమాట! సమస్త ధర్మకర్మలకు ఏకైకలక్ష్యం భగవంతుడు, అంటే ఆత్మ.

"యోఽకామో నిష్కామ ఆప్తకామ ఆత్మకామోన తస్య ప్రాణా ఉత్క్రామంతి బ్రహ్మైవసన్ బ్రహ్మాప్యేతి." (బృహదారణ్యకోపనిషద్.) "శ్రోత్రియస్యచాకా మహతస్య." (తైత్తిరీయోపనిషద్.) అకాముడు—నిష్కాముడు-బ్రహ్మ. ఇవి బ్రహ్మకు—బ్రహ్మజ్ఞునకు పర్యాయపదాలని ధర్మఘంటా నినాదం. కాని నిష్ఠా మునియందు, నిష్కామ కర్మలందు భగవంతుడు గృహప్రవేశం చేసితీరాలి. ఎవడు యజ్ఞాంతమందు విరాజమానుడో వానివలననే కర్మలు యజ్ఞరూపంపొంది, యజ్ఞపాయసం అనుగ్రహించాలి.

"యోగం—అనపేక్ష—సంకల్ప రాహిత్యం-అసంసక్తి." వాస్తవంలో వీనిస్వరూపం, అనుభవం ఎలా ఉంటాయి? శరీరముండగా సంకల్పత్యాగం-వాంఛాత్యాగం—లేక సుఖదుఃఖాల కతీతంగా ఉండటం సాధ్యమా? తప్పక సాధ్యం శరీరంలో ఉంటూనే శరీరాని కతీతంగా, త్రిగుణాలలో ఉంటూనే వానికతీతంగా, సుఖదుఃఖాలనుభవిస్తూ అనుభవింపనివాడుగా. సంకల్పిస్తూ ఆ సంకల్పాలు తనవికాకుండా, సంసారలో సన్న్యాసివలె అవశ్యముండవచ్చును. జడభరత, జనక, ప్రహ్లాద ప్రభృతులవలె నేడుకూడ తప్పక మానవుడు రూపొందవచ్చును. "బాల్యేనతిష్ఠాసేత్—" "బాలోన్మత్త పిశాచవత్." సర్వసంకల్ప సన్న్యాసియైన యోగి-అంతరారాముడు భౌతిక ప్రపంచంలో బాలునివలె, ఉన్మత్తునివలె, పిచాచంవలె జీవిస్తాడు. సమస్తం అనుభవిస్తున్నా చివరకు ఏమీ అనుభవించని వాడుగానే యోగిఉంటాడు. సంకల్పంఅయితే చేస్తాడు. సంకల్పించే

ఆ మనసులో ఉన్నది పరమాత్మయైనపుడు ఇక ఆగుణాలు జీవునెలా బంధిస్తాయి? యోగి పంచభూత శరీరంలో మనోవాక్కాయాలతో దినచర్య సాగిస్తూనే వానికి నాయకుడై ఉంటాడుగానీ దాసుడుగా ఉండడు. యోగిమనోవాక్కాయాలు అప్రాకృత శక్తిసంపన్నాలు-సచ్చిదానందాత్మకాలు. మనోవాక్కాయాల దర్పణాలలో ఆత్మ ప్రతిబింబాన్నే చూసేయోగి ఇంద్రియకర్మలకు-త్రిగుణాలకు-సుఖ దుఃఖాలకు అతీతుడై మరోప్రపంచంలో విహరిస్తుంటాడు, బాలుని వలె చరిస్తుంటాడు.

మూడు సంవత్సరాలవరకు బాలునకు మలమూత్రాలలో ఉంటే అసహ్యం కలుగుతోందా? అరణ్యాలలో తిరుగుతున్నా భయంకలుగుతోందా? పుత్రకాంక్షలేదు, ధనకాంక్షలేదు. కీర్తికాంక్ష లేనేలేదు. మాతృస్తనాల్ని మర్దిస్తున్నప్పుడయినా కామవికారంలేదు ధనార్జనలేదు, రక్షణలేదు. తల్లిదండ్రులు దండింప ద్వేషంలేదు. పగతీర్చుకొనాలనే ప్రవృత్తిలేదు. బట్టకట్టిన సంతోషంలేదు, కట్టకున్న చింత లేదు. వివస్త్రుడై తిరుగాలంటే సంకోచంలేదు. మానావమానాల స్పృహయేలేదు, స్నానంచేసినా, చేయకున్నా, అలంకరింపబడినా, లేకున్నా శరీర భావమేలేదు, గంధమలదినా, బురద పూసినా మనసుకు చంచలతలేదు. నగ్నస్త్రీని చూస్తుంటే లజ్జా సంకోచాలులేవు. నిద్రించటానికి మంచమక్కఱలేదు, పరుపులక్కఱ లేదు. ఎక్కడవీలయినా అక్కడ విశ్రమించటమే. ఏ విషయంలో కూడా వ్యసనంలేదు, స్తుతిస్తే సంతోషంలేదు, నిందిస్తే దుఃఖం లేదు. తల్లి పెట్టినదానితోనే సంతోషం. "ఇతరులేమనకొంటారో" యని చింత లేదు, వారినిమిత్తం దినచర్యను దిద్దుకొనటంలేదు. ఆత్మ సంతోషానికనుకూలంగా, నిరాటంకంగా, స్వేచ్ఛా స్వాతంత్రాలతో

ముందుకుసాగి పోవటమే ఆతనిధ్యేయం. జనాన్ని వంచించటం, కల్ల కపటాలు కలలోనయినాలేవు. వ్యర్ధ భాషణంలేదు, లోకవార్తా సంగ్రహమనలేలేదు, విధి నిషేధాలులేవు, అరిషడ్వర్గ ప్రాబల్యంలేదు, ప్రపంచ దృష్టిలేదు, సుఖంకోసఱం ప్రయత్నంలేదు, ఆకలయితే 'అమ్మా!' అనటంతప్ప ఇంకేమీ తెలియదు. "లడ్డూలు కావాలి, కారం ఎక్కువయింది, నీళ్ళుకావాలి" అని అడగటం తెలియనే తెలియదు. ఎవరయినా బెదరించి, భయపెడితే "మా అమ్మతోచెపుతానుండు" అని మాత్రం అంటాడు. అమ్మతక్క ఆతనికి మరొక రక్షకులెవరూలేరు. ఇట్లే ఈశ్వరుడుతక్క వేరొండు రక్షకులు—ఆధారం లేనేలేరని మనసా-వాచా-కర్మణా విశ్వసించి, తదనుగుణమయిన నడవడి కలిగియుండటాన్నే 'శరణాగతి' అంటారు. ఆ! సాధారణ బాలుడే ఇలా సర్వసంకల్ప సంన్యాసియై అసంగుడుగా జీవిస్తుంటే అంతరారాముడు యోగి ఎందుకు జీవించలేడు?

శ్లో॥ దుఃఖేష్వను ద్విగ్నమనాః సుఖేషువిగత స్పృహః,
వీతరాగ భయక్రోధః స్థితధీర్మని రుచ్యతే॥

(భగవద్గీత అ॥ 2-శ్లో॥ 56.)

"ఎవడు ముని? దుఃఖసమయంలో ఉద్రిక్తుడు కానివాడు, సుఖసమయంలో సంతోషం లేనివాడు, రాగభయ క్రోధాలులేనివాడు, స్వాధీనాంతఃకరణుడు. అట్టివాని జీవితమే మహాయజ్ఞం-మహాతపం.

ఋషభుని కుమారుడు భరతుడు. ఆతడు జడునివలె ఉండేవాడు. అందువలన జడభరతుడయినాడు. తండ్రి వంశాచారం ప్రకారం ఎన్నివిద్యలో బోధింపజూచాడు, అయినా భరతునకు ఒక్క అక్షరంకూడ పట్టువడలేదు, అసలయిన చదువు చదవగలవారికి ఈ

పొట్టకూటి చదువులవల్ల ఏముంది? బ్రహ్మవిద్వరిష్ఠుడు ఈ క్షుద్ర సాంసారిక జీవులకు జడునివలె, అసమర్థునివలెనే ఉంటాడు, అది యాతనికి సహజం. తండ్రిగతించాడు. తదనంతరం సవతితల్లి కుమారులు భరతుని ఎంతగానో హింసించారు. చేయరాని పనులు చేయించారు. ఇంటిచాకిరీ అంతా చేయించారు. కాని భరతుడు అకర్మణ్యుడుగదా! జనన మరణ బంధమే లేనివాడు గృహబంధానికి బద్ధుడవుతాడా? శరీరదృష్టియే లేనివానివలన ఏకార్యాలు సంపన్నమవుతాయి? ఫలితంగా సోదరులు అత్యంత కుపితులయినారు. ఏం చేస్తారు? పశువులకాపరిగా నియోగించారు. శరీరమున్నంతవరకు [illegible]నిచే ఎవరికి ఎంతఋణమో దానిని తీర్చాలిగదా! పశువుల్ని మేపుకు రావటం భరతునివలన ఏమవుతుంది. పశువులు పొట్టనిండా మేతమేసి తమదారితాము చూచుకొనేవి. ఎందుకు పనికిరాని దౌర్భాగ్యుడు తిండి దండుగగా తయారయినాడని సవతితల్లి చక్కగా భరతుని పూజ చేసింది, సోదరులు ఆగ్రహోదగ్రులయినారు. చివరకు భరతుడు క్షేత్రపాలకుడయినాడు. పక్షులు చేను పాడుచేయకుండా జాగ్రత్తగా కాపలా కాయాలి. భరతునిదగ్గర జాగ్రత్తఎక్కడిది? ఆతడు ఆత్మ వ్యవసాయపరుడు. అందు అప్రమత్తుడు. ఇప్పటి విధినిర్వహణం భరతునకు చాల యోగ్యంగా ఉంది. ఇంటినుండి అన్నంవస్తే తినేవాడు, లేకుంటేలేదు. వచ్చినా ఆ అన్నం అమిత దుర్గంధయుక్తంగా, చాలీ, చాలకుండా వుండేది. ఆతనికి పర్యాప్త సంతృప్తిని నిశ్చలమనసే అందిస్తుండేది. ఆత్మబలంతో భరతుడు అన్నం తిన్నా — తినకున్నా, స్నానంచేసినా చేయకున్నా అపూర్వ జ్ఞాన సౌరభంతో, హృష్టపుష్టంగా, నిత్యసంతోషిగా ఉండేవాడు. ఆరోజులలో కాళీమాతకు నరబలి ఇచ్చేఆచారం ఉండేది. నరుల మనస్థితి

ఎంతగా పతనమయిందో ఎంతో చక్కగా ఈఆచారం తెలియచేస్తోంది. జగజ్జనని ఎఱుపురంగుఅంటే ఇష్టపడుతుంది. ఆమె దేహ వర్ణం ఎఱుపు. అందువలన ఆమెపూజలో కుంకుమకు అత్యంత ప్రాశస్త్యం ఏర్పడింది. జగత్తును ప్రేమించి—పోషించే తల్లికి సంతానం తల నుకానుక చేయటం ఎంతఘోరం! నరబలికి బలిష్ఠుడు కావాలి. అందునిమిత్తం ఆదేశాన్నేలే రాజుగారు అన్వేషణార్థం తన భటుల్ని నలుదిశలకు పంపించారు. వారికి పచ్చనిపొలాలో అత్యంత బలవం తుడయిన పురుషుడుగా జడభరతుడు కానవచ్చాడు. భటులు ఎన్ని రకాలుగా ప్రశ్నించినా భరతునినుండి ఏ సమాధానమూలేదు. అమితసంతోషంతో భరతుని నిర్బంధించి, రాజసన్నిధికి గొం పోయారు. రాజు చాలసంతసించి, పారితోషికంతో భటుల్ని ఆనం దభరితుల్ని చేశారు. బలిదినం రానేవచ్చింది. సేవకులు భరతుని చక్కగా స్నానంచేయించి శృంగారంచేశారు. కమ్మని నేతి మిఠా యీలతో కడుపునిండా భోజనంపెట్టారు. ఆనందం! బ్రహ్మానందం!! రాజు మాతకు తనను బలిచేస్తున్నాడన్న దుఃఖం భరతునకు లేశ మయినలేదు. ఎందుకు దుఃఖం! అతని ఏకాదశేంద్రియాలు ఆత్మ దగ్గరున్నాయి. ఇంక శారీరకంగా సుఖం—దుఃఖం అనేవి ఉండనే ఉండవు. ఆ భరతుడు నడుస్తున్న మార్గంవేరు, ఈ పామరులు నడుస్తున్న మార్గంవేరు. దైవమార్గంలో పయనించేవారికి ఈరెండవ మార్గం ఎంతమాత్రం కానరాదు. ఈ లౌకికులకుకూడ అలాగే ఆ దైవమార్గం–ఆమార్గగాములు ఎంతమాత్రం అర్థంకారు. భటులు భరతుని శిరచ్ఛేదనం చేయటానికి ఖడ్గం పైకెత్తారు, అంతే. తల్లి హృదయం అపరిమితంగా తల్లడిల్లింది, తక్షణం అచట ప్రత్యక్షమై కనురెప్పపాటు సమయంలో కాళి అందరికి ఈ భూలోకంనుండి

వీడ్కోలుచెప్పింది. బ్రాహ్మణుడు, బ్రహ్మజ్ఞుడు, తాత్త్వికుడు అయిన భరతుని బలిదాన కార్యాన్ని అనుశీల-భక్తిలోల బాల ఎలా సహించగలుగుతుంది? తల్లి నవనీత హృదయానికి పులకిత గాత్రుడయిన భరతుడు సజలనేత్రాలతో పుడమిపై పడ్డాడు. అంతులేని వాత్సల్యంతో జగన్మాత తనయుని తలనిమిరి ఆశీర్వదించింది.

ఎట్టి పరిస్థితులు ఎదురయినా ధైర్యంగా వానిమధ్యనుండి ముందుకు సాగిపోవాలి. ప్రకృతి సహజాలయిన శీతోష్ణాల్ని ఉపాయాలతో ధైర్యంగా—యుక్తిగా మానవుడు ఎలా సహిస్తున్నాడో, ఆ శీతోష్ణాదుల్ని యుక్తాహార విహారాదులతో ఎలా తనజీవితానికి తీయని మిత్రులుగా రూపొందించుకొంటున్నాడో అలాగే ప్రకృతి జన్యాలగు అనుకూల—అననుకూల జీవిత సమస్యల్నికూడ రూపొందించుకోవాలి. ఈ భార్యాబిడ్డలు-ధనజనాలు-సుఖదుఃఖాలు-ఇవన్నీ మానవుని వెట్లవుతాయి? ఈ శరీరమే మానవునిది కాదుగదా? ఇది మూనాళ్ళముచ్చట. ఒక తరగతినుండి మరొక తరగతికి విద్యార్థి ఎలా మార్పు చెందుతుంటాడో, అలాగే ఒకసమస్య లేదా సంఘటన నుండి—శరీరాన్నుండి మరొక సంఘటనకు—శరీరానికి మార్పు చెందుటలో జీవుడు తటస్థుడుగా—అసంగుడుగా-ధీరుడుగా ఉండాలి. ఇది ఎంతమాత్రం వేదాంతోపదేశంకాదు. సుఖంగా జీవించడానికి ఈ భౌతిక ప్రపంచంలో ప్రతిఒక్క మానవునకు కావలసిన చక్కని సలహా.

జడభరతుడు అసంగుడు, ఆతని జీవితాన్ని అధ్యయనంచేసి ప్రతిఒక్క మానవుడు అసంగుడు కావాలి, జడభరతుడు కావాలి.

అట్టి జడభరతుల స్థితిగతులు ఇంకా వివరంగా చెప్పబడుతున్నాయి.

అర్జునుడు ప్రశ్నించాడు;

శ్లో॥ స్థితప్రజ్ఞస్యకా భాషాసమాధి స్థస్యకేశవ,
స్థితధీః కింప్రభాషేత కిమాసీత ప్రజేతకిమ్॥

(భగవద్గీత అ॥ 2–శ్లో॥ 54 )

"కేశవా! సమత్వరూప బుద్ధియోగాన్ని ఆశ్రయించి, నిష్కామ కర్మయోగంలో జీవించే స్థితప్రజ్ఞుని లక్షణాలెలా వుంటాయి? ఎలా మాట్లాడుతాడు? ఎలా కూర్చుంటాడు? ఎలా నడుస్తాడు?"

అంటే స్థితప్రజ్ఞుని ప్రవృత్తి గురించి ప్రశ్నించబడింది.

ఇందుకు సమాధానంగా భగవంతుడు "ప్రజహాతి యదా కామాన్" అనే శ్లోకంలో స్థితప్రజ్ఞుడు మాట్లాడడని, అంతరారాముడుగా ఉంటాడని చెప్పాడు. స్థితప్రజ్ఞుడు రాగద్వేషాలకు, సుఖదుఃఖాలకు అతీతంగా ఇంద్రియ వ్యాపార రహితుడుగా ఉంటాడు. శాంతి సామ్రాజ్యంలో మాత్రమే చరిస్తాడు.

ప్రతి ఇంద్రియానికి ఒక్కొక్క వ్యాపారముంది. ఆయా వ్యాపారాలు ఇంద్రియాలకు ఆహారాలు. ఇంద్రియాలు తమ ఆహారం నిమిత్తం వ్యగ్రంగా ఉంటాయి, ఆ వ్యాపారాలలో వ్యసనం చెందిఉంటాయి. ఇంద్రియాలకు వానినినడిపించే ఆత్మలేదా శ్రీకృష్ణ పరమాత్మ ఆహారంకావాలి, ఆ ఆహారంతో ఇంద్రియాలు పుష్టి చెంది, దివ్యత్వాన్నిపొందాలి, ఆ శ్యామ ప్రేమరసం ఆహారంగా అందకుంటే క్షీణించాలి. 'దీన్నే 'భక్తి' యంటారు.

(భగవద్గీత అ॥ 2–శ్లో॥ 61.)

"వయసో వివిధత్వేఽపి సర్వభక్తి రసాశ్రయః." (భక్తి రసామృత సింధువు.) శ్రీకృష్ణపరమాత్మ భక్తిః రసామృతసింధువు. సహస్రారం గోలోకం. గోపురస స్వరూపం. గోపాలుడు రస స్వరూపం. అయితే గోలోకం సహస్రారం–రసనికేతనం. సహస్ర సహస్రముఖీ రసవాహినికది జన్మస్థానం. ఇంద్రియనిగ్రహ పరున కది ఇంతింతనరాని రసాస్వాదన స్థానం. జీవి జీవించవలసిన దిచటనే, అందుకు భిన్నమయిన బాహ్యజీవితాన్ని, సుఖాన్ని ఏశాస్త్రం– ఏ సజ్జనుడుకూడ జీవితమనటంలేదు, సుఖమనటంలేదు, మానవుడా! ఇంద్రియ నిగ్రహపరుడవుకా!

— — —

# (25) ఇంద్రియ నిగ్రహం

శ్లో॥ ఇంద్రియాణాం హి చరతాం యన్మనోను విధీయతే,
తదస్య హరతిప్రజ్ఞాం వాయుర్నావ మివాంభసి॥

శ్లో॥ యదా సంహరతేచాయం కూర్మోంఽగా నీవసర్వశః,
ఇంద్రియాణీంద్రియార్థేభ్య స్తస్యప్రజ్ఞా ప్రతిష్ఠితా॥
(భగవద్గీత అ॥ 2–శ్లో॥ 67–58.)

"నీళ్ళల్లో ఉన్ననావ వాయువువలన ఎలా మునిగిపోతుందో అలాగే మనసుతోకూడిన ఇంద్రియం ఒకే ఒక్క ఇంద్రియం బుద్ధి హీనుని సర్వనాశనం చేసేస్తుంది.

తాబేలు ఎలా తన అవయవాల్ని అవసరానుగుణంగా తన లోనికి ఆకర్షించుకొంటుందో అలాగే ఇంద్రియాల్ని అంతర్ముఖం చేసికొనగల ధీరుడుమాత్రమే బుద్ధిమంతుడుగా—ఆ తరువాత భగవంతుడుగా రూపొందుతాడు."

ఇంద్రియనిగ్రహం గురించి సందేశమిచ్చే వానిలో మహాభారతం అనమానమయింది. ఇంద్రియనిగ్రహం ఒక్కటిమాత్రమే ఇంద్రియబలాన్ని వృద్ధిచేసి, మానవునకు దీర్ఘాయువు నీయగలుగు

తోంది. అదిలేని కారణంగానే శంతనుని తరువాత ఆతని పుత్రులు అచిరకాలంలో మృత్యుగ్రస్థులయినారు. ఇంద్రియనిగ్రహంగల భీష్ముడుమాత్రం ఎన్నితరాల పర్యంతమో దేహధారణచేసి, ఐచ్ఛికంగా భగవంతుని యందైక్యమయినాడు.

శ్లో॥ కానీనస్యమునేః స్వసోదరవధూ వైధవ్యవిధ్వంసినః,
నప్తారః కిలగోళకస్యతనయాఃకుండాః స్వయంపాండవాః,
పంచైతేచ సమానయోనినిరతాః ఖ్యాతా జగద్విశ్రుతాః,
తచ్చారిత్రమహాశేష పాపహరణం ధర్మస్యసూక్ష్మాగతిః॥

కృష్ణ ద్వైపాయనుడు కన్యాపుత్రుడు, సోదరుడయిన విచిత్రవీర్యుని భార్యలయందు సంతానము కలిగించినవాడు. అట్టివానికి మనుమలు పాండవులు, పోనీయనినవారు స్వయంగా గోళకుడయిన పాండురాజుని పుత్రులు. స్వయంగా కుండులు. అనగా తండ్రియుండగా ఇతరునకు పుట్టినవారు. అన్నిటికినీమించి వారు అయిదుగురును ఒకే భార్యగలవారు. ఇట్టి లోకవిరుద్ధ ప్రవర్తనగల పాండవులు మహాపురుషులుగా జగద్విఖ్యాతులు. వారిచరిత్ర సర్వపాపహరకం, ఆహా! ధర్మగతి ఎంత సూక్ష్మమయింది!

(వేదాంతదేశిక.)

(1) మహాభారతం పంచమవేదం, అదిగానీ, మరే ఇతర పురాణాలుగానీ పుస్తకాలుగావు. కేవలం భగవత్స్వరూపాలు. (2) వేదవ్యాసుడో? సాక్షాత్ నారాయణావతారం. (3) వేదవ్యాసుడు పురాణాల్ని వ్రాయలేదు. ఋషీశ్వరుని సమాధిస్థితిలో ఆ సమాధి ఆనందం పురాణాల రూపంగా బహిరంగమయింది. (4) పురాణ

కథలు కథలుగావు, ఆ పాత్రధారులు మానవులుగారు, వారందరు నిరాకారతత్త్వానికి ఆకారాలు, లీలాసాధనాలు. (5) గ్రామం ఎంత దూరంలో ఉన్నదో మార్గమధ్యంలోని కిలో మీటరురాళ్ళు సూచిస్తుంటాయి. అవి సంకేతమాత్రాలు, ఆ గుర్తులవలన గుర్తింపవలసింది వీనికి దూరంగాఉంది. అలాగే పురాణకథలు సంకేతమాత్రాలు. ఈ సంకేతాలవలన సంపాదింపవలసిన ఆత్మ ఇంద్రియాతీతంగా ఉంది. (6) వేదవ్యాసుడు భగవంతుడు. ఆయన వ్యభిచరిస్తాడా? వ్యభిచరించలేదు. పురాణాలలో 'శీలభంగం' అని ఎక్కడ తటస్థపడినా 'శీలవృద్ధి' యని అర్థంచేసికోవాలి. పురాణాల సమాధిభాష ప్రాకృతభాష లన్నింటికి అతీతమయింది. (7) ఆ చరిత్రకారులు పాపాత్ములయితే వానివలన ఆధునిక మానవుల పాపాలెలా హరిస్తాయి? కానియవి ఎంతమాత్రం పాపకార్యాలుకావు. (8) భవిష్యత్తులో కురువంశంతో శ్రీకృష్ణభగవానునకు సంబంధముంటుందని జ్ఞానదృష్టితో గమనించి, వంశవిస్తరణార్థం వేదవ్యాసుడు తన తపశ్శక్తిని అంబ—అంబిక—అంబాలికలకు అనుగ్రహించాడు. ఇది పాపకార్యమవుతుందా? పుణ్యకార్యమవుతుందా? ఆలోచించాలి. (9) శ్రీకృష్ణభగవానుని రాసలీల ఎట్టివో ఇతర పాత్రధారుల వ్యభిచారం కూడ అట్టిదే, అంతటి ఋషీశ్వరులు సదుద్దేశంతో ఆలింగనాదులు జరిపినారు. అయితే ప్రాధాన్యం భావానికిగానీ, క్రియకుగాదు. (10) ఆ ఋషీశ్వరులు పాపం చేయకుండినట్లయితే, తపశ్శక్తినే ధారపోసినట్లయితే కన్యాత్వం దూషితం కాకుండునట్లుగా వరమీయవలసిన అవసరమేముంది! లోకమర్యాదలో ఎంతయినా అవసరమేముంది! (11) మరొకమాట వ్యభిచారంవలన దుష్టులు జన్మిస్తారు, జగద్విఖ్యాత మహాపురుషులెలా అవతరిస్తారు? (12) ఏ పురాణంలోని

ఏపాత్ర ధారినయినా, ఏ సంఘటననయినా మానవతాదృష్టితో అధ్య యనం చేయకూడదు, అతీంద్రియ జ్ఞానంతో అనుసంధానంచేయాలి. అప్పుడే ఆనందంలభిస్తుంది. అంతవరకు అంధవిశ్వాసంతో కథా శ్రవణం చేయటం మాత్రమే మానవకర్తవ్యం. 13 ద్రౌపది శచీదేవి అంశతోపుట్టింది — అయోనిజ. యజ్ఞంచేస్తున్న సమయంలో ద్రుపదుని యజ్ఞవేదికనుండి పుట్టింది. అయోనిజులకు మానవ ధర్మా లుండవు. శీలభంగ సమస్య ఉండనేఉండదు. (14) అగ్నితత్త్వా నికి ప్రాణమయిన కుండలిని ద్రౌపది. వీర్యమే నిగ్రహింపబడిన పుడు, అంతర్ముఖమై కుండలినీ అవుతోంది. కాన మహాభారతకధ ఇంద్రియ నిగ్రహపరులకథ. ఇది ముమ్మాటికి వాస్తవం. యోగ వచనం. కుండలినీ మానవశరీరంలో ప్రయాణిస్తూ పంచప్రాణాల్ని భోగిస్తుంది. ఆ పంచప్రాణాలే పంచపాండవులు.

దేహానికి ఆధారం శ్వాస, శ్వాసకాధారం కుండలిని. కుండ లినికాధారం సంకల్ప వికల్పాలు. వానికాధారం ఆత్మ.

ఋజుమార్గగామి అర్జునుడు సమానవాయువు. శరీరమంతటా వ్యాపించేవుండే ఆ వాయువును నడిపించే కుండలిని గాండీవం. ధర్మ రాజు వ్యానవాయువు, భీమసేనుడు ఉదానం. నకుల సహదేవులు ప్రాణాపానాలు. ఎల్లప్పుడు దేవునితో నడిచేవాణ్ణి సహదేవుడంటు న్నారు. రహస్యం, ఒకేదేవేంద్రుడు అయిదుగురు పాండవులైనాడు.

(15) ధరణీ — ధనం నిమిత్తం గృహకలహాలతో సోద రులు కౌరవులు యుద్ధానికిదిగి సర్వనాశనమయినారు. విషయీ పురు షుల దురవస్థను, నాశనాన్ని ఇంత హృదయంగమంగా ప్రబోధిస్తు న్న గ్రంథం మరొకటేముంది? మహాభారతకథను అవాస్తవం అనే

వారుకూడా ఇంతచక్కని నీతిని పొందుతున్నప్పుడు దాని సర్వాంగీణ సౌందర్యాన్ని, ఆధునిక మానవులకు దానివలనవుండే ఉపయోగాన్ని ఎలా కాదనగలరు?

(16) మహాభారతంలోని ధర్మం మరెక్కడాలేదు. దాని వలన ప్రతిఒక్క మానవుడు మహానుభావుడు కావలసిందే. ఇది వేదవ్యాసుల దృఢశపథం.

— — —

# (26) ధర్మం - ఈశ్వరుడు

శ్లో॥ తత్కర్మ హరితోషం యత్సావిద్యాతన్మతిర్యథా,
హరిర్దేహ భృతామాత్మా స్వయంప్రకృతిరీశ్వరః॥
(శ్రీమద్భాగవతం. స్కం 4–అ॥ 29-శ్లో॥ 49.)

"శ్రీహరిని ప్రసన్నుని చేసే కర్మయే కర్మ. శ్రీహరిప్రేమను ప్రసాదించే విద్యయే విద్య. అయితే ఎవడా శ్రీహరి? ఎక్కడున్నాడు? సమస్త మానవుల కాత్మయైయున్నాడు. అందరూ ఏ వ్యాపకతత్త్వాన్ని "నేను—నేను" అని సంబోధిస్తారే ఆ తత్త్వమే శ్రీహరి. ఆ శ్రీహరి సమస్త ప్రకృతికి ఈశ్వరుడు–నియామకుడు."

"క్లేశకర్మ విపాకాశయైః అపరామృష్టః పురుష విశేషః స ఈశ్వరః."

(పాతంజల యోగసూత్రాలు.)

"అవిద్యా-అస్మితా-రాగం-ద్వేషం-అభినివేశం అనేవి పంచ క్లేశాలు. ఆ క్లేశాలవలనగాని, వాని కర్మవలనగాని, ఆ కర్మపరిపాకం వలనగాని, కర్మ వాసనలవలనగాని స్పృశింపబడని ఉత్తమ పురుషుడు ఈశ్వరుడు."

శ్లో॥ క్షరాక్షర మతీతోహం అక్షరాదపిచోత్తమః,
అతోఽస్మి లోకేవేదేచ ప్రథితః పురుషోత్తమః॥
(భగవద్గీత అ॥ 15–శ్లో॥ 18)

జీవాత్మలు క్షరపురుషులు. అక్షరపురుషుడు కూటస్థుడు లేక సగుణబ్రహ్మ. పురుషోత్తముడు, పరమాత్మ, ఈశ్వరుడు లేక నారాయణుడు క్షరా క్షరాతీతుడు. ఈతడు నిర్గుణ—నిర్వికల్ప—నిరాఖ్యాత శుద్ధుడు, ప్రకృతిపురుషుల క్షోభవలన సృష్టిఅయింది. ఏ పురుషునికి—ప్రకృతికిమధ్య క్షోభకలిగిందో ఆపురుషుడే అక్షర పురుషుడు. "ఉపాసకానాం క్షేమార్థం బ్రహ్మణో రూపకల్పనా." ఉపాసక జనసౌకర్యార్థమై, వారియందు వాత్సల్యంతో నిర్గుణ నిరాకారుడు సగుణ సాకారుడవుతున్నాడు.

శ్లో॥ మత్తః పరతరం నాన్యత్కించిదస్తి ధనంజయ,
మయి సర్వమిదం ప్రోతం సూత్రేమణిగణాఇవ॥
(భగవద్గీత అ॥ 7–శ్లో॥ 7.)

"ధనంజయా! మణిహారగర్భంలో సూత్రం ఎలాఉంటుందో, అలా ఈ ప్రపంచ గర్భంలో నేనున్నాను. నేనుగాక వేరొండు తత్త్వం లేనేలేదు. నాకన్న ఉన్నత తత్త్వంకూడ లేదు."

"ద్యూతం ఛలయితామస్మి తేజస్తేజస్వినామహమ్॥
(భగవద్గీత అ॥ 10–శ్లో॥ 36.)

"మోసగించేవానిలో జూదం భగవంతుడు."

సద్వస్తువులన్నీ భగవంతుడంటే సమంజసమే. ఈ జూదం భగవంతుడనటం ఎలా సమంజసం?

సృష్టిలో అసత్పదార్థమనేది లేనేలేదు. ఆ భగవంతుడే ఈ సృష్టిరూపంలో ఉన్నాడు.

ఏకాగ్రగ్రతవలన అసత్తుకూడ సత్తవుతోంది. ఇంక జూదం ఎందుకు భగవత్స్వరూపం కాదు?

నిమ్న దృష్టితో చూసేవారు మానవులు. ఈ మానవులకు ముందున్న మాయలోని గుణ—దోషాలు అంటే మంచి—చెడు మాత్రమే కన్పిస్తాయి కానీ అసలు స్వరూపం ఎలా కన్పిస్తుంది? వస్తుస్థితిలో నిస్సంశయంగా మంచి—చెడు అనేవి లేనేలేవు. పై దృష్టితో—సమదృష్టితో—తాత్త్విక దృష్టితో దర్శిస్తే సర్వత్రా శ్యామసుందరుని రాసవిలాసమే. సమస్త జడచేతన ప్రకృతి గోపికా స్వరూపం. ఆ పురుషోత్తముడొక్కడే భోక్త. సర్వత్ర రసప్రవాహమే ప్రవాహం.

ఒక సజ్జనునకు ఇరువురు కుమారులు. పెద్దవాడు సజ్జనుడు-చిన్నవాడు దుర్జనుడు. ఇది లోకందృష్టిలో మాత్రమే. లోకం ఘోషిస్తుందే; "తండ్రి సజ్జనుడుకాగా కుమారుడు దుర్జనుడెట్లయినాడు?" ఆ తండ్రికూడా దుర్మార్గుడయిన కారణంగా చిన్నకుమారుని నిందిస్తాడు, హింసిస్తాడు. అయినప్పటికి హృదయంలో దుర్మార్గుడనే ద్వేషం లేకుండా, కుమారుడనే ప్రేమయేరాజ్యం చేస్తుంటుంది. సాధారణ లౌకికస్థితియే ఇలావుంటే జగత్పిత ఆనందసామ్రాజ్యం ఆయనకు భిన్నంగా మంచి-చెడు అనేనామ లు-రూపాలు ఉ

ఉండవు. ధర్మఘంట మ్రోగితీరాలి; ధర్మప్రభువు ఎంత దయామయుడు!

ఈశ్వర దర్శనం;

శ్లో॥ విషయా వినివర్తన్తే నిరాహారస్య దేహినః,
రసవర్జం రసోప్యస్య పరందృష్ట్వా నివర్తతే॥

"ఇంద్రియాల్ని వాని, వాని విషయాలనుండి మరల్చినా, అంటే ఇంద్రియాలకు శబ్దస్పర్శ రూపరస గంధరూప విషయాలు ఆహారంగా లభింపకున్నా, మనసులో రసం అనగా వాసన—ఆకాంక్ష శేషించేవుంటుంది. అదెప్పుడు చస్తుంది? "పరందృష్ట్వా" "ఈ భౌతికచక్షువులకు గోచరంకాకుండా, అతీతంగా ఉండేదాన్ని చూచినప్పుడు మాత్రమే."

శ్లో॥ సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాత్మని,
ఈక్షతేయోగ యుక్తాత్మా సర్వత్ర సమదర్శనః॥

శ్లో॥ యోమాంపశ్యతి సర్వత్ర సర్వంచమయిపశ్యతి,
తస్యాహం నప్రణశ్యామి సచమేన ప్రణశ్యతి॥
(భగవద్గీత అ॥ 6—శ్లో॥ 29-30.)

"అర్జునా! ఆత్మను సర్వభూతాలలో, సర్వభూతాల్ని ఆత్మలో చూడగలగాలి. ఇందుకు యోగయుక్తుడు కావాలి. అంటే శారీరక—వాచిక—మానసిక కర్మఫలితాల్ని అపేక్షింపకూడదు. 'స్వ' విశాలంకావాలి, అంటే స్వార్థం పరమార్థంకావాలి. ఆత్మదృష్టితో ఇతరప్రాణుల సుఖంలో సుఖాన్ని, దుఃఖంలో దుఃఖాన్ని అనుభ

వించాలి. ఇతర ప్రాణుల్ని సుఖింపచేసే నిమిత్తం దుఃఖాన్ని సుఖంగా అనుభవించాలి. అర్జునా! ఇలా ఆత్మదృష్టిగల యోగికి నేనప్రకటంగా ఉండలేను. మరియు ఆయోగి నాకప్రకటంగా ఉండలేడు."

ఈశ్వరుడు వైకుంఠ—కైలాసాలలో విష్ణు—శివ రూపాలలో—ఉన్నాడా? ఉండచ్చును. వారితో సాధకులకు లేశమయినా ప్రయోజనంలేదు. సహచర జీవజాలంలో ఈశ్వరుని చూడగలగాలి, వాని సుఖదుఃఖాలలో సుఖదుఃఖాలనుభవించ గలగాలి. అట్టియోగికి పూజలెందుకు? జపాలెందుకు? పూజా జపతపాలకన్న శీఘ్రంగా భూతదయ అంతఃకరణ మాలిన్యాన్ని క్షాళనంచేస్తుంది, లోవెలుగును ప్రకటంచేస్తుంది. "ధర్మో విశ్వస్య జగతః ప్రతిష్ఠా." (శ్రుతి.) ధర్మం సమప్రాణులకు అంతః—బహిఃప్రాణం. ఆ ధర్మానికే మరొకపేరు భూతదయ. తోటిప్రాణులయందులేదు, ఫలితంగా విశ్వైకకళ్యాణ మూలమగు ధర్మాచరణంలేదు. మనసులో కోరికఉన్నా శరీరం ధర్మానుష్ఠానం చేయలేకపోవటానికి ఏమిటికారణం? కామక్రోధాలు—భూతదయారాహిత్యం. "శబ్దస్పర్శ రూపరసగంధ విషయాల్ని ఇంకా—ఇంకా అనుభవించాలి. తృప్తియా? లేదు. అందువలన సుఖనాశకులపై క్రోధం, తోటిప్రాణుల సుఖాన్ని చూచి సహించలేక వానిసుఖాన్ని నాశనంచేయటం జరుగుతోంది. శరీరం—శరీరసుఖాలే ప్రధానమనుకొనేవానికి దయఎట్లా ఉంటుంది? ధర్మమెట్లా ఉంటుంది? దైవమంటే ఈ భూతాలలో—భూతదయలో—ధర్మంలోనిహితమై ఉండేతత్వం. పైవి లేనివానికి దైవభక్తి ఉండటం చెప్పాలా? కలలోనివార్త.

భగవత్సాక్షాత్కారం పొందవచ్చును, అణిమాద్యష్ట సిద్ధుల్ని బడయవచ్చును, సశరీరంతో పరలోకాలకు వెళ్ళచ్చును, బ్రహ్మకు అభీష్ట రూపాన్నిచ్చి భూలోకానికి రప్పించవచ్చును. అయినా ఆ ఇష్టదైవాన్ని కోటి ప్రాణులలో, సహృదయంలో దర్శింపగల గటం మాత్రం అసంభవం. విశ్వాత్మ దృష్టి సమస్త సాధనల కంతంలో ప్రభుకృప వలన మాత్రమే లభిస్తుంది. నామ దేవుడు అనన్య పాండురంగ భక్తుడు. నిరంతరం పాండురంగనితో సంభాషించేవాడు. పరమాత్మ పాండురంగడు కేవలం తన దగ్గరనే తన కధీనంగా ఉన్నాడని నామ దేవునకు గర్వం. అట్టి సమయంలో జ్ఞాన దేవుడు నామ దేవుని సభాముఖంగా పరీక్షించి స్పష్టంగా ఇలా చెప్పాడు; ఆ నామదేవున కింకను దేహదష్టి-ప్రపంచదృష్టి నశించ లేదు. ఈతడు పాండురంగని కృపకు-అద్వైతాను భవానికి చాల దూరుడు. పాండురంగనితో నిరంతరం మాట్లాడుతున్నంత మాత్రాన కృప ప్రాప్తించినదని భ్రమించరాదు. అందువలన సదసద్వివేక సంపాదనార్థం ఇప్పుడు నామదేవుడు గురుకులవాసం చేయటం చాల అవసరం. ఆచార్య రూపంలో ఉంటేనే మాత్రమే పరమాత్మ ముముక్షువుల అజ్ఞానాన్ని దూరం చేయగలుగుతాడు. పాండురంగడు కూడ సూచించగా నామదేవుడు అపర శివుడయిన వీశోబా కేశుని ఆశ్రమానికి వెళ్ళాడు. ఆశ్చర్యం! ఏమియాదృశ్యం! వీశోబాకేశుడు తన రెండుపాదాల్ని శివలింగంపై నుంచి గాఢనిద్రలో శరీర స్పృహలేక పడియున్నాడు. ఆతడు నిద్రాగ్రస్తుడు కాడు, సమాధిస్థుడు. నామదేవుడు సజల నేత్రాలతో వినతిచేశాడు. అక్షమ్య శివాపరాధమిది యని కరములు జోడించాడు. వీశోబాకేశుడు కనులు తెరిచి నవ్వుతూ అంటాడు గదా; "అలాగా నాయనా! అయితే

శివలింగం లేని స్థానంలో నాపాదాలనుంచు. దయతో నీవీ కష్టంచేయి. చూస్తున్నావుగా! నేను వృద్ధుణ్ణి పూర్తిగా అశక్తున్ని! ఆశ్చర్యం ఎక్కడ పాదాలుంచినా అక్కడ నామ దేవునకు శివలింగమే కాన వచ్చింది. ఆ జ్యోతిర్లింగ ప్రకాశంలో నామదేవుడు జ్ఞానదృష్టి నార్జించాడు, అమృత లింగ సాన్నిధ్యంలో అమృత హృదయాన్ని సంపాదించాడు. వీశోబాకేశు డంటున్నాడు; నిండు సభలో జ్ఞాన దేవునిచే నీవవమానింపబడినావు గదా! నామదేవా! అవమాన దుఃఖంతో అప్పుడు నీవు అపరిమింతంగా దుఃఖించావు. అదే నీ అపరిపక్వ హృదయాన్ని తెలియచేస్తోంది. హృధయం అమృతం కావాలంటే కేవలం పూజా జపాలు—సంకీర్తన మాత్రమే సరిపోవు. ముందు తోటి ప్రాణులులకు ప్రేమతో సేవచేయాలి. తరువాత అందరిలో అన్నిస్థానాలలో—నిజహృదయంలో రంగని చూడగలగాలి. ఇదే అద్వైతసిద్ధికి రాచబాట" అంతే! నామదేవుడు వీశోబాకేశునకు పరిపూర్ణంగా శరణాగతుడయాడు.

ఆత్మ:

శ్లో॥ ధ్యానే నాత్మని పశ్యంతి కేచిదాత్మాన మాత్మనా,
అన్యే సాంఖ్యేన యోగేన కర్మయోగేన చాపరే॥

(భగవద్గీత అ 13—శ్లో 24)

"ఆ పరమాత్మను ఎందరో ధ్యానయోగముచే, మరెందరో జ్ఞానముచే, మరియు కర్మచే హృదయమున పొందుచున్నారు."

"తస్యా శ్శిఖాయామధ్యే పరమాత్మా వ్యవస్థితేః, సబ్రహ్మ సశివసహరి సఇంద్ర సోఽక్షరః పరమ స్స్వరాట్.

(మంత్రపుష్పం)

"హృదయ శిఖామధ్యంలో పరమాత్మ విరాజ మానుడు. ఆతడే బ్రహ్మ, శివుడు, విష్ణువు మరియు విరాట్"

పూర్వం రాక్షసులెందరో తమోగుణ ప్రధానంగా ఘోరతపం చేసి, సచ్చిదానంద స్వరూపాన్ని కనులారా దర్శించారు. అయినా వారి వాసనలు నివృత్తి కాలేదు. దీర్ఘాయువును, అపరిమిత పరాక్రమాన్ని, త్రిభువన శాసన శక్తిని వారు అర్థించారు. ఇందువలన భగవ ద్దర్శనమయినా వాసనలు నివృత్తి కావని అర్ధమవుతోంది. లేకుంటే దర్శనమిచ్చిన ఆ భగవానునే అర్థింపని వారెవరయిన వుంటారా? ఆత్మలో భగవంతుని దర్శించటమే నిజమయిన దర్శనం. అప్పుడు మాత్రమే వాసనలు అంతరిస్తాయి. మనసు సభీజంగా తన్మయం కాగలుగుతుంది.

భగవద్గీతలోగాని. మరెచటనయినగానీ స్థాన స్థానంలో దర్శనమిచ్చే "భగవంతుడు-అహం—మాం" అనే శబ్దాలకర్థం ఆత్మ.

"బ్రహ్మవ విత్ బ్రహ్మైన భవతి బ్రహ్మను తెలిసికొన్నవాడు బ్రహ్మయే అగుచున్నాడు.

"తత్త్వ మసి" "అది నీవయియున్నావు" ఈ అర్థంసరిగాదు. "అహం బ్రహాస్మి" నేను బ్రహ్మనయియున్నాను. ఈఅర్థం మాత్రం సమజసం. ఆ బ్రహ్మ వలన నీవున్నావు. అయితే ఇప్పుడు నీవు నీ నుండి బ్రహ్మను మాట్లాడుకొనవలసియున్నది. అను సంధానం చేయవలసి యున్నది.

ఒకటేమాట! సమస్త ధర్మ కర్మలకు ఏకైకలక్ష్యం ఆత్మానందం.

శ్లో॥ సర్వధర్మాన్పరిత్యజ్య మామేకం శరణం వ్రజ
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః॥
(భగవద్గీత 18-శ్లో 66.)

"అర్జునా! సర్వధర్మాల్ని పరిత్యజించి, నన్నొక్కడినిని మాత్రమే శరణుపొందు. నేను నిన్ను సర్వపాపాల నుండి ముక్తుని చేస్తాను. చింతించకు."

"ఇచట 'మాం' శబ్దానికర్థం ఆత్మ.

జీవుడు సమస్తధర్మకర్మన్ని పరిత్యజించి, ఆత్మ నాశ్రయిస్తే సమస్త పాపాలు నశిస్తాయి. అంటే సమస్త పాపాలకు కారణమగు జనన మరణ బంధం నశిస్తుంది. శరణాగతునిది మార్జాల కిశోర న్యాయం. ఆతడు దేనికీ చింతించవలసిన అవసరంలేదు. భగవదుపదేశానుసారం ఆచరించటమే ఆతనికి తక్షణకర్తవ్యం.

— — —

# (27) ధర్మ కర్మల అవసరం అజ్ఞానికేగానీ జ్ఞానికిలేదు.

శ్లో॥ కృష్ణోభోగీ శుకస్త్యాగీ నృపౌజనకరాఘవౌ,
వశిష్ఠః కర్మకర్తాచ పంచైతేజ్ఞానినస్సమాః॥

"శ్రీకృష్ణుడు భోగి, శుకమహర్షి త్యాగి, శ్రీరామచంద్రుడు జనకమహారాజు ప్రజాపరిపాలకులు, వశిష్ఠ మహర్షి కర్మిష్ఠుడు. అయినా అయిదుగురును జ్ఞానములో సమానులే."

శ్లో॥ యం సన్న్యాసమితిప్రాహుః యోగం తం విద్ధిపాండవ,
న హ్య సంన్యస్త సంకల్పో యోగీభవతి కశ్చన॥
శ్లో॥ ఆరురుక్షోమునేర్యోగం కర్మకారణముచ్యతే,
యోగారూఢస్య తస్యైవశమః కారణముచ్యతే॥
శ్లో॥ యదాహినేంద్రియార్థేషు నకర్మస్వనుషంజతే,
సర్వసంకల్ప సంన్యాసీ యోగారూఢ స్తదోచ్యతే॥
(భగవద్గీత అ॥ 6-శ్లో॥ 2-3-4.)

"పాండవా! 'సంన్యాస' మని దేనినంటారో దానినే 'యోగ' మంటారు. సంకల్పాల్ని త్యజించకపోతే ఎవడు యోగి కాలేడు. యోగులు కావాలనుకొనేవారికి కర్మ యోగప్రాప్తికి కారణం. యోగులయినవారికి సంకల్పాభావరూపంగా కర్మ కళ్యాణానికి కారణం. ఎవడు యోగారూఢుడు? ఇంద్రియ భోగాలందు—తత్కర్మలందు ఎట్టి పరిస్థితులలోను ఆసక్తుడు కానివారి మాత్రమే."

భగవద్గీతలో సాంఖ్యంలేదా జ్ఞానం మరియు కర్మయనే రెండు మార్గాలున్నాయి. అలాగే సాంఖ్య యోగంలో 39వ శ్లోకం వరకు ఆత్మ చావదని, దానినర్థం చేసికొనగల వ్యక్తులుకూడ అత్యంత దుర్లభులని ఆత్మతత్త్వాన్ని ప్రతిపాదించి, భగవంతుడు 'దేహాభిక్రమ నాశోఽస్తి' అంటూ కర్మసిద్ధాంతాన్ని అందుకొన్నాడు. ఆపై ఆత్మ వ్యవసాయాన్ని ప్రబోధించి, బుద్ధికి శరణాగతి చేయవలసిందిగా నిరూపిస్తూ, ఆత్మారాముల ప్రవృత్తిని అర్జునునకు స్పష్టం చేశాడు. చివరకు శాంతి సామ్రాజ్య స్థాపనతో బ్రాహ్మీస్థితి వైభవంలో సాంఖ్యయోగం సమాప్తమయింది.

ఆరురుక్షువు లేక ముముక్షువు—మరియు యోగారూఢుడని రెండురకాల ప్రవృత్తిగల వ్యక్తులున్నారు. ముముక్షువునకు యోగప్రాప్త్యర్థం కర్మ అత్యంతావశ్యకం. యోగారూఢునకు ఇక అతీంద్రియస్థితిలో ధర్మ కర్మలు సహజంగా నశిస్తాయి, ప్రయత్నపూర్వకంగా త్యజించవలసిన అవసరముండదు. అయితే అట్టి యోగారూఢులు ఒకరిద్దరు మాత్రమే ఉంటారు. అందువలన శరీరధారులగు ప్రాణులందరికి, సహజ ఇంద్రియ వ్యాపారాలకుతోడుగా వర్ణాశ్రమోచిత కర్తవ్యకర్మలు అత్యంతావశ్యకం. ఇది అమోఘ సిద్ధాంతం.

యుద్ధం చేయనని క్షత్రియోచిత కర్తవ్య కర్మనుండి పలాయనం చిత్తగించే అర్జుననకు పరమాత్మ ప్రాసంగికంగా జ్ఞానాన్ని జ్ఞానుల ప్రవృత్తిని వివరించినంతమాత్రాన దానికి ప్రాధాన్యం ఎలా వస్తుంది? కర్మ సిద్ధాంతానికే ప్రాధాన్యం వస్తుంది.

భగవద్గీత ఎలా ప్రాసంగికంగా కర్మ సంన్యాసంగురించి బోధించిందో అలాగే ధర్మఘంటకూడ కర్మసన్న్యాసం గురించి వివాదం చేస్తోంది. అది కేవలం విషయ పరిపూర్ణతకు మాత్రమే సహకారి.

నడిచేవాడు ఎంతవరకు నడుస్తాడు? సముద్రపర్యంతం. అలాగే జ్ఞానం సిద్ధించునంతవరకే ధర్మకర్మలవసరం. ఆ పైన అవి అవసరం గావు. (1) "మహత్పదం జ్ఞాత్వా వృక్షమూలే వసేత్, (2) జ్ఞాత్వానైష్కర్మ్య మాచరేత్, (3) తస్మాత్ జ్ఞానం పురస్కృత్య సంన్యసేదిహ బుద్ధిమాన్, అహ మేవాక్షరం బ్రహ్మ వాసుదేవాఖ్య మవ్యయం, ఇతిభావో ధ్రువో యస్య తదా భవతి భైక్ష్య భుక్, యదాతు విదితం తత్త్వం." (శ్రుతిస్మృతులు) బ్రహ్మవిదుడు—విద్వాంసుడు మాత్రమే కర్మ సంన్యాసికావాలి. లేకుంటే మహద్భయం సిద్ధిస్తుంది.

కర్మ సన్న్యాసియైన బ్రహ్మ విదునకు విద్వాంసునకు "తస్య కార్యం నవిద్యతే" ఇక ఏ కార్యములు శేషించవు, కర్తవ్యములు బాధించవు.

"యావజ్జీవ మగ్నిహోత్రం జుహోతి, కుర్వన్నేవేహ కర్మాణి జిజీవి షేచ్ఛతగ్ం సమాః" ముముక్షువు లేదా పామరుడు—అయోగ్యుడు యావజ్జీవం అగ్నిని సేవించవలసిందే."

"బహి స్సూత్రం త్యజేద్బుధః" ఒక్క జ్ఞాని మాత్రమే యజ్ఞోపవీతాన్ని త్యజిస్తాడు, త్యజించాలి. "కిం ప్రజయా కరిష్యామో యేషాం సోఽయమాత్మాయం లోకః" జ్ఞానులకే బాహ్య ప్రపంచంతో సంబంధముండదు, దేవర్షి పితృ ఋణాలతో సంబంధముండదు. వారు ఆత్మరాజ్యంలో శాంతమూర్తులై విహరిస్తుంటారు.

జడ భరతుడు కర్మ సంన్యాసి. ఆతని ఉపదేశం పొందిన రహూగణుడు సంన్యాసియా? కాదు, దేశాధి నేత. దత్తాత్రేయులు కర్మ సంన్యాసి. వారి ఉపదేశం పొందిన ప్రహ్లాదుడు-అలర్కుడు కార్తవీర్యార్జునుడు సంన్యాసులా? కారు, దేశాధి నేతలు. శ్రీకృష్ణుడు అఖండజ్ఞాని. ఆతని ఉపదేశం పొందిన అర్జునుడో? దేశాధి నేత. అందరు. ఎలా సంన్యాసులు కాగలరు? కాలేరు, కానక్కరలేదు. "యద్యత్కర్మ కరోమి తత్తదఖిలం శంభో తవారాధనమ్." "కరోమి యద్యత్ సకలం పరస్మై నారాయణాయేతి సమర్పయేత్ తత్." జన్మ సాఫల్యానికి ఒక్కటే మహామంత్రం! "ఈ సర్వకర్మలు, వాని ఫలితం నారాయణునకే అర్పితం. నాకెంతమాత్రం సంబంధం లేదు." ఈ మాటలవలన ప్రయోజనం శూన్యం. ఖా ఆచరణ అత్యంతావశ్యకం. అప్పుడే అసలయిన ఆన లభిస్తుంది.

— — —

# (28) ఆదిలో సగుణం-తరువాత నిర్గుణం

"ఆదౌ సగుణ మాశ్రిత్య పశ్చా నిర్గుణ మాచరేత్." సగుణంతో ఆరంభించి, నామరూపారాధన ఆధారంగా నిర్గుణ నిరాకార స్థితిని అందుకోవాలి.

ఆదిశంకరులు అద్వైత మత సంస్థాపకులు గదా! అయితే వారు ఈ సమస్త దేవీ-దేవతల స్తోత్రాలు రంచిచ లేదా?

శ్లో॥ కామ్యోపాసన యార్థ యన్త్యనుదినం
కించిత్ఫలం స్వేప్సితం,

కేచిత్స్వర్గ మాథాప వర్గమపరే
యోగాది యజ్ఞాదిభిః,

అస్మాకం యదునందనాంఘ్రి యుగళ
ధ్యానావధార్థినాం,

కిం లోకేన దమేన కిం నృపితినా
స్వర్గాపవర్గై శ్చ కిమ్.

(శ్రీ ఆదిశంకర కృత ప్రబోధ సుధాకరం.)

"ఉపాసకుల శ్రేణి నాలుగు విధాలు. స్వల్ప విషయ సుఖాల నిమిత్తం భగవద్భజన చేసేవారు ప్రథమశ్రేణి. స్వర్గసుఖాల నిమిత్తం యజ్ఞాదులు చేసేవారు ద్వితీయ శ్రేణి. మోక్ష సుఖం నిమిత్తం యోగాదులు చేసేవారు తృతీయ శ్రేణి. ప్రేమరసాస్వాదనార్థం కృష్ణపాద పద్మాల్ని ధ్యానించేవారు చతుర్థ శ్రేణి."

శ్రీ ఆదిశంకరులు స్పష్టంగా చెప్తున్నారు: మేం శ్రీకృష్ణ పాదపద్మాల్ని ధ్యానించేవారం. మాకు విషయ సుఖాలు—స్వర్గ సుఖాలే కాదు, మోక్ష సుఖం కూడ అవసరం లేదు.

మోహమంటే మోహక్షయం, బంధవిముక్తి. అంతమాత్రం ఎలా సరిపోతుంది? భక్తి రససాగరం. భక్తిరసాస్వాదన పరులకు భగవంతుడు-భక్తి దాస్యం చేస్తారు.

జీవుడు ఒక్క అడుగు భగవంతునికోసరం వేస్తే ఆతురుడయిన భగవంతుడు ఆరడుగులు పరుగుతీసి ఈతనిని ఆలింగనం చేసికొంటాడు.

ముందు భక్తుడు భగవంతునకు దాసుడు కావాలి. తరువాత భగవంతుడు భక్తునకు దాసుడవుతాడు.

బలి చక్రవర్తి యధార్థం తెలిసికూడా తన సర్వస్వాన్ని వామన మూర్తికి దానంచేశాడు. ఫలితంగా వామనుడు విశ్వరూపం ప్రదర్శించి, మూడవ అడుగును బలి శిరసుపై నుంచి పాతాళానికి

అణగద్రొక్కాడు. ఈ మూర్ఖ మానవులకు ఇంత కథ మాత్రమే తెలుసును. ఆ తరువాత కథ ఎలా తెలుస్తుంది? బలిచక్రవర్తి చిరం జీవి, భవిష్యత్తులో దేవేంద్రుడు. వామనుడు తన వామన రూపంతో నేటికిని బలి వాకిట ద్వార పాలకుడుగా ఉన్నాడు. ఆ చంద్రతారా ర్కం ఉండగలడు. చేసిన తప్పుకు వామనుడు శిక్ష అనుభవించ వలదా? చేసిన దాన ఫలితం బలిచక్రవర్తికి ఏలా లేకుండా పోతుం ది? ఒకటే మాట! భగవంతుని నమ్మినవారు ఎన్నటికీ చెడిపోరు.

భగవద్గీతలో స్థానస్థానంలో 'భగవానువాచ' అని తటస్థపడు తుంది? అంటే "ఇది భగవానుని వాణి" అని అర్థం. అంతేగానీ భగవానుడు చెప్పాడు-చెప్పున్నాడు—చెప్పనున్నాడు" అనే భూత భవిష్యద్వర్తమాన కాలాలు ఎంతమాత్రం తెలియబడవు.

అయితే ఎవడా భగవంతుడు? దేవకీనందనుడు గాడా? అర్జు నుని చెలికాడుగాడా? కర పాదాద్యవయవాలున్న వాడు గాడా ?

శ్లో॥ ఐశ్వర్యస్య సమగ్రస్య ధర్మస్య యశసశ్శ్రియః,
జ్ఞాన వైరాగ్యయోశ్చైవ షణ్ణాం భగయితీరణా॥

(1) ఐశ్వర్యం. (2) ధర్మం. (3) యశస్సు. (4) శ్రీ (5) జ్ఞానం. (6) వైరాగ్యం. ఈ ఆరు సంపూర్ణంగా ఎక్క డుంటాయో ఆ తత్త్వాన్ని 'భగవంతు'డంటారు. భగవంతుడు "గతి ర్భర్తా ప్రభుస్సాక్షీ నివాసః శరణం సుహృత్, ప్రభవః ప్రళయ స్థానం నిధానం బీజ మవ్యయమ్॥ అజోఽపిసన్న వ్యయాత్మా భూతానా మీశ్వరోఽపిసన్, ప్రకృతిం స్వామధిష్ఠాయ సంభవామ్యా త్మమాయయా." ఆ భగవంతుడు సర్వప్రాణి సుహృదుడు. అందు

వలన నిర్గుణ నిరాకారుడయినా అవతరించి తీరుతాడు. అంటే ఆత్మ అవతరిస్తుంది. కారణం ఒకే ఒక్కటి, భక్తవాత్సల్యం.

శ్లో॥ దేవాన్భావ యతానేనతే దేవా భావయన్తువః,
పరస్పరం భావయంతః శ్రేయః పరమవాప్స్యథ॥
(భగవద్గీత అ॥ 3-శ్లో॥ 11.)

శ్లో॥ యేయథామాం ప్రపద్యంతే తాంస్తథైవ భజామ్యహమ్,
మమవర్త్మాను వర్తన్తే మనుష్యాఃపార్థ! సర్వశః॥
(భగవద్గీత అ॥ 4-శ్లో॥ 11.)

"దేవతల్ని మానవులు ఆరాధించాలి, దేవతలు మానవుల్ని ఉన్నతుల్నిచేయాలి. ఇట్టి పరస్పర సంభావనంలోనే పరమ కళ్యాణం అంతర్లీనంగా ఉంది."

"భక్తులు భగవానునెలా భజిస్తారో భగవానుడుకూడ భక్తులనలా భజిస్తాడు. ఏమార్గాన నయినను భగవత్ప్రాప్తియే చివరికి సిద్ధిస్తోంది. అందువలన ఏవిధంగా నయినాసరే, నామరూపాల ఆధారంతోగానీ, లేక గానీ బుద్ధిమంతులు భగవంతునే ఆరాధిస్తారు."

———

# (29) శరణాగతి - ధ్రువుడు

స్వాయంభువ మనువు—శతరూపా దంపతులకు ఉత్తాన పాదుడు—ప్రియవ్రతుడు ఇరువురు కుమారులు. ఉత్తానపాదునకు సునీత–సురుచి ఇరువురు భార్యలు. సునీతికి కుమారుడు ధ్రువుడు–సురుచి కుమారుడు ఉత్తముడు.

ఆ నిర్గుణ—నిరాకార బ్రహ్మయే ఇలా ఒక్కొక్క సమయంలో విశిష్ఠ పాత్రలరూపంలో వ్యక్తమై, తన విభూతిని మాయా ప్రపంచంలోకూడ వ్యక్తం చేస్తుంటాడు, మాయాగ్రస్థ జీవుల నుద్ధరిస్తుంటాడు, ప్రకటబ్రహ్మకు ఈ పాత్రధారులు అవయవ స్వరూపులు. వీరు బ్రహ్మ ప్రకటదశలో ప్రకటంగా—అప్రకటదశలో అప్రకటంగా ఉంటారు. తమవిభూతికి అనురూపమగు నామరూపాల్నే గ్రహించి, నామరూపాశ్రయులయిన జీవుల ఉన్నతికి హేతుభూతులవుతుంటారు. వారికి వాస్తవంలో నామరూపాలు లేనేలేవు.

ఉత్తాన పాదుడంటే ఉత్థాన మార్గం. ఆ మార్గంలో చరించే వారికి సునీత అంటే ధర్మం ప్రియమవుతుంది. అంతకన్న అధికంగా సురుచి అనేవిషయాలు రుచిగాఉంటాయి. మహాబలవత్తమాలగు

లగు విషయాల కారణంగా సునీతి సముచితాదరణను పొందలేక దుఃఖిస్తుంటుంది. ఇది సహజమే. అయినా సునీతి ఫలితం లోకంలో ధ్రువంగా అంటే శాశ్వతంగా ఉంటుంది. సురుచి ఫలితం లోకదృష్టికి ఎంత ఉత్తమంగా ఉన్నా అల్పకాలంలోనే నశించితీరుతుంది ఈ సుందర రూపకల్పన ధ్రువ చరిత్ర.

తండ్రి అంకపీఠాన్నధిరోహించాలని వ్యగ్రుడయిన అయిదేండ్ల బాలుడు సపత్నితల్లి సురుచి వాగ్బాణాలకు అత్యంత వ్యధితుడయి వచ్చాడు. ఆతనికి సునీతి ప్రథమాచార్యయై చక్కని ఉపదేశం చేసింది. లౌకిక విషయాల నిమిత్తం వ్యగ్రుడవటం జీవునకు సహజమే. అవి ప్రాప్తిస్తే జీవుని ఆనందానికి పరిధులు కూడ ఉండవు. అయితే విషయ సుఖాలన్నీ పరిపూర్ణంగా ఉంటే భగవంతునితో అవసరమేముంటుంది? విషయ సుఖాల నిమిత్తం పరిగిడి-పరిగిడి పరిపూర్ణంగా పరాజితుడయిన వాడు మాత్రమే పశ్చాత్తాప హృదయంతో పరమాత్మ సన్నిధికి పయనించగలుతాడు. హృదయం వ్యథమయితేనే అందుండి అతీత దిశగా పయనించాలనే తృష్ణ ఆవిర్భవిస్తుంది. అప్పుడే లోనున్నవాడు తన దర్శన భాగ్యాన్ని అనుగ్రహించ గలుగుతాడు.

తృష్ణ ఆవిర్భవించినప్పుడు దానికి తక్షణం మహాపురుషుల సహకారం అందాలి. లేకుంటే అది మరుక్షణంలోనే మాయమవుతుంది. ఫలితంగా మానవుడు మార్గం తప్పినడుస్తాడు, దుఃఖిస్తాడు.

ప్రతి మానవునకు జీవితంలో ప్రప్రథమంగా ఆచార్య స్థానీయులు మాతాపితలు. తల్లి స్తన్యంతో పాటుగా శిశువుకు శ్రీహరి ప్రేమామృతాన్నికూడ అందించాలి. తండ్రి సంస్కారాన్ని-గాయత్రీ

మంత్రాన్ని ఉపదేశించి, జీవితాన్ని నియమ బద్ధం చేయాలి. తల్లి దండ్రుల ఉపదేశం ప్రారంభంలో అందకుంటే ఇంక ఎట్టి మహా పురుషుడు కూడ ఆ దౌర్భగ్య జీవుని దయ చూడలేడు.

సునీతి అత్యంత సుందరంగా ధ్రువునకు ఉపదేశించింది; "నాయనా! శ్రీహరికృప లేకుంటే జీవితంలో ఎట్టి సుఖం ఉండదురా! శ్రీహరి పూజ చేయక నాకడుపున పుట్టావు. చేసేదేముంది? ఫలితం అనుభవించవలసిందే."

శ్రీహరి భజనం స్వర్గ సుఖాల నిమిత్తం—మోక్ష సుఖం నిమిత్తం కాదు. విషయ సుఖాలు కావాలనుకొనే వాడుకూడ విధిగా శ్రీహరిని భజించాలి.

అంతే! ధ్రువుడు శ్రీహరి కృప నిమిత్తం వెంటనే ఇల్లు విడిచి బయలుదేరాడు. అదృష్టముండాలి, లేకుంటే తల్లిచెప్పినా, గురువు చెప్పినా, ఎవరు చెప్పినా కానలకు ఏగిననయిన పట్టు బడుతాయా హరి ప్రబోధాలు. ఒక్కటేమాట! అదృష్టాన్ని నిర్మించగల వాడు మానవుడొక్కడే.

ధ్రువునకు నారదుని ద్వాదశాక్షరీ మంత్రం "ఓం నమో భగవతే వాసుదేవాయ" లభించింది. స్థూల సూక్ష్మ కారణ శరీరాలు మూడింటిని నశింప చేసేది మంత్రబలం. క్షరజీవుల్ని అక్షరస్వరూపుల్ని చేసేది మంత్రజపం. భగవత్కృపకు యోగ్యమగు భావశరీరాన్ని అనుగ్రహించేది మంత్రజపం నిరాకార బ్రహ్మను సాకారుని చేసేది మంత్రజపం సగుణ సాకారుడు జీవుని నిర్గుణ నిరాకారునిగా ధ్రువునిగా చేసేది మంత్రజపం.

మధువనంలో, నేటి మధురా నగరంలో ధ్రువుడు అతిభయంకరంగా ఆరు నెలలు తపసు చేశాడు. అయిదేండ్ల బాలుడేమిటి? తండ్రి తొడపై కూర్చోవాలని దుఃఖించట మేమిటి? తల్లి అలా ఉపదేశించినదే తడవుగా ఇల్లు వదలి, తపం నిమిత్తం మధురకు రావటమేమిటి? అంతా విచిత్రంగాలేదూ? నరుడా! జీవితానికి లక్ష్యం భగవచ్చరణాగతి ఒక్కటి మాత్రమే.

ధ్రువుడు తన భౌతిక చక్షువులతో కరపాదా ద్యవయవాలతో కూడిన సచ్చిదానంద స్వరూపాన్ని దర్శించాడు. నిర్గుణ నిరాకారంలో సగుణ సాకారముంది, సగుణ సాకారంలో నిర్గుణ నిరాకారం కూడ ఉంది.

ఎప్పుడయితే భగవద్దర్శనమయిందో ఇంక ధ్రువుని మనసు భౌతిక సుఖాలనుండి పూర్తిగా ముక్తమయింది. ఇందులో ఆశ్చర్యమేముంది? ధ్రువుడు కేవలం శ్రీహరి కృపనుమాత్రమే అర్థించాడు. అయినా భగవంతుడు భక్తుని పూర్వ వాసనను గుర్తించి, లౌకిక సుఖాలనుభవింప వలసిందిగా, ప్రజాసంరక్షణ చేయవలసిందిగా ఆదేశించాడు. భగవత్కృపను పొందాలంటే తపస్సు అవసరమేముంది? మనోవాక్కాయాల్ని తపింపచేసి జీవితాన్ని ఆహుతి చేయవలసిన అవసరమేముంది? భగవదనుగ్రహం లభించకుండా మానవులకు వారి దురదృష్టం అడ్డు తగులుతోంది. ఆ దురదృష్టాన్ని హతమార్చే నిమిత్తమే మానవుడు తపస్సు చేయాలి. భౌతికంగా తల్లిదండ్రులే సంతానం అడుగకున్నా వారి అవసరాలు పూర్తిచేస్తున్నారే ఇక జగత్పితను తుచ్ఛ సుఖాల నిమిత్తం అడుగవలసిన అవసరముంటుందా? భగవంతుడు దయామయుడు ఇది త్రికాలసత్యం

శ్లో॥ యతః ప్రవృత్తిర్భూతానాం యేనసర్వ మిదంతతమ్,
స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విందతిమానవః॥

శ్లో॥ శ్రేయాన్ స్వధర్మోవిగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్,
స్వభావనియతం కర్మ కుర్వన్నాప్నోతికిల్బిషమ్॥

(భగవద్గీత అ॥ 18-శ్లో॥ 46-47.)

"మృత్తికనుండి ఘటాదులెట్లు ఉత్పన్నమవుతున్నాయో అలాగే మాయోపాధికమయిన బ్రహ్మంనుండి ఆకాశాది భూతాలకు-వాని కార్యాలకు ప్రవృత్తి-ఉత్పత్తి సిద్ధించుచున్నది. ఇది నిమిత్త కారణం. ఆ బ్రహ్మ ప్రపంచమంతటా వ్యాపించియున్నాడు. ఆ బ్రహ్మకు భిన్నంగా ప్రపంచం లేనేలేదు. ఇది ఉపాదాన కారణం. అట్టి బ్రహ్మను మానవులు "స్వకర్మతో" అర్చించాలి. కర్మ విధింప బడింది మానవులకు మాత్రమే. కాన అట్టి బ్రహ్మ నర్చించాలంటే మానవులదగ్గఱ 'కర్మ' గాక మరేముంది? కర్మతో ఎవరు బ్రహ్మ నర్చిస్తారో వారుమాత్రమే సిద్ధిపొందుతారు. అంటే ఏమిటి? పైన చెప్పబడిన అభిన్న నిమిత్తోపాదాన కారణమయిన బ్రహ్మను అనుభ వింప గలుగుతారు."

"హీనమయినను స్వధర్మమే శ్రేష్ఠం. ఎంత ఉత్తమ మయి నను పరధర్మాన్ని అనుసరించకూడదు. స్వభావనియతమయిన కర్మా నుష్ఠానం వలన ఎంతమాత్రం దోషంలేదు."

గీతలో ఆపైన వర్ణధర్మాలు చెప్పబడ్డాయి.

ధ్రువుడు భగవంతుని స్వభావసిద్ధమయిన కర్మతోఅర్చించాడు.

కర్మయొక్క వివిధ స్వరూపాలు:—

(1) సాధనదృష్టి:— మానసిక — వాచిక — కాయికాలు,
(2) ధర్మదృష్టి:— సాత్త్వికరాజస — తామసాలు,
(3) హేతుదృష్టి:— నిత్య — నైమిత్తిక — కామ్యాలు,
(4) విజ్ఞానదృష్టి:— కర్మ — వికర్మ — అకర్మ,
(5) వేదాంతదృష్టి:— ప్రారబ్ధ — సంచిత — క్రియమాణాలు.

ధ్రువుడు తపసుచేశాడు. అంటే 'నేను'ను సంహరించాడు. సర్వభూతాత్మను ఆత్మలో అనుభవించాడు. 'నేను'గా సంబోధించాడు. "ఈశ్వరస్సర్వ భూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి." ఎలా గుర్తించి అనుభవించి-సంబోధించాడు? శరీరదృష్టికి అతీతుడై శివాన్ని అనుభవించాడు, ప్రపంచ వ్యవహారాల్ని — అహంకార — మమకారాల్ని అధిగమించి, సమస్తప్రాణులందు ఆత్మబుద్ధిని నిలిపాడు. ఫలితంగా ప్రకృతికి పరుడయిన పరమాత్మ సచ్చిదానంద స్వరూపాన్ని "యేన సర్వమిదంతతమ్" గా విస్తరింపచేశాడు. అంటే పరిమితరూపంతో సాక్షాత్కరింప చేసికొన్నాడన్నమాట. ముందు అపరిమితమయితేనే 'తత్త్వం' పరిమితం కాగలుగుతుంది, "అహం బ్రహ్మాస్మి" అనుభవం సిద్ధింపగలుగుతుంది.

మున్ముందు సమస్త వాసనలు నశించాలి. వాసనలు ప్రచండ మారుతాలయితే శరీరపాత్రలో ధర్మజ్యోతి — పరంజ్యోతి ఎలా ప్రకాశించగలుగుతుంది? (భగవద్గీత అ. 2-శ్లో. 71.) వాసనలు నశించటం ఎలా? ఇదే కీలకప్రశ్న. వాసనలు నశించటం కల్ల. వాసనల్ని నిరోధించటమే యోగం. బలవంతంగా నిరోధించాలను

కొంటే వాసన నశించదు సరిగదా వృద్ధిఅవుతుంది. వాసనల్ని నిరోధిస్తూ మానవుడు బలవంతంగా ఎంతకాలం-ధర్మం ఆచరించగలడు? అట్టిధర్మంవలన ప్రయోజనమేముంటుంది? (గీత అ. 3-శ్లో. 6.) అయితే ఇప్పుడేంచేయాలి? విభిన్న మానవ మనస్తత్త్వాల్ని సంగ్రహించి—సమీక్షించి—దివ్యత్వాన్ని ఆపాదించగల ప్రక్రియ ఏం లేనేలేదా? మానవ మనస్తత్త్వాలు భిన్నాలయినప్పుడు వానిని సమీకృతం చేసికొనగల అవ్యయ దివ్యసనాతన బీజంమాత్రం ఎందు

కుండదు? భిన్న మనస్తత్త్వాలకు భిన్నరూపాల్ని సృష్టించి, నానా ముఖాలుగా ఆత్మ రమణము ననుగ్రహింపగల అవ్యయ దివ్య సనాతన బీజం ఎందుకుండదు? ఉంది. (అ. 9-శ్లో. 18.) తండ్రి అంకపీఠం అధిరోహించాలని ఆశపడిన ధ్రువకుమారుని మనస్తత్వాన్ని తనదిశగా ఆకర్షించుకొని, సచ్చిదానందరూపంతో ప్రత్యక్షమై, మనసును మధురంచేసి, పునః వ్యక్తిగత స్వాతంత్ర్యాన్నికూడ ప్రసాదించిన శ్రీహరియనే ఆత్మతత్త్వం తప్పకఉంది.

ఒకటేబీజం ఇలా అనేకమైన, చివరకు కొక్కటిగా మిగులుతోంది. ఆత్మయొక్క అద్వితీయ నర్తనమే ఈ సమస్త దేవతలు-బ్రహ్మాండాలు. అవ్యక్తంనుండి వ్యక్తమై, శబ్దంనుండి వ్యక్తమై, రసంద్వారా నిరూపితమై, బ్రహ్మతో భాసించి, పోషింపబడి ఈ అనేకం చివరకు అందే ప్రతిష్ఠమవుతోంది.

— — —

# (30) భగవానుని స్వరూపం

## అమృతం

శ్లో॥ అస్యాపి దేవవపుషో మదనుగ్రహస్య,
స్వేచ్ఛామయస్య నతుభూతమయస్యకోఽపి,
నేశో మహిత్వవసితుం మనసాంతరేణ,
సాక్షాత్త్వవైవకిముతాత్మ సుఖానుభూతేః॥

(శ్రీమద్భాగవతం స్కం 10-అ. 14-శ్లో. 2.)

"శ్రీహరి ధ్రువునకు దర్శనమీయటం కళావతారం. అవతారాలలో ఇదొక భేదం.

"శ్రీకృష్ణ భగవానుని వత్సలీల ఉపసంహరింపబడిన తరువాత బ్రహ్మ దేవుడు స్తుతిస్తున్నాడు; "దేవా! నీ ఈ ప్రకటదేహం దివ్యం. దీని మహిమ ఎవరికి తెలుస్తుంది? ఇది పంచభూతాలవలన ఉత్పన్నమయింది కాదు, అప్రాకృతం. నా వంటి భక్తుల్ని ఆనందింప చేయటానికే ఇంత సుందరరూపం రచింపబడింది. ఇక ఆత్మ సుఖంతో కూడిన అవిజ్ఞానానంద ఘన స్వరూపవైభవాన్ని ఆత్మ దృష్టితో, సమాధిస్థితిలో గ్రహించవలసిందేగానీ అన్యథా సాధ్యం కానేకాదు."

భగవంతుడు అప్రాకృత దివ్య చిన్మయ శరీరధారి. ఆయన జన్మ కర్మములు దివ్యములు. కాన వాని శ్రవణ—పఠనములు, చింతనాను సంధానములు భౌతిక జీవుల్ని తప్పక దివ్యులుగా రూపొందించి తీరుతాయి. (గీత అ 4-శ్లో 9.) కథా శ్రవణాదుల వలన మనోవాక్కాయాలు భౌతికను కోల్పోయి, రసరూపాలవుతాయి. ఉపదేష్టయందు, నియామకుని యందు అచంచలశ్రద్ధా భక్తి విశ్వాసాల్ని ఉత్పన్నం చేస్తాయి, "అతడు చెప్పినట్లు చేయటం లోనే ఆత్మ కళ్యాణము—విశ్వకళ్యాణం" అనే భావాన్ని ఉత్పన్నం చేస్తాయి. ఇట్టి శ్రద్ధాభక్తి విశ్వాసాలకు శరణాగతుడు సజీవరూపం కావాలి. తల్లి చెప్పిన మాటలందు, నారద గురువుల మాటలందు ధ్రువునకు గల శ్రద్ధా భక్తి విశ్వాసాలు అచంచలం కాననే ఆరు నెలలలో శ్రీహరి దర్శనం పొందగలిగాడు.

భగవద్గీతలోని ప్రధాన సిద్ధాంతం శరణాగతి. తక్కిన సిద్ధాంతాలన్నీ కర్మభక్తి పోషకాలు ప్రాసంగికాలు. అంతే!

ఉపాసకుల విభిన్న మనస్తత్వాలకు సంసేవ నీయుడు విరుద్ధ గుణధర్మాశ్రయుడయిన భగవాను డొక్కడే. సమస్త జీవులు జ్ఞానంతోగానీ, అజ్ఞానంతోగానీ ప్రళయకాలంలో గోపాలకృష్ణుని ఉదరంలో ప్రవేశిస్తున్నారు. అందులో ఆనందంలేదు, భావంతో భౌతిక శరీర సహాయంతో ఎవరు భగవంతుని భజిస్తారో వారు భావనానుకూల ఫలం పొందుతారు. స్వర్గకామి స్వర్గాన్ని. ఆరోగ్యకామి ఆరోగ్యన్ని, అర్ధకామి అర్ధాన్ని, ఐశ్వర్యకామి ఐశ్వర్యాన్ని, ప్రేమీభక్తుడు వైకుంఠాన్ని పొందుతాడు. కాముకుడు అప్రాకృత రసాన్ని ఆస్వాదిస్తాడు. క్రోధవంతుడు చక్కగా సంస్కరింపబడి

భగవత్పరి వారంలో సభ్యుడవుతాడు. అరిషడ్వర్గాలన్నీ అప్రాకృత భగవద్విభూతిలో అప్రాకృతాలవుతాయి. కాననే శరణాగతి అత్యంతావశ్యకం. ఒకటే ఆవేదన; "గోపాలా! నేను నీవాడను. నీవు నా వాడవుకావాలి" ఇట్టి అప్రాకృత భావ సంసిద్ధియే శరణాగతికి ఫలం. ఇట్టి భావ సంసిద్ధికి నామ రూపగుణ లీలాధామాల్ని ఆశ్రయించటం అత్యంతావశ్యకం. ఆ ఆలంబనంతోనే భగవద్భజన జరుగుతుంది. ఆర్తులు—జిజ్ఞాసులు—అర్థార్థులు—జ్ఞానులు—విభిన్న మన స్తత్వాలతో భగవంతుని భజిస్తారు. భగవంతుని ఎలా భజించినా కళ్యాణం నిశ్చయం. భజించేవారిని భజించేస్వభావంగల వాడు భగవంతుడు. ఇది ఆయన అసాధారణ ధర్మం. ప్రతి వస్తువునకు ఒక్కొక్క ధర్మం ఉంటుంది గదా! అనుకూలంగా ఉండే మార్గంలో భక్తుడు భగవంతునికి అనుకూలంగా సంచరించాలి. ఉపాసించాలి. ఇదే ధర్మం. భావనానుకూలంగా రసాస్వాదన చేయించి, ఆనందింపచేసి, ఆనందించడం భగవానునకు ధర్మం. భగవచ్ఛరణాగతి జీవునకేనాటికయిన అపరిహార్యం, ధర్మం. మనోవాక్కాయాలతో అనుష్ఠింపబడిన ధర్మం చక్కగా ఇంద్రియాల్ని-బ్రహ్మాండాల్ని పోషిస్తోంది. వాని సర్వాంగ పరిపుష్ఠతయందు త్రిగుణాతీత ఈశ్వర భావాన్ని స్పృశించి, ధర్మమే సమస్తేంద్రియాలలో అఖండ భక్తిరసంగా ప్రవహిస్తోంది. ఇది మరువరాదు. ఇప్పుడు మానవ జీవితం దివ్యదైవీ సంపద్విలసితం.

శరణాగతి విషయంలో లోకానుభవం ఒకటి చెప్పబడుతోంది. వాత్సల్యమయుడయిన తండ్రికి స్వార్థపరుడయిన పుత్రుడుంటే ఎట్టిదురవస్థ ఉంటుందో జీవేశ్వరుల విషయంకూడ

అలాగే ఉంటోంది. సుఖించాలనే ఆశతో కుమారుడు పరివారానికి దూరంగా వెళ్ళాడు. వాస్తవంలో సుఖం పరివారజీవనంలోనే ఉంటుంది. అయినా స్వార్థం సీమోల్లంఘనం చేసినకారణంగా కుమారుడు స్వజనానికి దూరమవుతున్నాడు. తండ్రి వాత్సల్యంతో తనదగ్గరకు రావలసిందిగా ఆహ్వానిస్తున్నాడు. "చేసిన తప్పులన్నింటిని విస్మరిస్తా" నంటున్నాడు. అయినా కుమారుడు దారిగానక తిరుగుతున్నాడు, సన్మార్గాన్ని చూపిస్తున్నా చూడలేకున్నాడు. వాస్తవంలో తండ్రి సన్నిధిని చేరడమే కుమారునకు గౌరవం, ఎంతోసుఖకరం. అయినా అలా శరణుపొందటాన్ని కుమారుడు అవమానంగాభావించి, ఆత్మహత్యకు సిద్ధమవుతున్నాడు. జరుగనున్న సర్వనాశనానికి ఇది చక్కని సూచన. స్వార్థపరులందరూ అనాదిగా సర్వనాశన మవుతూనేవున్నారు. "తన కుమారుడే అయోధ్యా సింహాసనాన్ని అలంకరించాలని అంత సాహసంతో చదరంగమాడిన కైకేయి చివరకు ఎట్టిదుస్థితికి గురయింది? కలకాలం తానే హస్తినాపురాన్ని పరిపాలించాలని వీరాధివీరుల నందరను పాదదాసులుగా చేసికొని 18 దినాలు ఘనఘోర సంగ్రామాన్ని జరిపించిన దుర్యోధనుడు చివరకు ఎట్టిదుస్థితి ననుభవించాడు?" ఈ ప్రపంచంలో స్వతంత్రులెవరులేరు. మాతాపితరుల సంరక్షణలేనిదే ఎవడూ వృద్ధిచెందడంలేదు. మరలచివరకు భార్యాబిడ్డల కధీనం కావలసివస్తోంది. ఇంక స్వాతంత్ర్య శబ్దానికి ఏమిటి అర్థం? ఇంతస్వల్ప జీవితకాలంకూడ మానవుడు లౌకికంగా స్వతంత్రంగా ఉండలేకున్నాడే, ఇంక అంతః బహిః ప్రాణమ

యిన ఆత్మకు — పరమాత్మకు శరణాగతుడుకాకుండా జీవించ
డం ఎలాసాధ్యం? నిస్సంశయంగా అసాధ్యం. ఏనాటికయిన మాన
వుడు భగవచ్ఛరణాగతుడు కాకతప్పదు. అట్టిస్థితిలో, ఈనాడే
స్వేచ్ఛగా శరణాగతి చేయటంలో మానవునకు ఎంతగౌరవం! ఎంత
సుఖం!! ఇది అవశ్యం ఆలోచించవలసిన అంశంకాదా?

——

## (31) అనుభవం - శాంతి.

శ్లో॥ ఆపూర్యమాణ మచల ప్రతిష్ఠం
సముద్ర మాపః ప్రవిశంతి యద్వత్,
తద్వత్కామాయం ప్రవిశంతి సర్వే
సశాంతి మాప్నోతి నకామకామీ॥

శ్లో॥ విహాయ కామాన్యః సర్వాన్ పుమాంశ్చరతి నిస్పృహః,
నిర్మమో నిరహంకారః సశాంతి మధిగచ్ఛతి ॥

శ్లో॥ ఏషా బ్రహ్మీస్థితిః పార్థ నైనాం ప్రాప్య విముహ్యతి,
స్థిత్వాస్యామన్తకాలేఽపి బ్రహ్మనిర్వాణ మృచ్ఛతి।
(భగవద్గీత అ 2 – శ్లో 70 71-- 72.)

"నదులన్నీ సముద్రంలో కలుస్తాయి. అప్పుడు సముద్రం వికారయుక్త మవుతోందా? అలాగే విషయసుఖాలన్నీ పొందబడునపుడు ఎవనిని వికృతపఱచవో అట్టిధీరుడే శాంతిసుధను అస్వాదింపగలుగుతాడు. సుఖాల్ని కోరకుండటం ఏమంత శ్రేష్ఠంగాదు, సుఖాల్ని అనుభవిస్తున్నా జనకాదులకువలె ఎవనిమనసు చంచలంగాదో వాస్తవంలో అదిమాత్రమే సర్వశ్రేష్ఠస్థితి."

"శాంతిసుధకు ఎవడు అర్హుడు? విషయాపేక్ష - అహంకారం-మమకారం జయించి వానిస్పృహతో జీవనయాపన చేసేవాడు మాత్రమే."

అచంచల మనస్థితిలోమాత్రమే శాంతిసుధ ఆస్వాదనకు వస్తుంది. దీన్నే 'బ్రాహ్మీస్థితి' అంటున్నారు. అంటే 'బ్రహ్మసంస్థితి' అనిఅర్థం. దీన్ని బాహ్యంనుండి పొందవలసిన అవసరం ఎంత మాత్రంలేదు. అందరకును ఇది సహజస్థితి. నిరంతరం స్వస్వరూపానుసంధానంలో, బ్రహ్మానందంలో జీవించడమే బ్రహ్మసంస్థితి. ఇది నిరంతరం-సర్వకాల సర్వావస్థలందు బాహ్యాంతరరూపాలు తానుగావుంటుంది. ఒక్క క్షణానికిమాత్రం పర్యాప్తంగా ఉండదు.

ధ్రువుడిట్టి శాంతిసుధను-బ్రహ్మ సంస్థితిని సంపాదించాడు. ఆతడు నకామకామి. ఆతని చరిత్ర పఠించటంవలన మానవులకు శ్రీ-విజయం-విభూతి-ధ్రువానీతి సిద్ధించితీరుతాయి.

శ్లో॥ ముక్తాశ్రయం యర్హి నిర్విషయం విరక్తం
నిర్వాణ మృచ్ఛతి మనః సహసాయథార్చిః,
ఆత్మానమత్ర పురుషోఽ వ్యవధానమేక-
మన్వీక్షతే ప్రతినివృత్త గుణప్రవాహః-
(శ్రీమద్భాగవతం స్కం ౩ - అ౨౮- శ్లో ౩౫.)

"త్రిగుణప్రవాహం నశించటమంటే తజ్జన్యదేహాది ఉపాధి నశించుటమని భావం. ఆశ్రయం - విషయం - రాగం నశించి, గుణప్రవాహం ఆగిపోతే ధ్యానంచేసేవాడు-ధ్యానం-ధ్యేయం అనే త్రిపుటి విలీనమవుతుంది. నూనె సమాప్తమయేసరికి దీపశిఖాకిర

జాలు కారణభూతమయిన తైజసతత్త్వంలో లీనమవుతున్నట్లుగా ఆశ్రయ-విషయ-రాగాలు గుణకర్మలు మొదలయిన మాయా ప్రవాహం ఆగిపోగానే అనిర్జలభూమిలో నిర్మల పరమాత్మ కృప ప్రకాశిస్తుంది. 'అహం' బ్రహ్మానుభవం కలుగుతుంది. అనుభవంఅంటే అనవరత బ్రహ్మసంబంధం. ఇంతకుపూర్వంకూడా జీవునకు బ్రహ్మతో సంబంధముంది. లేకుంటే 'అహం' లేక 'నేను' లేనేలేదు".

శ్లో॥ సర్వస్యచాహం హృది సంనివిష్టో
మత్తః స్మృతిర్జ్ఞానమపోహనం చ,
వేదైశ్చ సర్వై రహమేవవేద్యో
వేదాంత కృద్వేద విదేవచాహమ్॥

(భగవద్గీత అ 15-శ్లో 15.)

"అర్జునా! ఈ సమస్త ప్రాణులలో అహంరూపంలో ఎవడున్నాడు? నేనే. నావలననే ప్రాణులు స్మృతి జ్ఞానాల్ని పొందుతున్నాయి. జీవునిలోని సుఖాన్నిగ్రహించే శక్తి-జ్ఞానశక్తి వాస్తవంలో నేనే. బుద్ధిలోని సంశయ విపర్యయాల్ని పరిహరించటాన్ని 'అపోహనం' అంటారు. అర్జునా! ఆశక్తికూడ నేనే. నేన్నే వేదాలవలన తెలియదగినవాడను, వేదాంతానికి కర్తను, మరియు వేదవిదుడను".

ఆత్మశక్తి- పరమాత్మ ప్రాప్తిలేక కృపకు గీతాపరిభాష లోని పదం 'శాంతి' ఇంద్రియాల ప్రశాంతస్థితిలోలభించే అమృత ప్రసాదాన్నే 'శాంతి' అంటారు. ఆత్మ అఖండ శాంతస్వరూపం

శ్రీహరి శాంతరూపుడు. "శాంతాకారం భుజగ శయనం పద్మనాభం సురేశమ్".

శంకరుడు శాంతరూపుడు. "శాంతం పద్మాసనస్థం శశిధర మకుటం పంచవక్త్రం త్రినేత్రమ్". శాంతిసుధ నాస్వాదించాలంటే విష్ణు ప్రభృతి దేవతలందరుకూడా బాహ్యస్వరూప విస్మృతిని పొందుతారు, అంతర్ముఖులవుతారు.

సహస్రారచక్రం అప్రాకృత రసమండలం. అది సుమనోహర మహా పద్మాటవి. అచట సహస్రదళకమలం. అందుండి సహస్ర–సహస్రముఖీ రసవాహిని. అది అఖండ సుధాసాగరం, శాంతి సుధాసాగరం. ఏమియా అత్యద్భుత భావపరిమళం! దశ దిశలా ధర్మఘంటా నినాదం. ఏమిటో ఆ నినాదం? అది ఓంకార నినాదం. "ఓమిత్యేకాక్షరం బ్రహ్మ." (భగవద్గీత.) "తస్య వాచకః ప్రణవః" (ప్రాతంజల యోగసూత్రాలు.) సమస్త దేవీ, దేవతలకు, బ్రహ్మాండాలకు ఇదే ఏకైక నిజనికేతనం. వాస్తవంలో అంతా నిర్గుణం–నిరాకారమే. అయినా దానికి పామరుల కర్థం కాగల నిర్వచనం–ప్రాథమికపాఠం సగుణం–సాకారం అని చెప్పుకొన్నాంగదా!

శ్లో॥ తత్ప్రియా ప్రకృతి స్త్వాద్యా రాధికా కృష్ణవల్లభా,
తత్కలాకోటి కోట్యంశా దుర్గాద్యాస్త్రి గుణాత్మికాః,
తస్యాంఘ్రి రజసః స్పర్శాత్ కోటి విష్ణుః ప్రజాయతే॥

(పద్మపురాణం.)

శ్రీ రాధారాణి శ్రీకృష్ణ ప్రేయసి: మూలరస ప్రకృతి, త్రిగుణాతీత. ఒక టేమాట! త్రిగుణాతీతతత్వంలోనే రసం ప్రవహిస్తుంది. దుర్గా ప్రభృతి ఇతర సమస్త త్రిగుణాత్మక స్వరూపాలు శ్రీ రాధారస ప్రవాహానికి తరంగాలు. కోట్లకొలది విష్ణు తత్త్వాలు రక్షక తత్త్వాలు-ఆమె పాదరజంనుండి ఆవిర్భవిస్తుంటారు."

సమస్త శక్తులు శ్రీరాధా స్వరూపాలయితే దేవతలు శ్రీకృష్ణ స్వరూపాలు. ఇది తథ్యం. "మాం ఏకం శరణం వ్రజ." శ్రీకృష్ణుడొక్కడుమాత్రమే భగవంతుడు. "యే యం రాధా యశ్చ కృష్ణో రసాబ్ధిః. (శ్రీ రాధాతాపిన్యుపనిషత్.) రస సాగ రా లం టే శ్రీరాధాకృష్ణులే.

శ్లో॥ మహా పద్మాటవీ సంస్థా కదంబ వనవాసినీ,
సుధాసాగర మధ్యస్థా కామాక్షీ కామదాయినీ॥

(శ్రీ లలితా సహస్రనామం)

రససాగరం శ్రీమాతదృష్టి. ఆ భృకుటీ విలాసం భక్తుల సమస్త అభీష్టాల్ని సిద్ధింపచేస్తుంది. శ్రీ కామాక్షీమాత కృపాదృష్టి 64 రకాలు. ఒక్కొక్క రకమయిన దృష్టి ఒక్కొక్క కామాన్ని పూరించి, దివ్యశక్తి ననుగ్రహిస్తుంది. ఆత్మానందాన్ని విస్తరింపచేస్తుంది. బ్రహ్మాది సమస్త దేవతలు ఆ కృపాదృష్టి నిమిత్తం లాలాయితులు.

జీవులకా కృపాదృష్టి ఎలా లభిస్తుంది? "అకారాది క్షకారాంత వర్ణనిర్మిత విగ్రహా." (శ్రీలక్ష్మీ సహస్రనామం.) భగవతి అకారాది క్షకారాంత వర్ణ స్వరూపిణి. దేవతా సాక్షాత్కారమంటే ఏమిటి? షట్చక్రాలలోని అక్షరాలు అనుభవ గమ్యాలవటమే.

ఉపాసన అంటే ఏమిటి? అక్షర స్వరూపమయిన భగవం తుని లేదా ఆత్మను ఇంద్రియ నిగ్రహ పూర్వకంగా మంత్ర జప రూపంగా అనుభవించటమే. ధర్మానుష్ఠానమంటే ఏమిటి? వేదోక్త పద్ధతిలో మనోవాక్కాయల్ని నియమించి, అంతస్సత్యాన్ని విశ్వ వ్యాపకం చేయటమే. వేదాలంటే ఏమిటి? అంతర్ముఖుల అంతరం గమునుండి అవతరించిన అంతస్సత్యాలు. జ్ఞానమంటే ఏమిటి? జ్ఞాని అనేవాడుండడని గ్రహించటమే. జీవుడు అక్షరరూప మవటమే జ్ఞానం. ఈ దివ్యజ్ఞానమే భౌతికంగా అకారాది క్షకారాంత వర్ణ సము దాయమై, సమస్త వ్యవహారాలకు—లోకజ్ఞానానికి ఆధారమవుతోంది. అంతస్సత్యమంటే ఏమిటి? ఆత్మ. ఆనందమంటే ఏమిటి?

"జీవుల దర్శనశక్తి సహజంగా ఆత్మ. అది బాహ్యాభ్యంత రాలందు నిండాలి. జీవుడు సమస్త బ్రహ్మాండాలందు నిండాలి. వ్యష్టి సమష్టి కావాలి, సమిష్టి వ్యష్టి కావాలి. అలా యత్ర తత్ర సర్వత్ర బ్రహ్మాండాలలో లేక భూతాలలో చరించాలి. భగవంతుని భజించాలి. అంటే ఆత్మానుసంధానం చేయాలి, సమాన మనస్థితితో సర్వగ తుడై, సర్వసముడై, సర్వాతీతుడు కావాలి. జీవుడు ఆరురుక్షువై, యోగియై, జ్ఞానియై, ఏదీ కాకుండాలి. అ:! దాన్నే 'ఆనంద' మంటారు. (భగవద్గీత అ 6 శ్లో 30—31.)

శ్లో॥ నిర్మానమోహాజిత సంగదోషా
అధ్యాత్మ నిత్యావిని వృత్తకామాః,
ద్వంద్వైర్విముక్తాః సుఖదుఃఖ సంజ్ఞై
ర్గచ్ఛన్త్య మూఢాః పదమవ్యయం తత్॥

(భగవద్గీత అ 15—5 శ్లో.)

"మానం నష్టమయిందా, మోహం జయించబడిందా. ఆసక్తి పరమాత్మ యందు సిద్ధించిందా, సర్వ కామనలు నశించి నిరంతర ఆత్మ సంస్థితి లభ్యమయిందా. చాలు, అట్టి సుఖదుఃఖాది ద్వంద్వ నిర్ముక్తులగు జ్ఞానులు అవినాశీ పరమపదాన్ని పొందుతారు?

గోలోకం అట్టి పరమపదం — రసధామం. అదే యిన్ని బ్రహ్మాండాలుగా బాహ్యంలో వ్యాప్తమై మరియు అంతరంలో సహస్రారంగా ఉంటోంది. ఆహ్వానం! ధర్మఘంట మ్రోగుతుంది: సాధకులారా! ఇంకెందుకు ఆలస్యం? సత్వరం సహస్రారానికి దయచేయండి.మీ ధర్మకర్మలు సఫలాలవుతాయి. మీరు ధన్యులవుతారు."

"జీవుడు తన త్రికరణాలు మనోవాక్కాయల్ని ఈశ్వర స్వరూపంగా ఉన్న విశ్వంలో విశ్వప్రాణుల సుఖం నిమిత్తం త్యాగం చేయాలి. అప్పుడే గీతావాణి వినవస్తుంది, ఆత్మానందం సిద్ధిస్తుంది, భగవద్దర్శన మవుతుంది. శ్రీకృష్ణ కృప లేక ఆ మార్గదర్శకత్వం లభిస్తుంది. ఇంక జీవునకు స్వీయ మనస్తత్వాల సంఘర్షణ ఏముంది? (భగవద్గీత అ 18—శ్లో 54.)

ఒకటేమాట! శ్రీకృష్ణుడు మాత్రమే విభిన్న ధర్మ సంఘర్షణల నుండి, క్షుద్ర మనః ప్రవృత్తులనుండి, త్రివిధ తాపాల నుండి జీవుని ఉద్ధరింప సమర్థుడు. శాంతిదాత—శాంతి స్వరూపుడు.

(భగవద్గీత అ 18—శ్లో 62.)

ఒకటేమాట! ప్రతి మానవుడు అర్జునుడు కావాలి. అతని కనుల ముందునకు ప్రతి క్షణం గీతోపదేశం నిమిత్తం, పథ ప్రద

ర్శనార్ధ శ్రీకృష్ణ భగవానుడు దిగి రావాలి. అప్పుడే ఈ శరీరం— భారతభూమి 'ధర్మక్షేత్ర' గౌరవాన్ని పొందగలుగుతాయి.

ఒకటేమాట! ఆత్మ పరితాపం ఆ ఆత్మకు సర్వ భూతాత్మకు శ్రీకృష్ణ రూపాన్నిచ్చి ప్రత్యక్షం చేయిస్తుంది.

వర్ణాశ్రమ ధర్మాల్ని అర్జునునిచే అనుష్ఠింప చేయటానికి పరమాత్మ గీతోపదేశం ప్రారంభించాడు. చివరకు తనకు శరణాగతి చేయవలసిందిగా బోధిస్తూ ఉపదేశాన్ని ఉపసంహరించాడు.

ఒకటేమాట! భగవద్గీతకు శరీరం ధర్మం—ప్రాణం భక్తి.

ఈ చతుర్దశ భువనాలకు శరీరం ధర్మం—ప్రాణం భక్తి.

భక్తికి — జ్ఞానానికి భేదం ఎంతమాత్రం లేదు. వస్తు స్థితి ఒక్కటే.

ధర్మంనుండి ప్రేమ జన్మిస్తోంది. కాన ధర్మ ప్రేమల సంబంధం అపరిచ్ఛేద్యం—అగాధం—నిస్సంశయంగా అమృతం.

"సత్య సంభాషణమే నీ లక్ష్యంకాదు, సత్యమే నీవు కా!" ధర్మాచరణమే నీ లక్ష్యం కాదు, ధర్మమే నీవు కా! ప్రేమించటం మాత్రమే నీ లక్ష్యం కాదు, ప్రేమ స్వరూపమే నీవు కా! దైవారాధనయే నీ లక్ష్యం కాదు, దైవమే నీవు కా! ఆనందం వేరు, నీవు వేరూకాదు, ఆనందమే నీవు కా!"

(త్రిజగద్గురు శ్రీరామతీర్థ స్వామిజీ)

శ్లో॥ ఆచార ప్రభవో ధర్మో ధర్మేణార్థంచ సాధనం,
కామం తద విరోధేన మోక్షతో సుకరోభవేత్॥

ఆచరణనుండి ధర్మం జన్మిస్తుంది. ధర్మంగా ద్రవ్యం సంపాదించాలి, కామం కూడా ధర్మబద్ధంగా ఉండాలి. అంతే! ఇంక మోక్షం అత్యంత సులభం.

"అంతిమ సందేశం. పాఠకా! ఈ గ్రంధాధ్యయనానంతరం ఏకాంతంలో కూర్చొని నిశ్చల మనసుతో ఆలోచించు. దేహత్యాగం చేసేలోగా ఈ జీవితంలో ప్రయత్న పూర్వకంగా చేయవలసింది ఏమయినా ఉందా? లేదా?"

(గ్రంధకర్త.)

ఒకటేమాట! ధర్మ ప్రభువు శ్రీకృష్ణభగవానుడు ఈ సమస్త ప్రాణులకు అక్షయ ధర్మబుద్ధి ననుగ్రహించుగాక!

"ఓం భూర్భు వస్సువః, తత్సవితుర్వరేణ్యం,
భర్గో దేవస్య ధీమహి, ధీయోయోనః ప్రచోదయాత్."

"గాయత్రీ మంత్రార్ధం; ఏ పరమాత్మ బాహ్యంలో సూర్య జ్యోతిగా హృదయంలో జీవజ్యోతిగా వర్తమానుడై, బుద్ధిని కల్పించి. ఆత్మజ్ఞానాన్ని ప్రకాశింప చేస్తున్నాడో అట్టి పరమాత్మ మా బుద్ధుల్ని సదా సన్మార్గంలో ప్రవర్తింప చేయుగాక!"

శ్లో॥ స్వస్తి, ప్రజాభ్యః పరిపాల యంతాం
న్యాయేన మార్గేణ మహీం మహీశాః,
గో బ్రాహ్మణేభ్యః శుభమస్తు నిత్యం
లోకాస్సమస్తా సుఖినో భవంతు॥

"కళ్యాణ మగుగాక! లోకమంతా సుఖించుగాక !!

అదెలా సాధ్యం? మహారాజు ప్రజల్ని న్యాయంగా పరిపాలించి నప్పుడు, గో బ్రాహ్మణులు సుఖంగా ఉన్నప్పుడే సాధ్యం". ఇది ధర్మ సిద్ధాంతం..

శ్లో॥ కాయేన వాచా మనసేంద్రియైర్వా
బుద్ధ్యాఽఽత్మ నావాను సృత స్వభావాత్,
కరోమి యద్ తత్ సకలం పరస్మై
నారాయణాయేతి సమర్పయేత్ తత్॥

(శ్రీమద్భాగవతం స్కం 11—అ 2—శ్లో 36.)

" శరీరం—వాక్కు—ఇంద్రియాలు—మనసు మొదలయిన వాని సహాయంతో నేనేకర్మలుచేసినా అవి స్వసుఖార్థం కాక, నారాయణుని మాత్రమే సంతోషింప చేయుగాక!" ఇది భక్తి సిద్ధాంతం.

"ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

"మానవుల ఆధ్యాత్మిక-అధిదైవిక-అధి భౌతిక తాపాలు శాంతించుగాక!"

శ్రీ కృష్ణార్పణమస్తు.

# ' ధర్మఘంట ' విషయ సూచిక

16) అందరూ ఊరకనే సాధువులవుతారా? జీవితంలో చచ్చి, చెడినవాడు మాత్రమే సాధువవుతాడు.

17) సాంఖ్యమంటే తత్త్వం లేక జ్ఞానం.

18) కాశీ వెళ్ళితే పాపాలు పోవు! ఏల? పాపాలు పోవాలని వెళ్ళుతున్నావు కనుక. నిష్కామ కర్మ వలననే పాపాలు నశిస్తాయి.

19) ఒకే కర్మకు, ఒకే ప్రమాణంలో ఉన్న కర్మకు ఫలంలో హెచ్చుతగ్గు లుంటాయి.

20) భగవద్విస్మరణకు మించిన పాపం మరొకటి లేనేలేదు.

21) ఏ సుఖాన్ని నీవు కావాలనుకుంటావో దాన్ని ముందుగా పదిమందిచే అనుభవింపచేయి.

22) ధర్మమంటే జీవితం. ధర్మం వేరూ—జీవుడు వేరూ కాదు, ఆ ధర్మమే ఈ జీవుడు.

23) ధర్మం విషయ సుఖాలు కావాలనుకొనేవారికి కూడ అత్యంతావశ్యకం. ధర్మం విషయ సుఖాల్ని ప్రసాదిస్తూ వానిని త్యాగం చేయగల పాఠాన్ని మానవులకు బోధిస్తుంది.

24) ధర్మం సమస్త బ్రహ్మాండాల్ని, దేవతల్ని మానవ శరీరంలోనికే ఆకర్షిస్తుంది. మానవ శరీరంలోనే అప్రకటంగా వున్న పై వారిని ప్రకటం చేస్తుంది.

25) "చేయించేవాడు ఈశ్వరుడే. మాకు కర్తృత్వం లేదని" ఉచ్చకోటికి చెందిన శరణాగతులు ప్రగాఢంగా విశ్వసిస్తారు, అట్టివారు ప్రమాదవశానకూడ ఎప్పుడూ పాప ప్రవృత్తులు కారు.

26) " నేను—ఆనందం; కర్త కర్మ; ఎక్కడినుండి వచ్చాయి? సమాధానం క్రియ. అంతే.

27) ఒక్కొక్క మానవుడు మంచి చేయాలనుకొంటాడు, అయినా చేయలేడు. దీనికి కారణం ఈశ్వరుడా? కాదు, మనసు. యంత్రంలో లోపం. దీన్ని బాగుచేసుకోవాలి.

28) షోడశ సంస్కారాలు. ప్రయోగం—యాగం ఈ సంస్కార ప్రభావానికి ఎంతమాత్రం సరిరాదు.

29) మానవ శరీరంలో మాత్రమే సిద్ధి లభిస్తోంది. అదయినా కర్మ చేస్తేనేమాత్రమే.

30) ఎలా మాట్లాడాలి?

31) దుర్మార్గుల్ని—దుర్మార్గాన్ని ద్వేషించి, నిందించరాదు. అలా చేస్తే నీవు దుర్మార్గునివై, అందరిచే నిందింప బడతావు.

32) నరుడా! కర్మఫలం గురించి ఆలోచించకు.

33) నరుడా! సోమరిగా ఉంటే ప్రకృతి నిన్ను శపిస్తుంది. కర్మ చేయననే అధికారం నీకు లేదు.

34) కర్మకు మూలం కామనలు. సమస్త కామనల బిందు స్థానంలో ధర్మ ప్రభువుకు ప్రాణప్రతిష్ఠ జరుగాలి.

35) ఒక తరగతినుండి మరొక తరగతికి విద్యార్థి ఎలామార్పు చెందుతుంటాడో అలాగే ఒక సమస్య లేదా సంఘటననుండి—శరీరాన్నుండి మరొక సంఘటనకు—శరీరానికి మార్పు చెందుటలో జీవుడు తటస్థుడుగా — అసంగుడుగా — ధీరుడుగా ఉండాలి.

36) ఇంద్రియ నిగ్రహం ఒక్కటి మాత్రమే ఇంద్రియ బలాన్ని వృద్ధిచేసి దీర్ఘాయువు నీయగలుగుతుంది.

37) దైవమంటే ఈ భూతాలలో—భూతదయలో — ధర్మంలో నిహితమైఉండే తత్త్వం, పైవి లేనివానికి దైవభక్తి ఉండటం, చెప్పాలా! కలలోని వార్త.

38) ధర్మ కర్మల అవసరం అజ్ఞానికే గానీ జ్ఞానికి లేదు.

39) ఆదిలో సగుణం—తరువాత నిర్గుణం.

40) తల్లిదండ్రుల ఉపదేశం ప్రారంభంలో అందకుంటే ఇంక ఎట్టి మహాపురుషుడు కూడ ఆ దౌర్భాగ్య జీవునిదయ చూడలేడు.

41) విషయ సుఖాలు కావాలనుకొనేవాడుకూడ విధిగా శ్రీహరిని భజించాలి.

42) కర్మయొక్క వివిధ స్వరూపాలు.

43) ఒకటే బీజం ఇలా అనేకమై, చివరకొక్కటిగా మిగలుతోంది.

44) "గోపాలా! నేను నీవాడను. నీవు నావాడవు కావాలి. ఇట్టి భావ సంసిద్ధియే శరణాగతికి ఫలం.

45) అనుభవం - శాంతి.

46) ఆత్మశక్తి - పరమాత్మ ప్రాప్తి లేదా కృపకు గీతా పరిభాషలోని పరం 'శాంతి'.

47) జీవుడు ఆరురుక్షువై, యోగియై, జ్ఞానియై, చివరకు ఏదీ కాకుండాలి!

48) ఒకటే మాట! భగవద్గీతకు శరీరం ధర్మం-ప్రాణం భక్తి.

49) జీవుడు ధర్మాన్ని ఆచరించడం మాత్రమే కాదు, స్వస్వరూపమై యున్న ఆ ధర్మాన్ని బాహ్యాంతరాలందు వ్యాప్తం చేసికొని, అనుభవించాలి.

50) " విమృశ్యైత దశేషేణ యథేచ్ఛసితథాకురు".
(భగవద్గీత అ 18-శ్లో 63.) నరుడా! చాల రహస్య జ్ఞానాన్ని నేను నీకు చెప్పాను. చెప్పటంవరకే నా ధర్మం. చక్కగా ఆలోచించుకో. ఆచరించటం నీ యిష్టంపైననే ఆధారపడియుంది.

# ప్రశ్నలు

1) మానవుడు యోగి కావటం ఎలా ?
2) సుఖదుఃఖాలంటే ఏమిటి ?
3) భగవంతు డంటే ఏమిటి ?
4) విషాదయుక్తుడైనప్పుడు మానవుడు ఏంచేయాలి ?
5) భగవద్గీత చెప్తున్న దేమిటి ?
6) దేన్ని మోహ మంటారు ?
7) వర్ణాశ్రమ ధర్మాలు ఎందు నిమిత్తం ఏర్పడ్డాయి ?
8) చాతుర్వర్ణ వ్యవస్థకు, భగవంతునకు ఏమిటి సంబంధం ?
9) దేవేంద్రుని జీవితం ఏమి నీతిని చెప్తోంది ?
10) సత్కార్యానికి సత్ఫలితం వెంటనే కనుపింపదేమి ?
11) 'ఇది ధర్మ' మని గుర్తించడం ఎలా ?
12) ధర్మాన్ని ఎంత ప్రయత్నించినా ఆచరించటం సాధ్యం కావటంలేదు. ఏం చేయాలి ?
13) ఆచరణలో మార్పు రావటానికి ఏం చేయాలి ?
14) ఒకరికి శిరసు వంచటం హీనం గదా ? ఎందువలన దానికి గొప్పతనం వచ్చింది.
15) జీవహింస పాపమని అందఱకూ తెలుసు. మరి శ్రీకృష్ణుడు అర్జునునిచే ఎందుకు యుద్ధం చేయిస్తున్నాడు ?
16) ఎట్టివాన్ని 'మానవు' డనాలి ?
17) ఎట్టివార్ని 'పండితు' లంటారు ?
18) ఒకరిని ద్వేషించడం తప్పు, ప్రేమించటం ఎందువలన తప్పు ?

19) స్మృతులు మానవులకు ఏం చెప్తున్నాయి ?
20) భగవద్గీతా పఠన మంటే ఏమిటి ?
21) ఎవడు జ్ఞాని ?
22) భగవంతుడు చేసే ధర్మ సంస్థాపన ఎటువంటిది ?
23) అంతటి మహా తపస్వి మాండవ్యుడు ఎందుకు హింసింప బడ్డాడు ?
24) పురాణ వచనాలు సత్యమా ? అసత్యమా ? వ్యాఖ్యానించు?
25) దేన్ని మృత్యువంటారు ?
26) విక్రమార్కుడు శూద్ర చోరుని కాళ్ళు-చేతులు ఎందుకు తీయించాడు ?
27) దాక్షాయణి చరిత్ర ఏమి నీతిని చెప్తోంది ?
28) పారివారిక జీవనం వలన సత్ఫలితమా ? దుష్ఫలితమా ? వాఖ్యానించు ?
29) భగవంతుని శాపం స్త్రీకి ఈ వైధవ్యం ! వ్యాఖ్యానించు ?
30) ధర్మంవలన లాభాలేమిటి ?
31) దైవమా ? పౌరుషేయమా ? ఏది ? ఎందువలన ?
32) విశ్వకళ్యాణం సిద్ధింప చేయాలంటే కర్మ ఎలా ఉండాలి ?
33) మనసు మంచిదయిన చాలదా? శరీరంతో ఎందుకు కర్మ చేయాలి ?
34) ధర్మాచరణకు భగవంతుడు పూర్వజన్మ జ్ఞానమిస్తే ఎంత బాగుండేది ?
35) షోడశ సంస్కారాలు ఎందుకు ఏర్పడ్డాయి ?
36) పాపబుద్ధి నశించనంత వరకు మానవుడు పాపం చేస్తూనే వుంటాడు. అది నశించడం ఎలా ?

37) మానవ జీవితానికి సంకీర్తన ఒక్కటి సరితోతుందా?

38) "సతతం కీర్తయంతోమాం" అనే శ్లోకానికి అర్ధమేమిటి ?

39) "ఇన్ని ప్రాణుల్ని హింసిస్తున్నావు, నీవుతప్పక హింసింప బడతావు. ఎందుకు జీవహింస చేస్తున్నావు ? " దీనికి రత్నాకరుని సమాధాన మేమిటి ?

40) ఒక శ్రీమంతుడు బజారున వెళ్తుంటే అతని జేబులోని వది రూపాయల నోటు గాలికి ఎగిరిపోయింది ! ఆనోటు లేనందు వలన శ్రీమంతునకు నష్టంలేదు, దానివలన వేరొండు దరిద్రునకు చాలా లాభముంది. దరిద్రుడు ఆనోటును గ్రహించటం న్యాయమా ? అన్యాయమా ? ఎందువలన ?

41) మానవ జీవితాన్ని చరితార్ధం చేసే సాధనాలేమిటి?

42) నామాన్ని ప్రకటం చేయటంవలన ఆయువు క్షీణిస్తుంది. రహస్యం ?

43) రత్నాకరుడు పాపఫలంగా దుఃఖించటానికి కారణమేమిటి ?

44) భరతుని అభ్యర్ధనకు శ్రీరాముని ఉత్తర మేమిటి?

45) "నాయందు ఫలాపేక్ష నుంచి ఇతరులు నన్ను దుఃఖింప చేస్తుంటే నేనేం చేయాలి ?"

46) గోపాలుడు నిష్కామ కర్మయోగి. ఎందువలన ?

47) "అలవాటు ఆజన్మాంతరం అలాగే నిలిచి ఉంటుంది." వ్యాఖ్యానించు ?

48) "పశువులు పొట్టనిండా మేతమేసి తమదారి తాము చూచు కొనేవి?" ఏమిటీ సంతర్భం ?

49) మహాభారతంపై నీ అభిప్రాయ మేమిటి? ప్రామాణి
కంగా వివరించు?

50) సద్వస్తువులన్నీ భగవత్స్వరూపం. జూదం భగవత్స్వరూ
పం ఎలా అవుతుంది ?

51) భగవద్దర్శనాన్ని పొందిన ఎంతటి వారికీ కూడ వాసన
నివృత్తి కాలేదు. దానికి నివృత్తి ఉందా ?

52) భగవత్సాక్షాత్కారం పొందవచ్చు, సిద్ధుల్ని బడయవచ్చు,
పరలోకాలకు వెళ్ళవచ్చు, బ్రహ్మను భూలోకానికి రప్పించ
వచ్చు. అయితే అసాధ్య మేమిటి ?

53) ధర్మ కర్మల అవసరం, అజ్ఞానికే గానీ జ్ఞానికి లేదు.

54) 'భగవానువాచ' అంటే ఏమిటి ? ఎవడా భగవంతుడు ?

55) ఈ సుందర సత్యానికి అతిసుందర రూపకల్పన ధ్రువచరిత్ర
ఏమిటా సత్యం ?

56) మంత్రజపం ఏం చేయగలదు ?

57) భగవత్పూజా రహస్యం చెప్పు ?

58) ఇప్పుడు మానవ జీవితం దివ్యదై వీ సంపద్విలసితం.
ఎప్పుడు?

59) పారివారిక జీవనంలో కుమారున కెందులో గౌరవం?

60) నిర్జల భూమిలో నిర్మల పరమాత్మ కృప ప్రకాశిస్తుంది.
దీనికి ఉపమాన మేమిటి ?

61) దేన్ని ఆనందమంటారు ?

62) మానవ జీవితానికి 'రస' మేమిటి ?

63) గ్రంథకర్త పాఠకునకు ఏం సందేశమిచ్చాడు ?

64) పాఠకుడు గ్రంథకర్తకు ఏం చెప్తున్నాడు ?

" ఈ ప్రశ్నలకు సమాధానాలు కావాలంటే 'ధర్మఘంట'ను ప్రారంభంనుండి మళ్ళీ చదవాలి. "

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.



# ఈ గ్రంథంలోని ఉద్దేశం :-

# భగవానుడెంత దయాళుడు !

1) జీవన రథసారథి; ఆయన లేకుంటే జీవితమే లేదు. ప్రతివాడు తననిగూర్చి 'నేను' అని చెప్తాడు. ఆ 'నేనే' దేవుడు. ఆ దేవుడు దేవుడుగా కనులముందుకు రాడు. సారథిగా వస్తాడు.

2) దేవునకు అవయవాలు ధర్మం. ధర్మమంటే జీవుని లోని జీవత్త్వమే, అలా సారథిగా వచ్చి ఈ జీవత్త్వానికి పుష్టిని స్తాడు. భగవానుడు దయాళుడంటారా ? కాదంటారా ?

3) మానవుడు దేన్ని ఉన్నదని అంగీకరిస్తాడో అదే దేవుడు. ఉన్నదేదంతా దేవుడే. దేవున్ని దేవునిగా అంగీకరించని వారు కూడ ఈ నిత్య సత్యాన్ని అంగీకరించి తీరవలసిందేగదా ! దేవుడు అవాఙ్మానస గోచరుడే. అయినా మనోవాక్కాయాలతోనే సంకేతం చేయాలి. ఆయన దయాళుడు, కాన వీనికి పట్టుబడుతాడు కూడ.

4) "సర్వస్య చాహం హృది సంనివిష్టోమత్తః స్మృతిర్జ్ఞాన మపోహనంచ." అందరి హృదయం ఆయనయే. ఆయన వలననే ఈ జీవులకు స్మృతి, జ్ఞానము, దోష నివారణ శక్తి లభిస్తున్నాయి, ఆయన నందరు అనుభవిస్తున్నారు. ప్రత్యక్షంగా చూడా

అంటేమాత్రం జీవుడు విషాదయుక్తుడు కావాలి. ఆయన దయాళుడు! అకారణ దయాళుడు !!

5) నాస్తికులయెడల, పాపాత్ముల ఎడల భగవానుడు అమిత దయాళుడు. దయాళుని దయాళుత్వము ఋజువయేది వారి వలననేగదా: నిరాకారుడు అవతరిస్తున్నాడు. అదయినను భూలోకాననే. లీలలు ప్రదర్శిస్తున్నాడు మానవశరీరంలోనే. ఈ శరీరాన్ని సద్వినియోగం చేసికొనటం ఎలాగో చెప్తున్నాడు దయాళుడంటారా? కాడంటారా?

6) భగవానుడు తల్లి తండ్రి. "సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వామాం శాంతి మృచ్ఛతి." సమస్త భూతాలకు అకారణంగా హితం చేయువాడు, సుహృదుడు. జఠరాగ్నిగా ఆహారం జీర్ణం చేస్తున్నాడు, వాగ్రూపంగా వ్యవహారాలు చేస్తున్నాడు, కంటి వెలుగుగా, అవయవాలకు ఆయా ధర్మాలుగా వానికి పుష్టి నిస్తున్నాడు. జీవునకు శాంతి ఆయనకు శరణాగతుడవటంలోనే ఉంది.

7) అటువంటప్పుడు జీవుడు ఆయనకు కృతజ్ఞుడు కావలసిందే, శరణాగతుడు కావలసిందే, అలా కావటం లేదు. పైగా భగవద్ద్రోహం—విశ్వద్రోహం చేస్తున్నాడు. నాస్తికుడై దైవశక్తిని—ఆత్మశక్తిని హత్యచేస్తున్నాడు. అయినా ఆయన కృప వర్షింపబడుతోంది కాననే జీవుడు ఈమాత్రంగానైన జీవింప గలుగుతున్నాడు. భగవానుడు దయాళుడంటారా? కాడంటారా? ఇంకా తెలిసికొనాలంటే 'ధర్మఘంట' చదవాలి.